


౧౬. సంపుటం. ప్రమాది, చైత్రమాసము ( 1939) ఏప్రిల్ సంఖ్య. ౪

# ప్రే మ వి జ య ము

శ్రీ కొమరవోలు వెంకటసుబ్బారావు

నాఁడు జగజ్జనమ్ములు వణంకిరి భీతిలి, యొక్క ప్రాణికై
గోడున లోకమెల్లను దిగుల్పడె రాజ్యము లేలు ప్రోడ ల
ల్లాడిరి కాలు సేతు లెటు నాడక యీ ముది బక్క శెట్టి యే
నాఁ డుపవాసదీక్షను గొనక సుముహూర్తము నిర్ణయించెనో.

ఇతఁడు హిమవన్మహీధరోన్నతయశస్వి
యితఁడు భువనైకభీకరోద్ధతతపస్వి
యితఁడు మార్తండమండలోర్జితమహస్వి
యితని గొనరించు రాజ్యమ్ము లేటికోళ్లు.

పస్తుండి సామ్రాజ్యవర్తులెల్లరఁబట్టి యూగించినట్లై యీయూరజోగి,
యుప్పుగంటికి దాడి నొనరించి భువనమ్ము భయపెట్టినట్లై యీ బచ్చుబిడ్డ,
నూలుపోగునఁ గట్టి కూల రాజ్యము నీడ్చి పడఁగొట్టినట్లై యీ బక్క శెట్టి
యోర్మి యాయుధముగా నుర్వినెల్ల జయింప సమకట్టినట్లై యీ సన్నజోదు

సాధ్వసము గొల్పి భటసహస్రమ్ము చెఱచి
కొల్లగొట్టినయట్టులే కొల్లగొనియె
మహిని జేసాచి యానబర్మతిఫకీరు
ప్రేమజయ మింతకన్న నిం కేమి కలదు ?

తీయని తేనెమాటలును తెల్లని వెన్నెలవాక దాటులున్
కోయిలసాని పాటలును కుజ్ఞతనంపు మిటారియాటలున్
నాయకరంపు సీటులును నైగమశాంతి వధూటు లొక్కమై
నీయుగవర్తిఁ గాంచినపు డేలొకొ డెందమునందు దోఁచెడున్.

*   *   *   *   *

అతనికిఁ గత్తియుండ దతఁడాడినమాటయె కత్తివ్రేటు సా
మ్యతకు సహిష్ణుభావమున కాతని కన్నులె సేవధుల్ మహా
మతియగువాని యానలను మక్కువ నౌదల దాల్చి మేదినీ
పతులు తదీయశక్తికి నుపాయన మిత్తురు వారిసంపదల్.

అతఁడాడినమాట నడుగుదాటగలేవు చక్రవర్తు లొనర్చు శాసనములు
నతఁడు చేసినచేత నతికరింపగలేవు పంద్రెండు దేశాల పలుకుబళ్లు
నతఁడు గీసినగీత కడ్డువెట్టగలేవు సంగ్రామ చతురంగ సాధనములు
నతఁడు నవ్విన నవ్వ నైన నాగగలేవు పాశ్చాత్యరాజన ప్రధనదృష్టు
లతని యాధ్యాత్మశక్తిచే నగడువడియె
హింసతోఁ గాలువెట్టిన హీనశక్తి
కత్తికిని బ్రేమ నేర్పిన ఘనుఁ డతండు
ప్రేమజయ మింతకన్న నింకేమి కలదు ?

విశ్వ మాతనిలోనున్న భీమరసము
కంటె ప్రేమరసమ్మునే ఘనపటిష్ఠ
శక్తిగా నెంచి యతని వశత్వమొందె
ప్రేమచే గెల్చె నతఁ డిట్లు విశ్వమెల్ల.

కత్తి కత్తిరింపఁగఁగల్గు గండ లొకఁడె
కరుణ యంతరంగముగూడ గత్తిరించు,
నున్నదానిని బరిమార్పనోపు హింస
లేనిదానిని బ్రేమ కల్పింపనోపు.

వైరి వైరస్యమును వృద్ధిపఱచుచుండు
క్రౌర్యభావమ్ము వెళ్ళగ్రక్కు — ఖడ్గధార
మిత్రుల కమిత్రులకుగూడ మేలుగూర్చి
కూర్మిఁ దనవారిగాఁ జేసికొనును ప్రేమ.

కత్తి నెదిరించు ప్రాణులు కలుగవచ్చు
ప్రణయశక్తికి లొంగని ప్రాణి లేదు
ప్రేమ నెదిరించి కత్తి దర్పించినపుడు
పంచకరపాట్లు పడలేదె పశుబలమ్ము.

* * * * *

ప్రాణమ్ముల్ బలిగోరుచుఁ ధరణి క్షుద్రాసక్తి భక్షింపుచున్
శ్రేణింగూడి రణాధిదేవత ప్రతీచీ నాట్యముఁ సల్పుచో
త్రాణ మ్మేమియు లేక కుందుపడు నీ ప్రాక్సీమ కెవ్వాఁడు ని
ర్వాణానందము గూర్చె, వానికి నమోవాకంబు లర్పించెదన్.



# సంస్కృత వాఙ్మయమున శబ్దశాస్త్ర ప్రచారము

శ్రీ కొత్త సత్యనారాయణచౌదరి

సమగ్రము, నుత్కృష్టములగు వాఙ్మయములకెల్ల సంస్కృత వాఙ్మయమే తలమానిక మనుట ప్రాచ్య పాశ్చాత్యపండితు లొప్పుకొన్న మాటయే. విశిష్య, యీ వాఙ్మయమున భారతీయులకు శబ్దశాస్త్రమం దున్నట్టి యాదరము చాలగొప్పది. శబ్దశాస్త్ర ప్రచారము భారతీయులలో ఎన్నాళ్లనుండియో కానిపించుచున్నది. తద్వృద్ధి క్షయములను గూర్చియే ప్రకృతము పరిశీలింతము.

తొలుత, వైదిక భారతీయుల అసాధారణ సద్గ్రంథమగు ఋగ్వేదమందె తద్వ్యాకరణ విషయక ప్రసంగము కొంత నడచినది. "చత్వారిశృంగాః, సప్తసింధవః" అను రెండు వాక్యములు ఆ వేద మందలివి. మొదటిదానికి, 'నామ- ఆఖ్యాత- ఉపసర్గ- నిపాత' లనియు; రెండవదానికి 'సప్తవిభక్తు'లనియు పతంజలి మహర్షి నిర్వచనము. వేదయుగానంతరము ఈ శబ్దశాస్త్ర ప్రసంగము బ్రాహ్మణములలో ప్రవేశించి ప్రాతిశాఖ్యలలో పరిపుష్టి నొందినది. సంధులను స్వరములను గూర్చియు; ప్రకృతి ప్రత్యయ విభాగమును గుఱించియు ప్రాచీనులకు దెలిసియే యున్నటులు వేదపాఠము చెప్పుచున్నది. వేదోచ్చారణమందు స్వరభేదము రవ్వంత కలిగినను ప్రత్యవాయ జనకమగునను విశ్వాసము వైదిక భారతీయులకుండుటచే ఆనాటికే తదుచ్చారణోపయోగములగు సంధి స్వరాది విషయములను దెలిసికొని యుండిరి.

పిదప, యాస్కనిరుక్తము, ఏతచ్ఛాస్త్ర విషయమయి చాలవఱకు పాటువడినది. ప్రాచీనులు నుదీచీనులునగు వైయాకరణుల మతభేదములను గూడ యాస్కాచార్యుడు నిర్దేశించినాడు. శాకటాయనుడని, గార్గ్యుడని కొందఱు వైయాకరణులను పేర్కొనినాడు. పదము లన్నియు ధాతుజములని వీని యాశయము. పాణినిమహర్షి కన్న నీతడత్యంత ప్రాచీనుడనియు, సూత్రకాలపు టారంభమున క్రీస్తువునకు పూర్వము ఐదవశతాబ్దిని ఉన్నాడనియు విమర్శకులు కొందఱు సిద్ధాంతపఱచిరి. పాణినీయసంజ్ఞలకును యాస్కసంజ్ఞలకును భేదము కొన్నిపట్టుల కన్పట్టుచున్నది:

"ణిజంత— — —కారిత
యఙ్లుక్— —చర్కరీతమ్" మున్నగునవి.

శబ్దశాస్త్ర వ్యాసంగమున యాస్కుని పిదప 'ఆపిశలి—కాశకృత్స్న' లనువారు పేర్కొనఁబడిరి. పతంజలి మహాభాష్యమున 'అస్తిం సకార మాతిష్ఠతే' అను వాక్యమునకు 'ఆపిశలిః ఆతిష్ఠతే' అని వివరము కలదు. మఱియు, 'కైయటుఁ'డను గొప్పవైయాకరణియు, కాశికాగ్రంథకర్తయు ఈ యిర్వురి విషయము ముచ్చటించి యున్నారు. ఇంతదాఁక జరిగిన శబ్దశాస్త్రవ్యాసంగ మొక యెత్తు; జరుగఁబోవునది అంతయు నొక యెత్తు. తరువాతి వైయాకరణుల కందఱకు సర్వాంగీణ శబ్దవ్యుత్పాదనము చూపి పరమప్రతిష్ఠ నందినవాఁడు పాణినిమహర్షి.

సూత్రకాలపు మధ్యభాగమం దుద్భవించి లౌకికభాషకు ప్రారంభసీమ నేర్పఱచిన వాఁడు - ఈ మహాత్ముఁడే. నాఁటినుండియు నీతఁ డనుశాసించిన నియమములకు లొగ్గి ఒక్కేతాటిక్రింద లౌకిక సంస్కృత గ్రంథము లన్నియు ఒదిగిపోయినవి. ఈతని చరిత్రమును పలువురు పలువిధములుగాఁ జెప్పుకొందురు. 'శాలాతుర' అన్నది యీతని గ్రామ మనియు, 'దాక్షి' అనునామె యీతని జననియనియు, వ్యాడిప్రభృతు లితనికి సమకాలికు లనియు కొందఱందురు. కాని, యీ వాఙ్మయమున చరిత్రాంశము శూన్యమగుటచే కృతులనుబట్టియే, కర్తలకు ప్రతిష్ఠ సిద్ధించుటయు, వారి యూరు పేరులు దూరమగుటయు చిరకాల సంప్రదాయము. కావుననే కాళిదాసాదికవి సార్వభౌములయు పాణిన్యాది మహర్షిసత్తములయు వాస్తవికచరిత్రము అంతగా మనకు గోచరము కావుట లేదు.

పాణిని రచించిన గ్రంథము అష్టాధ్యాయి. శబ్దశాస్త్రమును సూత్రరూపమున బోధించి కృతకృత్యు లయినవారిలో నితఁడే యుత్తమోత్తముఁడు. వ్రాసినవి నాలుగువేల సూత్రములు. వాని కనుకూలపడుటకు, 'అధికారము' లనియు, 'అనువృత్తు' లనియు మఱికొన్నిటిని స్వీకరించెను. సూత్ర గ్రంథములలోనున్న విశిష్టత్వ మిదియే. ఇఁక, అష్టాధ్యాయికి పిదప వైయాకరణు లనేకులు పాణినీయ తంత్రమునకు వ్యాఖ్యానములు కావించిరి. అష్టాధ్యాయిలో ఉన్నవి యున్నటులు సూత్రములనుంచి ఆక్రమమున వ్యాఖ్యానము లొనర్చినవారు కొందఱు. విషయ మంతకు నొకవిధముగ ప్రణాలిక నేర్పఱచుకొని తదనుకూలముగ శీర్షికలను గావించు, చక్కగా పాణినీయ తంత్రమును బోధించినవారు కొందఱు. ఈతీరుగ, ఆ నాలుగువేల సూత్రములే వ్యాఖ్యాన పరంపరలతో పెంపొందుటచే మొన్న మొన్నఁటి భట్టోజీదీక్షితునివఱకు ఈ శబ్దశాస్త్రము కావలసినంత అభ్యుదయమును సంపాదించుకోఁగలిగినది.

అష్టాధ్యాయితోపాటు ఏత ద్విధమగు పరిశ్రమము కావింపఁబూనిన గ్రంథము లింకను మఱికొన్ని కలవు:

(౧) చంద్రవ్యాకరణము
(౨) జైనేంద్రవ్యాకరణము

(3) శాకటాయన వ్యాకరణము
(౪) హేమచంద్రవ్యాకరణము
(౫) కాతంత్రవ్యాకరణము
(౬) సారస్వతవ్యాకరణము
(౭) భోజదేవవ్యాకరణము—ఇవి.

ప్రాయికముగా బౌద్ధపండితులే హెచ్చుగ ఈవ్యాకృతులను రచించుటయు ఆదరించుటయు సంభవించినది. విస్తృతము కష్టసాధ్యము మతాంతరకర్తృకమునగు పాణినీయతంత్రమునకు ఒకింత మార్పు కావించిరి. ఇందు మొదటి చంద్రవ్యాకరణము 'టిబెట్'లో 'తర్జుమా' చేయఁబడ్డదఁట. తొలుదొలుత దీనిని 'జర్మను' పండితులు ప్రకటించిరి. ఈ వ్యాకరణమును గూర్చి భర్తృహరిగ్రంథములలోను మల్లినాథుని వ్యాఖ్యానములలోను జాడ ఒకింత కానిపించుచున్నది. బౌద్ధుఁడగు నీచంద్రుఁడు పాణిని, కాత్యాయనుల సూత్రవార్తికములను మార్చుచు, కొన్నిసూత్రములను నయితము రచించెను. ఈతనిగ్రంథమునకు అంగభూత గ్రంథములు- ఉణాదిధాతుపాఠ గణపాఠములు - పరిభాషలు మున్నగునవి అనువగునట్లు యేర్పడి యున్నవి.

"జైనేంద్రవ్యాకరణము"

'జినుఁడు — మహావీరుఁడు' అని యేతద్గ్రంథకర్తకున్న పేరులు - ఈతఁడు దిగంబరజైనుఁడఁట. ఇతనిగ్రంథమున 3200 సూత్రములని కొందఱు, 3000 సూత్రములని మఱికొందఱు భావింతురు. ఇందు అపూర్వ విషయములు లేవు. పాణినీయమునకు సంక్షేపరూపముగ నుండును.

"శాకటాయన వ్యాకరణము"

'శాకటాయను'లు ఇరువురు కలరు. ఇతఁడు అర్వాచీనుఁడు. శ్వేతాంబర జైనులకొఱకు ఈ వ్యాకరణ మేర్పడినది. అయ్యు, వ్యాఖ్యానములగు అంగభూత గ్రంథములను బట్టి చూడ ఇయ్యది ప్రచుర ప్రచారములో నుండినటులు తెలియుచున్నది. ఆవశ్యకమునుబట్టి మతాంతరులు నయిత మీగ్రంథము గ్రహించిరి. ఇందు నాలుగధ్యాయములు. అధ్యాయమునకు నాలుగేసి పాదములు. మూఁడువేల రెండు వందల సూత్రములు. చాలవఱకు పాణినీయతంత్రమున కియ్యది సరిపోవుచుండును.

'హేమచంద్ర వ్యాకరణము'

హేమచంద్రుఁడును జైనుఁడే. పదునొకండవ శతాబ్దిలో నీతఁడు బొంబాయి రాజధానియందు జన్మించెను. జైనమతమందు ఆచార్యుఁ డయ్యెను. ఈతని గ్రంథమందును- ఎనిమిది అధ్యాయములు, నాలుగేసి పాదములు కలవు. కాని, ఏడధ్యాయములు సంస్కృతభాషకును, ఎనిమిదవది ప్రాకృత భాషకును సంబంధించినవి. హేమచంద్రుఁడు దీనినేగాక, ద్వ్యాశ్రయకావ్య మొకదానిని భట్టికావ్యమురీతి లక్ష్యగ్రంథముగాఁగూడ రచించినాఁడు.

'కాతంత్ర వ్యాకరణము'

ఇయ్యది ఒక్కమతమునకే చెందక సర్వమతములకు సరిపోవునటు లున్నది. ఛాంద

సులు. స్వల్పమతులు- శాస్త్రాంతర రతులు- ప్రభువులు- వ్యాధిపీడితులు. ఆలస్యయుతులు వణిజులు-కర్షకులు- లోకయాత్రాదులందుండు వారు సుఖముగాఁ దెలిసికొనుటకై యేర్పడ్డ దని యీ గ్రంథమువలననే తెలియుచున్నది. కౌమారవ్యాకరణమని దీనికి నామాంతరము. ఇందు వర్ణ సమామ్నాయమందలి వర్ణక్రమము తెలుఁగు వ్యాకరణమం దున్నటులుండును. కావుననే, 'అచ్ - అల్' అను పూర్వ ప్రసిద్ధములగు ప్రత్యాహారములు, తల్లక్షణ ములను జెప్పెడి సూత్రములు - ఇందు అనావశ్యకములైనవి. 'స్వరము వ్యంజనము' అను సంజ్ఞలే గ్రహింపఁబడ్డవి. విషయక్రమమున భట్టోజికౌముదికి సరిపడును. వైదికప్రక్రియాదులు లేవు. ౮౮౫ వ సూత్రములు మాత్రము కలవు. ఈ వ్యాకృతికి హెచ్చు ప్రచారము కలదు. జనసామాన్యము దీనిని అత్యంతము కాంక్షింతురు. పూర్వ వ్యాకరణము లన్నియు పండితమాత్రైక గోచరము లగుటయే దీనికి కారణము. మన ప్రాంతమున, భట్టోజి సిద్ధాంతకౌముదికి ప్రచార మున్నటులు, కాతంత్రవ్యాకరణము నకు వంగదేశములో ప్రచారము కలదఁట. దీనికి, ౧౫, ౧౬ శతాబ్దులలో పెక్కువ్యాఖ్యానము లుద్భవించినవి.

'సారస్వతవ్యాకరణము'

ఇది ౧౬-వ శతాబ్దిలో పుట్టి యుండవచ్చునని విమర్శకుల ఊహ. ఉత్తర హిందూస్థానములో దీనికి ప్రచుర ప్రచారము కలదు. మహమ్మదీయ రాజుల ప్రోత్సాహమునఁ జేసి యియ్యది పుట్టినదని వాడుక. ఇందలి విషయము అతిసంక్షేపముగ నుండును. ౭౦౦ సూత్రములుమాత్రమే యుండి సులభముగా నుండును.

'బోపదేవ వ్యాకరణము'

ఈ బోపదేవుఁడు మహారాష్ట్రుఁడు. ఇతని వాక్యములను మల్లినాథుఁడు పేర్కొని యున్నాఁడు. ఈ వ్యాకరణము కాతంత్రము వలె విషయ క్రమమునుబట్టి యుండును. స్వరాదులను జెప్పుసూత్రము లేవియు నిందుఁ గానిపింపవు. ఇందు, 'హరిహరుల'యు, నితర దేవతలయు పేరులు లక్ష్యములుగా నీయఁబడుచుండును. ఈ పద్ధతిని జూచి కాఁబోలు, తరువాతి వారు కొందఱు సంజ్ఞలకుఁగూడ 'కృష్ణ - రాధ' మున్నగు పేరులు పెట్టిరి. మహారాష్ట్ర దేశీయుల ప్రాబల్యములో మాత్రము దీని కధిక ప్రచారమున్నటులు తెలియుచున్నది. శబ్ద కౌస్తుభములో బోపదేవుని పేరు భట్టోజీ దీక్షితుడు చెప్పియుండుటచే, అంతదాఁక నీ వ్యాకృతికి ప్రచార ముండె ననియు, కాలక్రమమున నన్నింటితోపాటు ఇయ్యదియు నడుగంటె ననియుఁ జెప్పెదరు.

# శ్రీ నాగేశ్వరరాయ స్మృతి

(శ్రీ) గుఱ్ఱప్పడియ అంజనేయులు

కటకట! కోలుపోయినది కల్పమహీజము నాంధ్రమాత; ది
క్తటముల నావరించినది కావిరి; "బాపురు"మంచు లోక మూ
రటఁగనఁజాలకున్నది; సరస్వతి మూర్ఛిలె; నీమొడంద న
క్కటికము లేదె? మమ్మిటులఁ గాఱియవెట్టితివేల? దైవమా!

ఉరుకారుణ్యపయోధి, విశ్వదుఁడు, దేశోద్ధారకుం, డద్రిసు
స్థిరభావుండు, కళాప్రపూర్ణుఁడగు కాశీనాథనాగేశ్వరా
పరమాహేశ్వరు నంపివైచితివి; తత్ప్రఖ్యాతగాథాగుణ
స్మరణంబే శరణంబు మా కిఁక మనశ్శాంతిం బ్రసాదింపఁగన్.

ఆర్జించినాఁడు విశ్వైకభోగ్యంబుగాఁ దులలేనిధనము లక్షలకొలంది,
రక్షించినాఁడు భూతక్షేమకాంక్షతోఁ గనుఁగొన్న దీనవర్గంబునెల్ల,
కావించినాఁడు దేశావనోత్సాహియై, కారాతమస్సులో గాఢతపము,
పోషించినాఁడు ప్రాగ్భూమిపాలురఁ బోలి, భాస్వన్మహాంధ్రసారస్వతంబు,
త్యాగ మొనరించినాఁ డాత్మయోగి యగుచు
జననభూమాతృసేవను దనువు, మనువు;
మాన్యచారిత్రుఁ డమ్మహామహున కేమి;
ఈయభాగ్యుల భాగ్యంబు లింతెగాక.

అమృతాంజనపుఁదావి కనుఁగుఁదోఁ బుట్టువా తెలికీర్తి నఖిలదిక్కులకు నలఁది,
చిఱుతకూఁకటినాటి చెలిమి మేలిమినొందఁ గళల కింపైన దుర్గముఁ నొసంగి,
విశ్వవిద్యాలయార్పితమైన తనమూర్తిఁ బ్రజలచిత్తములందుఁ బాదుకొలిపి,
కనిపెంచుకొన్న చక్కనిముద్దుగుమ్మలౌ ఆంధ్రభారతుల కల్యాణ మరసి,
ఏడుగడ తాన యని యాశ్రయించియున్న
తెలుఁగుజవరాలి కల్లుని దిక్కుసూపి;
సచ్చిదానంద శివతత్త్వసార మెనసి;
ఈశ్వరైక్యము నొందె నాగేశ్వరుండు.

ఆయవతారమూర్తి యుదయాస్తమయంబులు పూర్వగాథలై
పోవుఁ, దదీయరూపమును బూజ్యతమంబుగ నెల్లగీములన్
బాయక నిల్పి, దైవముగ భావనసేసి భజించి, యాజగ
ద్గేయుఋణంబు నీఁగుఁడు విధేయుఁడ; సోదరులార! వేఁడెదన్.

# కవి దుఃఖము

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

ఓయికవీ! విచిత్రముగదోయి నిజంబుగ నీజనుస్సు, ఓ
హోయికవీ! విచిత్రముగదోయి నిజంబుగ నీమనస్సు, ఏ
దో యొకసంసృతిప్రభవదుఃఖము కల్గిన నీకునై వచో
వ్యాయతి పద్యరూపముగఁ బట్టెదు దాని నిదేమి లోభమో!

ఓయీ! మూర్ఖకవీ! జగత్తునకు లేదో! దాని కున్నంత దుః
ఖాయాసమ్ము; భవత్పురాకృతము దుఃఖం బేటికో పంచె దీ
మాయాముగ్ధులకున్ జగజ్జనులకున్ భాషాభిమానవ్యథా
దాయాదుల్ రసబుద్ధివంచితులు కాదా లోకు లీ నీకృతిన్?

భాస్వద్దౌర్గ్గశలోభు లీజనులు పాపం బూర్జితానందభా
గస్వాముల్ నిను నమ్మినందులకు దుఃఖం బల్ల యానందభా
గస్వామిత్వము పేరఁ బంచుదువు శోకంబున్ రసం బంచు, భా
వస్వారాజ్యమటన్న రూపకముగాఁ బ్రభ్రష్టమేధాతిథీ!

కొందఱు నిన్ను మెచ్చెదరు కొందఱు మెచ్చరు మెచ్చినట్టి యా
కొందఱ నీదుదుఃఖమునకున్ సమభాగులఁ జేయ నమ్మకం
బందున ద్రోహ మేమిటికి నక్కట! దుఃఖము సారె పంచెదే!
పొందినశోకముఁ బరుడో! పుణ్యమొ! ముంగిటఁ బళ్లె ముంపఁగన్.

ఒక్కక్రైస్తవకవి యుదితమాధుర్యరసోత్కటం బగుశబ్ద మూఁదిపలుకు
ఒకబ్రాహ్మమతకవి యుల్లోకమగుకూర్పటదుకులోఁ గూటస్థు డైనవాఁడు
అలగాత్రమీకోకిలాఖ్యయా కవి పంచమస్వరంబును మాట మాట నూఁదు
పరఁగ నిద్ద అదృష్టవంతు లాకవులు చిక్కగ నన్నగాఁ బాడఁగలకు గీతి
ని న్నెవరు మెచ్చుకొందు రీ నేలయందు, పలుకుపెళుసైనయట్టి నిర్భాగ్యకవి!
కలితలౌకికసాంసారికప్రగాఢ, దుఃఖదూషితవాంఛావిధూతమతిని.

ఉర్విని గాని తా మెవరికో! కులకాంతలు పోవలేదా! యీ
యుర్విని గాని తా మెవరికో! పసిబిడ్డలు పోవలేదా! నీ
గర్వమె వచ్చి నిన్నణఁచుఁగాదె కవీ! యవుపో! విరాగితా
ధూర్వహమైన నీయెడఁదతోడి మృషాత్తజగత్సుఖాధికా!

---

16. 4. 2

# మేఘసందేశ మూలకథ

శ్రీ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి

అభ్యసించదలచిన ప్రతివిద్యార్థీ — ఆస్వాదించదలచిన ప్రతి రసికుడూ, మహాకవి కాళిదాసు మేఘసందేశమును చదవకుండా వుండరు.

అయితే —

కావ్యాదిని కవి, 'కశ్చిత్త' ని పేరు చెప్పకుండా వ్యవహరించిన కావ్యనాయకుని పేరు ఏమై వుంటుంది? అంత రసవత్కవితకు ఆధారమైన కావ్యనాయిక నామధేయం ఏమిటో? ఆమె రూపధేయం ఎంత మనోహరమైనదో?

యక్షుడు, తనపనిలో తప్పు చేస్తే 'మధ్య' భార్యావిప్రయోగశాపం ఏమిటి ?

'యత్రాపరాధః ఖలు తత్ర దండః' అని గదా శిక్షాస్మృతి—

ఇంతకూ యక్షరాజు కుబేరుడు ఈ 'కశ్చిత్తు'నకు విధించిన నియోగం ఏమిటి?

అతడు స్వాధికార ప్రమత్తుడై చేసిన మహాపరాధం ఏమిటి ?

అసలు 'కశ్చిత్కాంతా విరహగురుణా' అనేశ్లోకానికి వెనక నిగూఢమైన యక్షయక్షిణీచరిత్ర ఏమైనా వున్నదా ? లేక ఇదంతా కవికల్పితమేనా?

అని మేఘసందేశం తెరవగానే తట్టే ప్రశ్న పరంపరారూపమైన జిజ్ఞాసలను పురస్కరించుకొని, కూలంకషంగా, పరిశోధనచేసి, నిగ్గు తేల్చిన విద్వాంసులు తెనుగునాట ఎవరైనా వున్నారా- అని నా సందేహం –

నా పరిమితజ్ఞానా న్ననుసరించి — ఏ తెనుగుపత్రికలోనూ — ఏ గ్రంథంలోనూ ఈ విషయాలు సమగ్రంగా చర్చించబడట్టు చూడలేదు.

కానైతే తల్లావజ్ఝల శివశంకరశాస్త్రులు గారు నవ్యసాహిత్య పరిషత్పత్రిక ప్రతిభ ౧౯౩౮ జూలైసంచికలో మొయిలురాయబారమనే మేఘదూతాన్ని సమీక్షచేస్తూ మేఘదూత చరిత్రకు సంబంధించిన ఈ మాటలు వ్రాశారు :

౧౯౩౮ జూను నెలలో, కలకత్తాలో 'కాళిదాససమితి'వారు 'మేఘదూత ఉత్సవము చేసినసందర్భాన, సమితిస్థాపకులు శ్రీ మన్మథనాథ భట్టాచార్యులుగారు, మేఘదూతనుగూర్చి ప్రస్తావిస్తూ— '౧౩౬౮ సం॥ క్రిందట కాళిదాసును సర్గుజా సంస్థానంలో వున్న రామగిరికి ప్రవాసిగా పంపినారు; కవి అక్కడ ఎనిమిది నెలలు ఒంటరిగా వుంటూ, ఆషాఢమేఘమును చూచి, అప్పట్లో, హిమవత్పర్వతానికి దక్షిణంగా వున్న, అలకానగరంలో నివసిస్తూఉన్న తన ప్రియురాలిని తలచుకొని మేఘదూతను వ్రాసినాడు. పిదప కవిని నెల రోజులకు వదలివేసినారు' అని చెప్పినారని శాస్త్రులుగారు వ్రాసి, ఏ కారణంచేత నైనా కవికి ప్రియావియోగం

గలుగగా కోమలహృదయుఁడైన కవి, స్వానుభవమునే కావ్యము చేసియుండవచ్చుననీ — లేక ఏమిత్రునకు కలిగిన అనుభవమునైనా, కవి, తన కావ్యవస్తువుగా తీసికొని ఉండవచ్చుననీ వూహించారు.

కాని—

ఏప్టీ - కాళే మొదలైన భారతీయవిజ్ఞులు అనేకప్రబలప్రమాణాలతో కాళిదాసకాలం క్రీ. పూ. ౧ - వ శతాబ్ది అని నిర్ణయించడం చేతనూ, వక్ష్యమాణ పరిశోధనలవల్లనూ, మన్మథనాథ భట్టాచార్యులవారి ప్రసంగమున్నూ దాన్ని ఆధారంగా చేసుకొని ప్రవర్తిల్లిన శాస్త్రిలుగారి వూహయున్ను దుర్బలములుగా కనబడుతున్నాయి.

మాఘానికి మేఘానికి శ్రమించి వ్యాఖ్యానం[1] వ్రాశానన్న మల్లినాథసూరికూడ మేఘ సందేశపు మొదటి శ్లోకానికి వ్యాఖ్య వ్రాస్తూ

"సీతాంప్రతి రామస్య హనూమత్సందేశం మనసి నిధాయ మేఘసందేశం కవిః కృతవా నిత్యాహుః" అని తననాటి జనశ్రుతి మీద ఆధారపడి, తత్త్వగవేషణకు పూనుకోలేదు.

ఈమార్గమే గతానుగతికపండితులకు శరణ్యమైనందువల్ల దానియాథార్థ్యం కనుక్కొనే అవసరమే లేకుండాపోయింది. దీనివల్ల మేఘసందేశం కవికల్పితమే అనే అపోహ నిలిచిపోయింది.

కాని—

మల్లినాథేతరవ్యాఖ్యాతలుమాత్రం ఈ విషయాన్ని అంత చులకనగా విడిచిపెట్టలేదు.

కొందరు పండితులు[2], కావ్యనాయకుని పేరు కల్పితని వ్యవహరించడం కావ్యగౌరవానికి భంగకరం అని ఆక్షేపిస్తే, సుమతివిజయుడనే వ్యాఖ్యాత పైపూర్వపక్షాన్ని ఉద్ధరించి ఇట్లా సమర్థించాడు :

"భర్తురాజ్ఞాం న కుర్వంతి
యేచవిశ్వాసఘాతుకాః,
తేషాం నామాఽపినగ్రాహ్యమ్..."

అనే అభియుక్త వచనాన్ని చూపి వాని పేరు చెప్పరాదని చెప్పాడు. కాని కాలిమీద వాలిన ఈగను కత్తితో నరకినట్లు – పై ఆక్షేపణకు ఇట్లా జవాబు చెబితే— ఈ కావ్యనాయకుడు ఇంత అవాచ్యుడు అని స్ఫురించి మొదట కావ్యప్రతిష్ఠకే మోసం వస్తుంది. ఈ విషయం ఇలా వుంచితే—

సారోద్ధారిణి వ్యాఖ్యానంవల్లనూ, వల్లభ సుమతి విజయులవల్లనూ, మరికొందరు జైనవ్యాఖ్యాతల వ్రాతలవల్లనూ, ఆయక్షుని కథ కొద్దిగా ఇట్లా తెలుస్తూన్నది:

యక్షుడు రోజూ వుదయాన్నే లేచి, మానస సరోవరంలోవున్న నవ్యదివ్య పుష్పాలను తెచ్చి కుబేరుని శివపూజా కైంకర్యానికి అందచెయ్యాలి. కాని యితడు ప్రియతమమైన భార్య కౌగలింతలను ప్రాతఃకాలాన్నే విడువలేక ఒకనాడు రేపు తేవలసినపూవులను మాపటనే సంగ్రహించి మర్నాడు అశ్రమంగా కుబేరుని కందజేశాడు.

---

1. మాఘే మేఘే గతం వయః।
2. శ్రీ గోపాల రఘునాథ నందార్గికర్, పరిష్కరించిన మేఘదూత ననుసరించి—

కుబేరుడు వాటితో శివపూజ చేస్తూ వుండగా, ఒక తామరపువ్వులో దాగివున్న తుమ్మెద, అతని వేలిమీద గట్టిగా కుట్టింది. వెంటనే రాజరాజు క్రుద్ధుడై, భృత్యుని స్వాధికారప్రమత్తతకు కినిసి శపించాడు.

భరత— సనాతన — రామనాథ— హరగోవింద వ్యాఖ్యానములవల్ల ఈకథ తెలుస్తున్నది :

ఇతడు కుబేరుని ఉద్యానవన ద్వారపాలకుడుగా నియమించబడ్డాడు. ఒకనాడితడు తనపనిలో అశ్రద్ధగా వుండి ఇంద్రగజం ఐరావతాన్ని 'చైత్రరథం'లోకి వదలివేశాడు. అది పూలమొక్కల నన్నిటినీ ధ్వంసం చేసింది. దానికి కుపితుడై కుబేరుడు యక్షుణ్ణి శపించాడు - అని.

ఈ విషయంమీద ఇంతకన్న విపుల పరిశోధన చేసినవారు ఉత్తర హిందూస్థానీయులు శ్రీ [illegible]ల్లీ శ్రీనివాసాచార్యులుగారు.

ఆయన [illegible]న మేఘసందేశ మూలవిమర్శలో చేసిన సమాలోచన సంగ్రహస్వరూపం ఇది :

మేఘదూతకథ కవి కల్పితమే అని [illegible] పండితుల తలంపు కాని అది సరి కాదు. బ్రహ్మవైవర్తపురాణంలో దీనికి మూలకథ వుంది.

మేఘదూతకథానాయకునిపేరు హేమమాలి. అతని ప్రియురాలిపేరు విశాలాక్షి.

యక్షరాజైన కుబేరుడు హేమమాలిని నిత్యమూ శివపూజాకైంకర్యానికి మానససరోవరంనుంచి పువ్వులు తెమ్మని నియోగంచేశాడు. అతడు చాలకాలం భయభక్తులతో స్వామికార్యం నెరవేరుస్తూ కొంతకాలానికి కొత్తగా కాపురానికి వచ్చిన ప్రియతమను విశాలాక్షిని చప్పున విడువలేక స్వాధికారప్రమత్తుడై, ఒకనాడు శివపూజా పుష్పాలను తెచ్చినన్నీ, మరచిపోయి మధ్యాహ్నందాకా తీసుకొని వెళ్లలేదు.

కుబేరుడు భృత్యునిప్రమత్తతకు కోపించి, తక్కినయక్షులవల్ల అతనిసంగతి తెలుసుకుని అతన్ని రప్పించి, కుష్ఠరోగివై, యెల్లప్పుడు భార్యావియుక్తుడవై అధమస్థానానికి పొమ్మని శపించాడు. దానితో దేవయోనివిశేషములలోనివాడైనా హేమమాలి స్వేచ్ఛాగమనాదిమహిమ అస్తంగత మైపోయింది.

కొందరు హేమమాలి విశాలాక్షుల ఉత్కట ప్రేమనుబట్టి, అతడు మహేశ్వర పూజకు తెచ్చిన దివ్యపుష్పాలను ఒకసారి విశాలాక్షిజడలో ముడిచి తర్వాత కుబేరుడికివ్వడంచేత ఈశాపం వచ్చిందని చెబుతారు. దీనికి ఆధారం ఏదీ లేదుగాని మొదటి కథ బ్రహ్మవైవర్తపురాణంలో ఈవిధంగా వుంది:

"అలకాధిపతిర్నామ్నా
కుబేర శ్శివపూజకః ।
తస్యాసీత్ పుష్పవటుకో
హేమమాలీతి నామతః।
తస్య పత్నీ సురూపా చ
విశాలాక్షీతి నామతః ।
స తస్యాం స్నేహసంయుక్తః
కామపాశవశంగతః ॥

మానసాత్పుష్పనిచయ
మానీయ స్వగృహే స్థితః।
పత్నీప్రేమసమాయుక్తః
న కుబేరాలయంగతః॥

కుబేరో దేవసదనే
 కరోతి శివపూజనమ్!
మధ్యాహ్న సమయే రాజన్
 పుష్పాణి ప్రసమీక్షతే।
హేమమాలీ స్వభవనే
 రమతే కాన్తయా సహ।

యక్షరాట్ ప్రత్యువా చాథ
 కాలాతిక్రమకోపితః।
కస్మాన్నాయాతి హేయక్షా!
 హేమమాలీ దురాత్మవాన్,
నిర్ణయః క్రియతా మస్య
 ప్రత్యువాచ పునః పునః॥

యక్షా ఊచుః—

'వనితాకాముకో గేహే
 రమతే స్వేచ్ఛయా నృప!'
తేషాంవాక్యం సమాకర్ణ్య
 కుబేరః క్రోధపూరితః,
ఆహ్వాయామాస తం తూర్ణం
 వటుకం హేమమాలినం,
జ్ఞాత్వా కాలాత్యయం సోఽపి
 శ్రమవ్యాకులలోచనః॥

ఆజగామ నమస్కృత్య
 కుబేర స్యాగ్రతఃస్థితః।
తం దృష్ట్వా ధనదః క్రుద్ధో
 రోషసంరక్త లోచనః॥

ప్రత్యువాచ రుషావిష్టః
 కోపా ద్విస్ఫురితాధరః
రేపాప! దుష్ట! దుర్వృత్త
 కృతవాన్ దేవహేలనం॥

అతో భవ శ్విత్రయుక్తః
 వియుక్తః కాన్తయా సహ।
అస్మాత్ స్థానా దపధ్వస్తో
 గచ్ఛస్థాన మథాధమం॥

ఇ త్యుక్తే వచనే తేన
 తస్మాత్ స్థానా త్పపాత సః
మహాదుఃఖాభిభూత శ్చ
 కుష్ఠపీడితవిగ్రహః॥

ఇంకా ఈ పురాణంలోనే, శాపగ్రస్తుడైన యక్షుడు కుష్ఠరోగపీడితుడై, అడవుల వెంటా, కొండలవెంటా, మతి చలించి తిరుగుతూ ఒకనాడు మార్కండేయమహర్షి ఆశ్రమానికి వెళ్లి, ఆయనతో తన దురవస్థ చెప్పుకోగా, ఆ ముని ఇతనిపట్ల కరుణించి 'నాయనా! ఆషాఢ కృష్ణపక్షమున వచ్చే యోగిని అనేపేరుగల ఏకాదశినాడు ఉపవాసం చేసి భగవంతుణ్ణి ఆరాధించినట్లైతే - నీ శరీరం నీరుజ మౌతుంది- ప్రియురాలితో పునస్సమాగమం జరుగుతుంది' అని చెప్పగా అత డట్లా చేసి, పెద్దరోగంనుంచీ, ప్రవాసం నుంచీ విముక్తుడై యథాపూర్వంగా వున్నాడు అనే విషయంగూడా వుంది.

ఈ హేమమాలినే మహాకవి కాళిదాసు మేఘదూతనాయకునిగా గ్రహించి పౌరాణికకథను కొద్దిగా మార్చి రెండుసర్గల రసవద్విప్రలంభకావ్యముగా విరచించినాడు అని శ్రీనివాసాచార్యులుగారు నిరూపించినారు.

ఇంతవరకూ మేఘదూత మూలకథను గూర్చి వ్రాసినవారిలో శ్రీ యాచార్యులుగారి వ్రాతయే సప్రమాణంగాను, సారవంతంగాను కనపడుతూన్నది.

మొదట నేను చూపిన వల్లభసుమతి విజయాదు లిచ్చినకథ చాలవరకూ- బ్రహ్మ

నైవర్తానికి దగ్గరగా వున్నా— తామర మొగ్గ లోని తుమ్మెద కుట్టడంచేత కుబేరుడు శపించా డనడంలో విభిన్నమవుతూన్నది. అదీ కాక ఇది భార్యావియోగాన్ని శపించదగినంత ప్రబలకారణంగా కనిపించడంలేదు.

ఈకథకు ప్రమాణం ఏమిటో పై వ్యాఖ్యాతలు నిరూపించ లేదు. కనుక ఇది అమూలకం అని విడిచిపెట్టవలసివుంది.

భరత సనాతనాదులు వ్రాసినకథకుగూడ ప్రమాణం ఏమిటో తెలియదు.

ఇందులో యక్షుని అపరాధానికీ- అతని ప్రేయసీవియోగశాపానికీ — ఏమీ సంబంధం లేదు. దీన్ని పురస్కరించుకొని రాజరాజు యక్షుని అట్లా శపించా డనడం అనుచితం కనుక ఈకథగూడా ఉపాదేయంగా లేదు.

మొత్తంమీద పరిశీలించి చూస్తే —

కాళిదాసుమహాకవి పురాణములనుంచే తన కావ్యములకు వస్తువును తీసుకోవడం సంప్రదాయంగా వుంది.

విష్ణుపురాణంనుంచి రఘువంశకథను, శైవపురాణంనుంచి కుమారసంభవకథను సేకరించుకొని అనల్పమైన ప్రతిభావిశేషముతో సంస్కృత సాహిత్యసీమలో అతులనీయ కావ్యసంపదను వెలయించినట్లే, తన మూడవ కావ్యము మేఘదూతమునకుగూడ బ్రహ్మవైవర్త పురాణకథను మూలవస్తువుగా తీసుకొని, "యత్ర త్రానుచితం వస్తు— అన్యథావా ప్రకల్పయేత్" అను సూత్రా న్ననుసరించి కావ్యానుగుణములైన మార్పులు చేసినాడు.

పురాణంలోని యక్షుని కుష్ఠరోగం రసపుష్టికి భంగకరం అనిన్నీ–కుబేరు డిచ్చిన నిరవధికప్రియావియోగశాపం,— తన కభిమతమైన విప్రలంభశృంగార రసవిన్యాసానికి విరుద్ధమై కరుణరస పర్యవసాయి అవుతుందనీ, ఆశాపాన్ని 'వర్షభోగ్యము'గా మార్చి, పురాణంలో ఆషాఢ కృష్ణైకాదశిలో అయిన శాపాన్తమును కార్తికమాసాంతం వరకూ నెట్టి, ఆషాఢ మేఘదర్శనంతో ప్రేమవిహ్వలుని తప్తహృదయంలోని భావప్లుతిని, అత్యంత రస్యమానావస్థకు తెచ్చి, కల్పకల్పాలకూ అమృతమైన రసవత్కావ్యమును నిర్మించినా డని చెప్పడమే యుక్త మని తోస్తుంది.

ఈ విషయమై ఇతోధికంగా పరిశీలించిన అభిజ్ఞశేఖరులు మననాట వుంటే వారి అమూల్య పరిశోధన ఫలితములను దయచేసి ప్రకటించవలసిన దని సప్రశ్రయంగా కోరుతున్నాను.

---

# వి యో గ రా ధ

శ్రీ రామచంద్ర అప్పారావు

ప్రేమవిలాసలాలసుడు కృష్ణుడు సద్య వసంత యామినీ
సోమదరస్మితామృతపు సౌఖ్యాన పిల్లనగ్రోవి ఆటలో
ఏ మరపింపు జాజిపొద నిప్పుడు సోలెనో, రానెరాడు; నా
కోమలభావకేళి నునుగొమ్మల సందుల మింటి నారయన్.

యమునాసైకతసుందరానిల విహారారంభణోపాసకుం,
డమలానంద సదాభిలాషి, వరమోహాన్వేషి, ఏకామినీ
కమలాస్యామృత చుంబనాల మురళీగానంపు సోలింతలో,
తమిలో కన్నులు వాల్చెనో ప్రియను రాధన్ విస్మృతిం గాల్చుచున్.

అదిగో వసంతశాంత మలయానిల కంపిత పుష్పగుచ్ఛముల్
విదలుచు లేత మల్లెపొద, వెన్నెల వెన్నెల నున్ననై కళా
స్పదమయి చేతులెత్తి అదె స్వాగత మిచ్చెను వాహినీతట,
మ్మదిగో సరస్సు రార రసికా! బ్రతుకున్ శతధా విభిన్నమై
చెదరి సుషుప్తి నీ సొగసుం జేరునో మాయునో యాదవేశ్వరా!

ఎంతగ నేడ్చినన్ హృదయ మెంతగ మంటల నెత్తురోడ్చినన్
ఎంతగ చూపులన్ వెత స్రవించిన గల్గదుగా దయామృతా
సంతకటాక్ష హాసకల; అబ్బ విమోహారసైకచోర! సో
లింతల కోడె వెన్నెలల యీడున సోకున ఆర్తనాదముల్?

పోవుచునుండె నిండునెల మూయుచునుండెను కన్నులం దిరుల్
నావిలపింపునిద్దురకు రార నదింపర లాలిపాట! నీ
భావ మరీచి మాలికల వాగులు గూర్చు విలోచనాల నా
పై విరియింపరా సిదురవంతనె మూయును వేణుభూషణా!

ఇంతకఠోరమోహము సహింపదు జీవము కృష్ణ! దీన వా
సంతిక 'కోకోకో' అను విషాదరుతమ్ముల నేల ముంచు; నీ
వింతట వేణు గానము, స్రవింపుము మారణరాగ మంతటన్
వింతగ దేహసీలములు నించు నిరాశల నిండు నీడలన్.

దాసిని, దీనురాల, తనధైర్యము సెల్లను నీకె ధారగా
పోసిన ప్రేమజీవిని, అపూర్వవియోగిని రాధ నో ప్రభూ!
వేసరి క్రుంగిపోతి, వగ వీడితి, ఈతుదిచేతిమోడ్పుతో
నే సవరించితిం గలను, నిల్చితి నీకడసారి ముద్దుకై.

ఇదిగో తమాలవాటి సవరింతును నీల సుమాల శయ్య, నా
హృదయపుకారు లీ కలువసెచ్చెలిఁ బెంబెరఁ గప్పివేయు; ఈ
బ్రదుకు సుషుప్త్యవస్థ సెలపాటల తేటల జాలిజోలలన్
గదలి కరంగిపోవు, ఇక కామిని నీకొక నీడయేసుమా!

అకట నీ వాక నీడను, అధిక తిమిర
భయతరై కాంత క్రాంత సమాధినోయి!
నీవనంత నిత్యానంద భావగీతి
భగ్నమైపోవు నేమొ, రావలదు కృష్ణ!

(అంతలో చలించే సులాబీపూపొదనుండి అవతరించిన శ్రీ కృష్ణుడు రాధను కౌగిలించాడు. అప్పు [illegible] మాయతెర కప్పి ఆ ఆనందమూర్తులను నీచప్రపంచ విలోచనాలనుండి దాచివేసింది.)



# హరిశ్చంద్ర - గౌరనమంత్రి

శ్రీ వెంపటి శ్రీనివాసమూర్తి

నే డాంధ్రదేశమున సర్వజనాదరణీయమై వెలయుచున్న హరిశ్చంద్రకథకును, దానికి మూలమై వేదమందున్న కథకును సంబంధ మెచ్చటను నగుపడదు. రానురాను మూలకథ యంతరించి దానిచిలవలు పలవలే దేశమున నాటుకొనిపోయినవి.

వేదములలో నున్నకథలను పెంపొందించి కథలలో కథలను గల్పించి మార్చి నీతిని బోధించునట్లు చేయుట, వీలైన పట్టులనెల్ల ధర్మముల నేకరువుపెట్టుట పురాణకర్తల పని. అట్టి పురాణములలో ప్రసిద్ధములైన కథలను గ్రహించి, రసానుగుణముగ కథను మార్చి, అష్టాదశవర్ణనలు చేర్చి, నాటకమువలె శృంగార వీర రసములు ప్రాధాన్యములుగా నొనర్చి మహాప్రబంధముల నిర్మించుట ప్రబంధ కవులపోకడ. తరువాత పురాణ ప్రబంధములనుండి లోకప్రసిద్ధము లైనవానిని గైకొని రంగస్థలోచితము లగు మార్పులతోడను, నాటకావసరము లగు నూతన పాత్రసృష్టితోడను నాటకము లొనర్చుట నాటకకర్తల కర్తవ్యము. హరిశ్చంద్రోపాఖ్యాన మీ యవస్థాంతరము లన్నిటిని బొందియున్నది. మొట్ట మొదట ఋగ్వేదములో నైతరేయబ్రాహ్మణమునందలి కథ మార్కండేయపురాణమునందును, రెండవ దాని లోనికథ దేవీభాగవతమునందును ముఖ్యముగా సవ రింపబడినవి. వీనియందే గాక యీకథ భాగవతము నందును స్కాందాది పురాణములందును గనపడు చున్నది. వీనిలో నెల్ల మార్కండేయ స్కాందపురాణ ములలోని కథయే ఆంధ్రకవులచే చిత్రింపబడిన హరి శ్చంద్రకథకు మిక్కిలి దగ్గరగా నున్నది. మూలగ్రంథ ములైన వీటిలోనికథ క్రమముగా నెట్లు మార్పు చెంది నదియును కొలదిగా జర్చింతును.

## ఐతరేయ బ్రాహ్మణము

ఇక్ష్వాకువంశమున హరిశ్చంద్రు డను నొకరాజు నూరుగురు సతులను పెండ్లాడియు సంతానమును బడ యసయ్యెను. అందుచేత నాతడు నారదుని యుపదేశ మున వరుణుని ప్రార్థించి, పుట్టినవానిని వరుణుని కొరకు నరమేధయాగము చేయుపద్ధతిపై పుత్రలాభ మును బొందెను. రోహితుడను కొడుకు పుట్టిన తరు వాత పుత్రవ్యామోహముచే నరమేధయాగము చేయనొల్లక వరుణుడే వచ్చి యడిగినను, రేపు మాపని పంపివేయు చుండెను. పిల్లవానికి వయసు రాలేదని కొన్నాళ్లును, ధనుర్విద్య రాలేదని కొన్నాళ్లును గడువుపెట్టి వరుణుని పంపించుచుండ, రాజపుత్రుడు నీవృత్తాంతము తెలిసి ధనుస్సహాయుడై వనమున కేగెను. వరుణుడు కోపమున రాజును జలోదరపీడితు డగునట్లు శపించెను. పుత్రు డీ యుదంతము విని ఇంటి కెన్నిసార్లు రా బ్రయత్నించి నను ఇంద్రు డడ్డుపడి 'మీ తండ్రి నిర్దయుడై నిన్ను చంపనున్నాడు. నీ వేల పోయెద?' అని మాన్పించెను. ఆరు సంవత్సరము లైనతరువాత రోహితుడు అజీగర్తుని మధ్యమపుత్రుడైన శునశ్శేపుడను బ్రాహ్మణకుమారుని గొని రాగా వసిష్ఠునియుపదేశముచే రాజు యజ్ఞముచేయ ప్రారంభించెను. అందు శునశ్శేపుడు యజ్ఞపశువుగను, విశ్వామిత్రుడు హోతగను, జమదగ్ని యధ్వర్యుడుగను, వసిష్ఠుడు బ్రహ్మగను నుండిరి. శునశ్శేపుని యాగకాలము నందు వధింపబోవుచుండ నాతడు ఋక్కులతో నింద్రాది దేవతలను ప్రార్థించి వరుణపాశ విముక్తుడై చావు దప్పించుకొనెను. రాజునకు జలోదరరోగనివృత్తి యగు టయేగాక యాగఫలమును దక్కెను.

## భాగవతము

ఇందు నించుమించుగా ఋగ్వేదమునం దున్న కథయే యున్నది. మొదట విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని వద్ద యాగదక్షిణ యనమిషచే సర్వధనమును హరించి, కులహీనుని గొలువబెట్టి, ఎన్ని బాధలుపెట్టినను అతడు బొంక కుండెను. హరిశ్చంద్రుని బాధించుట విని వసిష్ఠుడు విశ్వామిత్రుని గ్రహము కమ్మనియు, అతడు

వసిష్ఠుని బకము కమ్మనియు, ఒకరి నొకరు శపించుకొని పక్షిరూపములు దాల్చి పోరాడుచుండిరి. ఇదియిట్లుండ, హరిశ్చంద్రు డనపత్యతచే నారదు నుపదేశమువలన రోహితుడను కుమారుని బడసెను. తక్కిన కథయంతయు వేదమున నున్నట్లే యున్నది. తుదకు నరమేధయాగ మొనర్చినందుల కింద్రుడు మెచ్చి రాజునకు కనకరథ మిచ్చెను. విశ్వామిత్రుడును నిరస్తదోషుడై హరిశ్చంద్రునకు జ్ఞానోపదేశము చేసిన, నతడు ముక్తి నొందెను, (—భాగవతము, ౯ స్కం. ప ౧౯౭-౨౦౧).

## మార్కండేయపురాణము

ఇందు జైమిని మార్కండేయుని "పాండవేయ నందనులైన ద్రౌపదేయులు కృతదార పరిగ్రహులు గాక యనాథులుం బోలె నేల మృతినొందిరి?" (మారన మార్కం. పు. ౧ ఆ.) అని ప్రశ్నింప మార్కండేయుడు హరిశ్చంద్రుని కథను జెప్పెను. 'సత్యవ్రతగరిష్ఠుండు'ను, 'ధర్మకర్మవరిష్ఠుండు'నునైన హరిశ్చంద్రు డొకనాడు వేట కరిగి స్త్రీస్వరంబున నాక్రోశము వినెను. విశ్వామిత్రుడు భవాదివిద్యలకై తప మాచరించుచుండ నావిద్యలు వనితాస్వరూపమున నాక్రందన మొనర్చెను. హరిశ్చంద్రు డది తెలియక 'శిష్టదయాళుత్వము'న నార్తరక్షణార్థమై కత్తిదూసి విశ్వామిత్రాశ్రమమును బ్రవేశించెను. విశ్వామిత్రుడు తపోభంగమునకై కినుక వహింప నాతని కోపకారణమున విద్య లంతర్హితము లయ్యెను. విశ్వామిత్రుడు స్వీయప్రయత్న వైఫల్యమునకు రాజుపై కోపింప నతడు రాజధర్మమును నెరవేర్చితి ననెను. దాన మొనర్చుటకూడ రాజధర్మము కావున తా నొనర్చు రాజసూయయాగమునకు [1] ధన మిమ్మని యడిగెను. ముక్కోపియగు జటాధారినుండి గండము గడచినట్లుగా భావించి రాజు యాగదక్షిణకు ధన మొసంగెద ననుటయేగాక 'ఏ దడిగిన నది యిచ్చుటకు సిద్ధముగా నుంటి' ననెను. తపోభంగమునకు గసి దీర్చుకొన సిద్ధముగ నున్న ముని యందుదొరికె నని రాజ్య మంతయు దానముగా గోరి గ్రహించెను. హరిశ్చంద్రుని దారపుత్రాదులతో దేశము విడిచి పొమ్మని యాన తిచ్చి, అతడు పోవుచుండ "క్రతుదక్షిణకు ప్రతిశ్రుతముగా చేసినయర్థ మీక నీ వెక్కడికేగె" దని నిలువరించెను. నెలదినములు గడువు గైకొని హరిశ్చంద్రుడు సకుటుంబముగా కాశికాపురి కేగుచుండ విశ్వామిత్రుడు వారిని త్రోవయందు బాధపెట్టెను. తుదకు శైబ్య (చంద్రమతి) నమ్మగా వచ్చినధనము తన యాగ దక్షిణకు చాల దని హరిశ్చంద్రునిగూడ చండాలున కమ్మి యాధనమును గైకొనెను. శైబ్య బ్రాహ్మణుని వద్ద యూడిగము చేయుచున్నపుడు లోహితుడు పాము కాటున మృతినొంద నాతని కాటికి గొనిపోయెను. హరిశ్చంద్రుడు వారిని గుర్తించి దుఃఖాతిశయమున తాను గూడ పుత్రునితోబాటు మరణింపుదు నన చంద్రమతియును ప్రాణములు విడుచుటకు సిద్ధపడును. ఇట్లువారిరువురును చిచ్చురకబోవుచుండ నింద్రాదిదేవతలును, విశ్వామిత్రుడును ప్రత్యక్షమై తత్ప్రయత్నమును వారించిరి; పిదప ఇంద్రుడుదక్క తక్కినవా రంతర్ధానము నొందిరి. ఇంద్రుడు హరిశ్చంద్రుని స్వర్గమునకు రమ్మనిన నతడు తన్ను నమ్ముకొనియున్న పౌరజనమును విడిచి రా ననెను. ఎట్టకేలకు పుత్రుడైన రోహితునికి పట్టాభిషేకము గట్టి అయోధ్యావాసు లందరితోడ రాజు స్వర్గమున కేగెను. అంత వసిష్ఠుడు పండ్రెండేండ్ల సమాధినుండి లేచి తన శిష్యుని బాధపెట్టినందులకు విశ్వామిత్రునితో గలహించి యాతనిని బకము గమ్మని శపింప నతడు తిరుగ వసిష్ఠుని నాడేలు కమ్మని శపించెను. 'మూడువేలం దొంబదియారు యోజనంబుల పొడువైన బకంబును, ద్విసహస్రయోజనోన్నతంబైన యాడేలును'నై వారిరువురు పూర్వవైరము పాటించి హోరాహోరిగా పోట్లాడి తుదకు బ్రహ్మచే వారింపబడి పక్షిరూప విముక్తులైరి.

---

1. ముని రాజసూయయాగము చేయుచేమని సందేహము కలుగుచున్నది. ఐనను మార్కండేయ పురాణమునం దిట్లే యున్నది. చూడుడు :

"......................రాజసూయాధ్వరం బనఘుం జాలినయంతసొమ్మొసగుమా భూదేవతాకోటికి
స్థనియ దక్షిణ లిచ్చి యజ్ఞ మమరేంద్రప్రీతిగా జేసెదన్." (—మారన మార్కం. పు. ౧ ఆ.)

జైమిని ప్రశ్నించిన పాండవేయవృత్తాంతమున కీ కథ యంతయు నవసరము లేదు. హరిశ్చంద్రుడు భార్యతో నరణ్యమునకు వెళ్లునప్పుడు, సుకుమారియైన శైబ్య కంటక శిలాసంవృత మైన మార్గమున డస్సి యాగిన, ముని నిర్దయుడై యామెను దండమున కొట్టెను. దీనావస్థయైన రాజపత్నిని గరుణించి, మునిని దూషించి నందున విశ్వేదేవతలను 'నరులను కరుణించినందున నరరూపమున జన్మించు' డని ముని శాప మొసగెను. వారు ప్రార్థింప 'ద్రౌపదేయులై జన్మించి దారపరిగ్రహాదులు లేకుండగనే మానవత్వమును వదలి దేవతలగుదు' రని యనుగ్రహించెను. ఈపై నున్న కథను మును లడుగగా మార్కండేయు డిదియంతయు జెప్పెను.

## దేవీభాగవతము

ఇందు నరమేధయాగాంతమువరకును గల కథ ఐతరేయబ్రాహ్మణమునం దున్నట్లే యున్నది. హరిశ్చంద్రుడు నరమేధయాగనిమిత్తము శునశ్శేపుని గొని తెచ్చినప్పుడు విశ్వామిత్రుడు వానిని వదలిపెట్టు మనియు, రాజులు పరులకొరకు స్వదేహత్యాగము చేయవలయును గాని, స్వీయకార్యమునకు ఇతరులను హింసింపగూడ దనియు ననేకవిధముల బోధించినను 2 రాజు వినక యజ్ఞము చేసిన, మునిబాలకునికి వరుణమంత్రముపదేశించి పాశవిముక్తునిగా జేసెను. తనమాట వినలే దని విశ్వామిత్రుడు రాజుపై కోపము వహించెను. ఒక దినమున హరిశ్చంద్రుడు సూకరమును వేటాడుచు కౌశికాశ్రమసమీపమునకు బోయెను. విశ్వామిత్రుడు బ్రాహ్మణవేషమున వచ్చి రాజును వంచించి రాజ్యము నంతయు గ్రహించెను. రాజును మోసగించినందులకు వసిష్ఠుడు కోపగించి మునిని 'నీవు బకమువలె మునివేషము వేసి వంచించితివి గాన బకము గమ్ము'ని శాప మీయ, నతడు క్రమ్మర నితని నాడేలు కమ్మని శాప మిచ్చెను. ఇద్దరును చాలకాలము పోరాడి తుదకు బ్రహ్మచే వారింపబడుదురు.

మార్కండేయపురాణము నందలి కథ ఋగ్వేద కథాశేష మనియును, నరమేధయాగమునకు ఫలితముగ హరిశ్చంద్రుడు భూలోకమందే కష్టముల ననుభవించెననియు పురాణకర్త వ్రాసినట్లు తెలియుచున్నది. మార్కండేయపురాణమునందు అంతమున జరిగిన వసిష్ఠ విశ్వామిత్రకలహము దేవీభాగవతమునందు ప్రప్రథముననే జరిగినది. ఈ రెంటియందును ఐతరేయబ్రాహ్మణమునందున్న హరిశ్చంద్రుని నరమేధ వృత్తాంతము వదలబడలేదు. ఈ రెంటికన్న విచిత్రముగ భాగవతమునందు హరిశ్చంద్రుని విశ్వామిత్రుడు బాధించిన తరువాత పుత్రార్థము హరిశ్చంద్రుడు వరుణుని ప్రార్థించినట్లున్నది. నరమేధ యాగానంతరము హరిశ్చంద్రుడు ముక్తిగొందును. హరిశ్చంద్రు డరణ్యమున బాధింపబడినప్పు డతనికి పుత్రుడు లేకుండు టన్నికథలకును విరుద్ధముగా నున్నది.

మార్కండేయ పురాణము నాంధ్రీకరించుచు మారన మొదట 'ఎవ్వనిమాహాత్మ్యశ్రీ మెప్పుడు వేదము లెల్లగి సుస్తోత్రము సేయుచుండు' అని హరిశ్చంద్రుని గూర్చి నుడివెను. కాని శ్రుతిసిద్ధమైన కథను జూచిన దోషల అతనియందు స్తోత్రము చేయుదగు సుగుణము లేవియు గన్పడవు. ఈ పురాణమునందు హరిశ్చంద్రుని త్రోవలో బాధపెట్టుచు మధ్యమధ్య విశ్వామిత్రుడే యప్పుడుగు చుండును. నక్షత్రకపాత్రను మొట్టమొదట సృష్టించినవాడు గౌరనమంత్రి.

ఈ యితిహాసములోని శీర్షవిషయము కొద్దిగా వ్రాసెదను. హరిశ్చంద్రనామము ఐతరేయబ్రాహ్మణము నుండి నేటివరకును మార్పు చెందలేదు. మార్కండేయ పురాణమునందును, తదితరపురాణములందును రాజపత్ని

---

2. విశ్వామిత్రోవాచ :

పరదేహస్య రక్షార్థే స్వదేహం యే దయాపరాః, దదంతి క్షత్రియాః పూర్వం స్వర్గకామా స్సువ్రతాః॥
న కృతం వచనం రాజ్ఞా కౌశికస్య మహాత్మనః, కోపం దధార మనసా రాజ్ఞోపరి స గాధిజః.

(—దేవీభాగవతము, ౧౩ అధ్యా. ౨౯,౩౦)

నామము శైబ్య యని యున్నది. స్కాందపురాణము నందుమాత్రము చంద్రమతి యని యున్నది. గౌరన రెండవదానిని గ్రహింప, తరువాత వ్రాసిన యాంధ్ర కవు లందరట్లే యొనర్చిరి. రాజకుమారునిపేరు ఐతరేయ బ్రాహ్మణ, దేవీభాగవత, భాగవత, హరివంశము లందు రోహితు డనియు, మార్కండేయపురాణము నందు రోహితాశ్వ డనియు, అగ్ని విష్ణుపురాణము లందును, చండకౌశిక నాటకమునందును, శబ్దరత్నాకర కోశ, సర్వశబ్దసంబోధినీకోశములందును 'రోహితాశ్వ' డనియు నున్నది. 'ర' 'ల' ల కభేదమునుబట్టి 'లోహితుడు' 'లోహితాశ్వుడు' అని ఆంధ్రకావ్యములందు వాడి యున్నారు.

హరిశ్చంద్రోపాఖ్యానము నాంధ్ర కావ్యముగ ప్రథమమున రచించినవాడు గౌరనమంత్రి. ఇతడు మూలమునుండి కథ నెంతవరకు గ్రహించినదియును, అందీతడొనర్చిన మార్పులేర్పుతు జాతము. కథా ప్రారంభమునందు

"చెలగి ఋగ్వేద ప్రసిద్ధుడై జగతి
వెలయు హరిశ్చంద్రవిభు పుణ్యచరిత
గవితాచమత్కృతి గాంచి హర్షించి
కవు లందరును శిరఃకంపంబు సేయఁ
బచరించి వీనుల పండువుగాఁగ
రచియింతు." (ప్ర. భా. ౨౯—౩౪)

అని చెప్పినాడు. కాని యీకథకును శ్రుతిసిద్ధమైన కథకును సంబంధములేదు. వేదమందున్న నరమేధ యాగసంబంధ మిందు వదలబడినది. అట్లే యితని ననుసరించిన శంకరకవి మొదలగువారు హరిశ్చంద్రుని శీలమునకు కళంకమాపాదించు నీవృత్తాంతమును త్యజించిరి. తరువాత నవతారికలో ద్వైతవనమందున్న ధర్మరాజునకు మార్కండేయ మహర్షి హరిశ్చంద్ర కథను జెప్పినట్లున్నది. సంస్కృతమునం దీకథకు మూలమనదగినది మార్కండేయ స్కాందపురాణములందున్నది. ఈ రెండు పురాణములలోని కథలకు గొలది భేదమున్నది. మొదటిదానియందు హరిశ్చంద్రుడు భార్యా సహితముగా సుతుని చితిలో బడబోవుచుండ దేవతలు ప్రత్యక్షమైరి. రెండవదానియందు హరిశ్చంద్రుడు భార్యను నరకబోవుచుండ దేవతలు ప్రత్యక్షమైరి. మార్కండేయ పురాణములోని కథ యుత్తర, పశ్చిమ హిందూస్థానములలో వ్యాపించియున్నది. స్కాందములోని కథ దక్షిణమున వ్యాపించియున్నది. ఈ పోలికలను జూచి, కందుకూరి వీరేశలింగము పంతులుగారు కవుల చరిత్రము ప్రథమ ముద్రణమున గౌరన మార్కండేయపురాణస్థ వృత్తాంతము గైకొనెననునది మార్చి ద్వితీయ ముద్రణమున "ఈ స్కాంద పురాణములోని హరిశ్చంద్రకథనే మొట్టమొదట గౌరనకవి ద్విపద కావ్యముగా రచియించెను. తరువాత శంకరకవి, శరభకవి, మల్లారెడ్డి మొదలైనవారు దీనిని పద్య కావ్యములనుగా జేసిరి" అని వ్రాసిరి. బ్రహ్మశ్రీ వఝ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగా కీ మార్శ్వ పూండ్ల రామకృష్ణయ్యగారి దుర్బలవిమర్శనముచే ప్రాప్తమైనదని దానిని ఖండించుచు తమ నిశ్చితాభిప్రాయము నిట్లు తెలిపిరి.

"ఈ వఱకు నాకు లభించిన పురాణములలో మార్కండేయ పురాణ, దేవీ భాగవతములోని కథయే, మన యాంధ్రకవులు చెప్పిన హరిశ్చంద్రకథకు సంబంధించియున్నది. కావున నదియే దీనికి మూలమని నేను తలచుచున్నాను. అందును మార్కండేయ పురాణస్థ హరిశ్చంద్ర కథా సంగ్రహమే వివరింపబడి దేవీ భాగవతమున వ్రాయబడినది. కావున దేవీభాగవతము దీనికి మూలమైనపుడు దానికి మూలమైన మార్కండేయ పురాణము దీనికి మూలమనుట విరుద్ధము కానేరదు. కావున శ్రీ వీరేశలింగము పంతులవా రాంధ్ర కవులచరిత్రము ప్రథమ ముద్రణమున వ్రాసినవ్రాతయే సరియైనదని చెప్పవలసి యున్నది."[3]

---

3. మార్కండేయ పురాణమునందలి హరిశ్చంద్రకథయు నందలి పేరులను సాంతముగాఁ జదివిన స్కాందమునందలి హరిశ్చంద్రకథంబోలి జనానురంజకమయి యుండలేదుగాన మనదేశమున వాడబడు హరిశ్చంద్రకథ శ్రీ వీరేశలింగముగారు ప్రకటించినరీతిని మార్కండేయ పురాణాంతర్గతము కాదనియు, స్కాంద పురాణాంతర్గతమే యనియు నొక్కి వక్కాణించుచున్నాము."—పూండ్ల రామకృష్ణయ్యగారు.

పురాణములోని కథలో గౌరన తెచ్చినమార్పులు చిరస్థాయిగ నిలచిపోయినవి. మొట్టమొదట నరమేధ వృత్తాంతము తొలగింపబడినది. హరిశ్చంద్రోపాఖ్యానమున నింతింతనరాని ప్రాముఖ్యము గలిగినట్టియు, అంతకుముందు లేనట్టియు నక్షత్రకపాత్ర నితడు సృష్టించెను. నక్షత్రకుడే లేకున్నచో హరిశ్చంద్రుని కింతప్రశస్తి వచ్చి యుండెడిదికాదు. మార్కండేయ పురాణమునందు విశ్వామిత్రునకు చంద్రమతి నమ్మగా వచ్చిన ధనము తన గురుదక్షిణకు చాలదని హరిశ్చంద్రునికూడ నమ్మెను. ఇది యసంగతముగా నున్నది. తనకు కావలసిన ద్రవ్యమునకు మొదటనే చంద్రమతి నమ్మియుండవలసినది. ఈ యసంగతమును గౌరన నక్షత్రకునిచే తొలగించినాడు. చంద్రమతి నమ్మగా వచ్చినధనమును తన బత్తెపుసెలవుగా గ్రహించి ముని కీయవలసిన సొమ్మునకు రాజు నమ్మును. మార్కండేయ పురాణమునందును, దేవీభాగవతమునందును రాజు కాటియందు పిండములను దిని క్షున్నివారణమును జేసికొనును. గౌరనమంత్రి దీనిని నీచముగా భావించి రాజున కాకలి దప్పులు లేకుండ జేసెను.

"దివినుండి కనుగొని దివిజులు మెచ్చి
యవనీతలేశున కాకలి దప్పు
లొదవకుండగ వరం బొసగి రావేళ."

(ద్వి. భా. ౧౫౫౪-౫౬)

మార్కండేయపురాణమునందు లోహితుని చావు విన్నంతనే రాజు "వీని యొడలితోడన యనలంబునం బడియెద. నన్నేలిక చండాలుని యనుజ్ఞ లేకున్న నింకొక్క పుట్టువునకైన వానికి బంటనయ్యెద"నని చిచ్చురకపోవ దేవతలు ప్రత్యక్షమైరి. దీనిచే రాజు శీలమున కింతేని లోపము వచ్చుచున్నది. గౌరనమంత్రి యీలోపమును తొలగించుటేగాక రాజు శీలమునకు వన్నె దెచ్చెడి అద్భుతసన్నివేశమును గల్పించెను. చంద్రమతియొక్క మంగళసూత్రజ్ఞానముచే రాజపత్ని సార్వభౌముని గుర్తించుట, చంద్రమతి మరల మాడకై యింటికి బోవుట, శిశుహనన నిందారోపణము, రాజదండన, హరిశ్చంద్రుని ఆజ్ఞానిర్వహణము— వీనిని గౌరన క్రొత్తగా గూర్చెను. అప్పటి హరిశ్చంద్రుని స్థితి కటికవానికైన కరగించునట్లు సంధింపబడినది. ఒకప్రక్క పుత్రశోకము, ఇంకొకవైపు భార్యాప్రేమ, మరియొక దిక్కున వీరబాహుని యాజ్ఞ, ఇంకొకవంక విశ్వామిత్రుడు వచ్చి మాతంగకన్యల వివాహమాడిన, కష్టముల నన్నిటిని తొలగింతునని యాశ గొల్పుట, ప్రేమ, శోకము, అసత్యభీతి, ఆశయు నొక్కసారిగ మానవహృదయమును కలచినచో నెట్లుండునో యోజింపుడు. శిలయైనను చలించును. రాజు చలింపలేదు. సత్యసంధతకు నూలువాసియైనను వెనుకకు రాలేదు. కావ్యమునందున్న వీరరసము సంపూర్ణౌన్నత్యము వహించినది. రాజే గెలిచినాడు; ముని యోడినాడు. పరస్పర విరోధభావ సంకలిత హృదయవర్తనము గౌరన చక్కగా చిత్రించినాడు. అట్టి పరిస్థితిని గల్పించుటచే హరిశ్చంద్రుని సౌశీల్యము పురాణములందున్న దానికన్న వేయిరెట్లెక్కువైనది. దానితోపాటు గౌరనమంత్రి యొక్క కల్పనాశేముషి, అనన్యసామాన్యప్రతిభ చిరస్థాయిగ నాంధ్రలోకమున నాటుకొని పోయినవి. అందువలననే 'ప్రతిభావ్యుత్పత్తులలో ప్రతిభ గరీయసి.'

తుట్టతుదకు పురాణములలో ఇంద్రప్రార్థనచే హరిశ్చంద్రుడు అయోధ్యావాసులతోగూడ స్వర్గమునకేగును. అప్పుడే లోహితునకు పట్టాభిషేకము జరుగును. ఈ రెండును అసంగతములుగానే యున్నవి. మొదటిది బాలుడైన లోహితునికి పట్టాభిషేక మొనర్చి రాజ్యభార మతనిపై వేయుట, రెండవది అయోధ్యావాసు లందరును స్వర్గమున కేగిన నెవ్వరును లేని పట్టణమునకు లోహితుడు రాజగుట. గౌరన వీనిని తొలగించెను. దేవతలు వచ్చి వరము లిచ్చి వెళ్లిన తరువాత హరిశ్చంద్రుడు తాను పడిన కష్టము లన్నిటికిని

---

"ఈదుర్బలమగు పై విమర్శనమును జూచి మ. రా. శ్రీ కం. వీ. పంతులవారు సయితము తమయాంధ్రకవులచరిత్ర ద్వితీయముద్రణమున దమతొంటి యభిప్రాయమును మార్చుకొనుట మిక్కిలి వింతగానున్నది."
—వ. చి. సీ. శాస్త్రిగారు.

ఫలితముగ చాలకాలము సుఖముగ రాజ్యమేలెను. మార్కండేయపురాణమునందు రాజు స్వర్గమునకు వెళ్లిన తరువాత రాజును పెట్టిన బాధలకై వసిష్ఠుడు విశ్వామిత్రుని బకము కమ్మని శపింప నతడు వసిష్ఠుని ఆడేలవు కమ్మని శపించును. ఇద్దరును పక్షిరూపముల పోరాడి బ్రహ్మచే వారింపబడుదురు. ఇది హరిశ్చంద్రోపాఖ్యానమున కనవసరముగుటచే గౌరన వదలి పెట్టెను. వసిష్ఠ విశ్వామిత్ర కలహము మొదటనే ఇంద్రసభయందు జరిగినది. (వసిష్ఠ విశ్వామిత్రులు పక్షిరూపమున పోరాడుటయు కొన్ని ప్రతులయందు కానవచ్చుచున్నదిగాని చాలాప్రతులయందు కనపడదు. శైలి వ్యత్యాసము చేతను, ఛందోదోషముల చేతను, గౌరన ననుసరించిన శంకరకవి దీనిని రచింపకుండుటచేతను, నీభాగమును -ద్వి. భా. ౨౫౭౬- ౨౫౮౬- గౌరన రచింప లేదనియు, తరువాత నెవరో రచించి యిందు జొనిపిరనియు స్పష్టమగుచున్నది.) చంద్రమతి నమ్మినప్పుడు ఏడ్చుచు వెంబడించిన లోహితాస్యుని కాలకౌశికుడు తనంతనే మూల్యమొసగినట్లు మార్కండేయపురాణమున నున్నది. గౌరనకావ్యమున, రాజు లోహితునకు మూల్యమడిగినను బ్రాహ్మణు డీయక పెనుచుండ నక్షత్రకుడు లక్షమాడలు లంచముగొని బ్రాహ్మణునిపక్షము తీర్పు చెప్పి పంపెను. దీనిచే కాలకౌశిక నక్షత్రపాత్రములు మరింత నీచముగను, హరిశ్చంద్రునిస్థితి దైన్యతరముగను చిత్రింపబడినవి. గౌరన ముఖ్యముగా జేసిన మార్పు లివియే. తక్కిన ఆంధ్రకవు లందరును గౌరననే ముఖ్యముగా ననుసరించిరి.

---

# చెలీ

శ్రీ శివరామం

వెసలమోముల మబ్బు
ముసుగు లో త్తిలిసంత
పరువాలు వెన్నెలలు
చిరునవ్వె జాబిల్లి
ఓ చెలీ! నా చెలీ!
చూచినావే చెలీ!!

తెలిమల్లె తొలిపూత
వలపు చిలికెనో లేదొ
దరిజేరినాడు తొం
దరగ తుమ్మెద రేడు
ఏమె నీ గుండెలో
ప్రేమ లేదా చెలీ!

చిగురుసెజ్జ పికమ్ము
మగనికై పరచి ని
ద్దురబరువు కనురెప్ప
లరతెరచి పరికించె
కోరికలు నిన్నూట
లూరింపవా చెలీ!

కడలికౌగిలి కాప
డి కన్నెసెలయేరు
కెరటాలు చెయి సాచి
ఉరకురక లెత్తినది
లే చెలీ! రా చెలీ!
లేచి రావే చెలీ!!

---

# లకుమాదేవి

శ్రీ భావరాజు వేంకటకృష్ణరావు

లకుమాదేవి కొమరగిరిభూపాలుని భోగపత్ని-వారాంగన. ఆమహారాజేంద్రునికి కను గూర్చు ప్రియురాలు.

కొమరగిరిభూపాలునకు వసంతరాయ డని బిరుద మున్నది. అతడు నిరంతర వసంత భోగప్రదుడు, సుఖవిరాజితుడు, ఆంధ్రజగతీపతి. పై భవమున అఖండల సదృశుడు. ఈశాన్యభాగమున సింహాద్రి అతని రాజ్యమునకు ఎల్ల. నైఋత్యదిశయందు శ్రీశైల మాతని రాజ్యమునకు సీమ. పడమటను కృష్ణానది నంటియున్న బహమనీరాజ్యము సీమ. దక్షిణమున కాంచీపుర పాండ్య రాజ్యము సీమ. కుమారగిరిమహారాజు సుకుమారతరాకారుడు, సుందరుడు, రూపరేఖా విలాసములందు కంతుని, వసంతుని, జయంతుని గెలువ జాలినవాడు. సమస్త కళాకలాప చతురుడు. సంగీత సాహిత్యములందును నాట్యశాస్త్రమునందు నా మహారాజేంద్రుని అభిమానము వర్ణనాతీతము. అపకృపాతమును గ్రహించి ప్రభువు మన్ననకు పాత్రుడు కాదలచి దోరపరెడ్డి సేనాని, నరపాలునికి ఆబాల్యమిత్ర మగుటచేసి, సమస్త గాంధర్వ విద్యావేదినియైన ఒక జవరాలిని నట్టువను, కానుకగా సమర్పించెను. ఆజవ్వని రూపునకు చోద్యమంది భూమీశుడంతటనుండి యామెను తనకొలువుకూటమున నర్తకిగా నియమించెను. ఆమెయే లకుమ. కాపరట్టడికిని ప్రేంపల్లి భావనారాయణదేవరసానిసాని వల్లెమకును జనియించిన దేకపుత్రిక యామె. లకుమ విదుషీమణి, కవయిత్రి, సంస్కృతాంధ్రము లందు స్వయముగా తన నృత్యగీతములకై గీతప్రబంధములు రచింపగలదు. గణికారత్నము, జగదేకసుందరి గావున హావభావవిభ్రమ విలాసములకు పుట్టినిల్లు.

కుమారగిరిరాజేంద్రుని ప్రమత్తతను జూచి హరిహరరాయడు హాపూరుసీమను, కవాటసీమను, త్రిపురాంతకసీమను, మాటుపల్లిసీమను బలాత్కారముగ ఆక్రమించుకొనెను. కాని అనతికాలమున కుమారగిరి భూవల్లభుని సేనాని కాటయవేముడు మహాసైన్యసమేతుడై పోయి, శత్రువుల యధీనమైన రాష్ట్రములను మరల వశపఱచుకొనెను. హరిహరరాయలు కాటయవేముని పరాక్రమధాటికి నిలువజాలక అక్రమముగ నాక్రమించుకొన్న రెడ్డిరాజ్యభాగమును మరల భద్రముగ నొప్పగించెను. మరియు భవిష్యత్కాలమున కొండవీటికిని విద్యానగరమునకును వైరము లేకుండ తన మనుమరాలిని వేముని తనూభవుడైన కాటయమాపతి కిచ్చి యుద్వాహ మొనరించెను. ఈ వృత్తాంతము జరిగినతరువాత వచ్చిన మహాశివరాత్రికి కుమారగిరిరాజేంద్రుడు శ్రీశైలమునకు యాత్ర యరిగెను.

శ్రీశైలమున నుండగా అహోబల నృసింహుని సందర్శించు కుతూహలము గలిగెను. బాల్యమున దాను ఆప్యాయముగ చదివి యానందించిన శంభుదాసుని నృసింహపురాణములోని గాథ జ్ఞప్తికి వచ్చెను. అంతట అహోబలమునకు సమీపమున స్కంధావారమును నిర్మించి యందు విడిది దిగెను.

ఆనాడు ఫాల్గున శుద్ధపూర్ణిమ. ఓబళేంద్రుని కాదినమున మహోత్సవముగ గరుడోత్సవము జరుగును. చెంచులక్ష్మితో గూడి పన్నగశయనుడు డోలాయాత్ర చేయును. ఆ బాలగోపాలము నాడు కామోత్సవము ఆనందింతురు. కామదహనమును శివలీలామాహాత్మ్యమును మహానందముతో జరుపుదురు, ఆకర్ణింతురు.

ఆనాడు సూర్యుడస్తాద్రి గ్రుంకునప్పటికి డోలారోహణోత్సవము ముగిసెను. మహారాజు ఇంచుక బడలియుండి సపరివారముగ అంతఃపురమునకు జనెను. పిదప పన్నీటి జలకములాడి అలంకృతుడై కొలువు కూటమున కేతెంచి యచ్చట నృసింహదేవుని సముఖమున తనకై వేయబడిన పూసెజ్జపై గూర్చుండి, రాత్రి ప్రొద్దుపోవుటకు నృత్తగీత వాద్యముల నానందింపగోరెను. అంత వఱకు మహారాజసన్నిధానమున నాట్యము సలుపుట

తవ కాళ్లను దొరకని కారణమున వాపోవుచున్నది లకుమ. భూరమణుని మనోభావము వెల్లడింపబడగనే తాను నాట్యముచేయుటకు జగతీపతి అనుమతి వేడ దలచెను. లకుమ ఆ రేయి మహారాజు మ్రోల మనోహరముగ నాట్య మభినయించెను. కామదహనమును, రతివిలాపమును, తాను రచించిన సంస్కృతాంధ్రగీతికలను మంజులధ్వనిని సంభావ్యసుగతులను గాని పదార్థాశ్రయములను రసాశ్రయములను ఘట్టములను లావణ్యము ముప్పిరిగొనునట్లు అభినయించెను. ఆమె నాట్య మంజులసంగీతనైపుణ్యములకు మహారాజహృదయము కరగిపోయెను. ముప్పది గడియల రాత్రి మూడు గడియలట్లు గడచిపోయెను. రతివిలాపానంతరమున నటరాజ తాండవమును పాడెను. నృత్యము చేయుచు అభినయించుతరి లావణ్యమయమై ఉజ్జ్వలమై ప్రకాశించు లకుమను గాంచి మహారాజు అపరిమిత సంతుష్టాంతరంగుడై బావ కాటయవేమారెడ్డివంక అపాంగవీక్షణముల చిరునగవు నటించుచుండె జూచి “బావా! మీ రచించిన భరతనాట్యశాస్త్రమునకే లావణ్యవతి సంపూర్ణవ్యాఖ్య కాదు గదా!” అని వేళమాడెను. మహామతియగు కాటయవేముడు రసాశ్రయుడైన తన ప్రభువర్యుని చిత్త మెరిగి తక్షణము ఆసనము దిగ్గి అంజలి ఘటించి ప్రభువరేణ్యుని యభీష్టము నెరవేరక పోదని సవినయముగ ప్రసన్నతతో పలికెను. సంతుష్టుడైన కుమారగిరిభూదేవేంద్రుని ముఖముపై హాసభావ ముదయించి కాంతులు వెదజల్లెను.

పిమ్మట ఆ రాజచంద్రుడు తన మెడలోనున్న తారహారమును వెలికి దీసెను. మహారాజు మనోభావ మెరిగెను నట్టువ లకుమ. తన నాట్యభంగిమలచే రాజపరమేశ్వరుని చిత్త మలరింపజేసిన యా తన్వంగి మెల్ల మెల్లగా అభినయించుచు, నృత్యము సలుపుచు భూమీశుని పూజ చేసెను. అంతట నప్రయత్నముగ మహారాజు చేతులనున్న హారము లకుమకంఠసీమ నలంకరించెను. ఆసన్నివేశమునకు కొలువెల్ల చిత్రమైన దీప్తితో నిండిపోయెను. నూరులకొలంది నేత్రము లచ్చెరువుతో మహారాజు మ్రోల నిలిచియున్న లకుమను గాంచి విభ్రాంతులయిరి. భూరమణుని చూచి పార్శ్వమును బ్రకటించి కొలువుకూటము ఒక్క ముహూర్తకాలము చీమ చిటుకుమనకుండ నిశ్శబ్దమైయుండెను.

కొమరగిరిదేవేంద్రుని మన్నన లకుమకు తలవని తలంపుగా సంప్రాప్తమయ్యెను. కాని - తానెక్కడ క్షుద్రవారాంగన, నట్టువపట్టి; ఆంధ్రక్ష్మామండలాఖండలుడు, జగత్ప్రసిద్ధుడు, పూజ్యుడు, సరసతిలక కొమరగిరి క్ష్మారమణు డెక్కడ! సాహసమున అపచారము నొనరించితిని అని అనుకొనుచు నిలువెల్ల నీరయి పోవుచుండ, నొక్క త్రుటిలో అప్రయత్నపూర్వకమైన నాట్యముచేతనే కాళ్లగజ్జియలు ఝుళంఝుళ ధ్వనిచేయుచుండ కరపల్లవములందలి కంకణములు మంజులముగ రవరవధ్వని చేయుచుండ వివర్ణయై పృథ్వీశుని మ్రోల సాష్టాంగముగ బడియెను. పారవశ్యము లేసి యామె విద్యలందు గౌరవము గలిగి యా మనుజేంద్రుడు ఆమెను సముచితరీతి నింకను సంభావింపదలచెను. లావణ్యరాశియైన యా జవ్వని మృదుమాలికనుండి రాలిన పుష్పచయము శ్రీపాదములను పూజించిన ట్లయ్యెను. ఆ కమలేక్షణ ధరియించిన పాపటచంద్రునిలోని మాణిక్యదీప్తులు శ్రీపాదపద్మములకు వన్నె పెట్టకలిగెను.

“జగత్పతులకు - సార్వభౌములకు మహాపరాధము సల్పితిని. మహాపరాధము, మహాపరాధము సల్పితిని. రక్షింపుడు, రక్షింపుడు” అను మాటలు ఆయాసమును బ్రకటించు క్షీణస్వరముతో రాజచంద్రుని చెవులకు సోకెను. మంజులసంగీతసాహిత్యనాట్యాభినయములచే పరితుష్టుడైన మహారాజునకు లకుమయం దెట్టి అవివేకమును స్ఫురింపలేదు. కరశాఖాంచలముచే కొంగు స్పృశించి యానట్టువను లేవనెత్తెను. ఆమెదెస గనుగొని సాదరదరహాసితరుచిరాననుడై— కర్పూరసహితంబగు తాంబూలమును బెట్టి, చిత్రములగు చీనాంబరముల నొసగి, మణిమయంబులగు నాభరణంబు లిచ్చి సంభావించెను. లకుమయు చిత్తము రంజిల్ల, నమసిగ్గు తనువెల్ల ముంచివేయ, కనురెప్ప లెత్తకుండ ప్రసన్నుడైన మహారాజు దివ్యసుకుమారసుందరమూర్తిని గాంచి ఉప్పొంగెను. రాజేంద్రు డొకసారి యామెను అపాంగ వీక్షణముల బరికించెను. ధరణీవల్లభుడు, తనవంక కటాక్షవీక్షణ

ములను బరపినాడని సమ్మోదముతో శిరముపై కేలుదోయి ముకుళింపజేసెను. ఇంతలో వైతాళికులు బ్రాహ్మీముహూర్తము సమీపించుచున్నదని తోపించుటకు సముచిత రాగము లాలపింపసాగిరి. కార్యకృత్యములను దీర్చుకొనుటకు మహారాజు అంతిపురమునకు మందగమనముతో దారితీసెను.

* * *

కొమరగిరి భూపాలుడు అహోబలమునుండి శిబిరమునెత్తివైచెను. చైత్రపూర్ణిమకు ఆతని కిష్టదైవమును, కులదైవమును అగు త్రిపురాంతకుని సందర్శింప కౌతుకమతిశయిల్లెను. తనరూపువాడనియు తనపేరివాడనియు కుమారగిరికి త్రిపురాంతకునిపై భక్తివలపు మెండు.

చైత్రపూర్ణిమ ఏతెంచెను. కుమారగిరి, ఆనాడు విషువత్పుణ్యకాలమున త్రిపురాంతకేశ్వరశివునకు భూదానము లనేకము గావించెను. ఆనాడచ్చట వసంతోత్సవమును ప్రారంభించి ఐదుదినములు వరుసగా జరిపింపదలచెను. పోయిన త్రిపురాంతకసీమను మరల గెల్చి సంపాదించిన పిదప ఆనాడే మొదటిసారి వసంతభూపాలుడు నందనుతో వసంతోత్సవము జరుపుట. కొండవీటినుండి మహారాజు పరివారమంతయు త్రిపురాంతకమును చేరెను. త్రిపురాంతకమే కొండవీటిని మరపించునట్లు మిక్కిలి రామణీయకముగ నలంకరించినారు. మహారాజు శిబిరమునందు, అంగడివీధులందు, వీధీవిటంకములందు, చందనమున కలయంపి చల్లినారు. కర్పూరరజమున ముగ్గులిడినారు. కుంకుమ పువ్వుతోడను రంగవల్లికలు దిద్దినారు. అరవిచ్చిన తామరపూవులను అందందు తోరణములు గట్టినారు. అగరుధూపాది వాసన లచ్చట కాపురముండునట్లు అమర్చియుంచినారు. కాముని కొలువు చేతకై అంతయు సిద్ధపరచినారు.

వసంతోత్సవ ప్రారంభమునకు బూర్వము వసంత భూపాలుడు ప్రియాంగన లెల్లరును తన్ను పరివేష్టింప అభ్యంతరశాలయందు నిర్మింపబడిన మన్మథమంటపమునందు రెండవ కాముని వలె ప్రకాశించుచు పూబాన్పుపై నొయ్యారముగ వసించియుండెను. చైత్రోత్సవ సూచకమైన రాగ మాలపించి, నాట్యము ప్రారంభింప వలసినదని మహారాజు ఆదేశించెను.

అంతట చరణములు, నడుము, చన్నులు, గన్నులు, జవ్వనము, వేవలి అన్నియు గలసి ఒక్కుమ్మడి సౌందర్యమును నివ్వటిలచేయుచుండ, లకుమ అలరువిలుతుని పూవుటమ్మువోలె కొలువు ప్రవేశించి, ప్రభువరేణ్యునకు ముందు జోహారుచేసి పిదప అఖండకర్పూర నీరాజన మిచ్చెను. మహారాజు ఆమెను అంతట నాట్యము అభినయింప సెలవొసంగుచు బహూకరించెను.

అంతటామె చందురుకావిపావడపై సరిగంచుచీర బిగియించి నాట్యమున కుపక్రమించెను. అపుడు తాళమానజ్ఞులు ఒక వంకను మార్దంగికు లొక వంకను నిలువబడిరి. ముఖవీణె వాయించువా డొకడు ఒక ప్రక్కను, రాగములు ఆలపించు రమణు లిరువురు వెనుక ప్రక్కను వేడుకతో నిలచియుండిరి. అపుడు సౌందర్యఖనియైన లకుమ క్షేత్రపాలునికి నమస్కరించి పాదములకు గజ్జియలు ధరియించి సిగ్గును సంభ్రమమును తొట్రుపాటు పడుచుండ అపాంగవీక్షణముల మహారాజును పరీక్షించి నాట్యమున కుపక్రమించెను. నాట్యవిధములను గతులను తాళములను ముందుగ నభినయించి, ఆపడుచు సప్తతాండవములను సలిపెను. ఆమె నాట్యమును జూచి, సంగీతమును వినవచ్చిన సభవారెల్లను చోద్యమందిరి. ఈమె ప్రమోల రంభాదులు నిలుచుటకైన నీడ కలదె! అనుచు లోలోన నాశ్చర్యమునొందిరి. లకుమ వరుసగా నానార్థకరములగు నాట్యహస్తములు ప్రదర్శించెను. శిరము, చూడ్కులు, చెక్కిళ్లు, కనుబొమలు, మెండలను అంగోపాంగముల నాట్య మభినయించెను. పిమ్మట త్రిపురాంతకుని మహిమలు వర్ణించుచు సంస్కృతాంధ్ర వాఙ్మయగీతముల నాశువుగ రచించి, మనోహరముగ పాడి, భావము తెన్నగా ప్రకటితముచేయుటకు అంగాభినయము సలిపెను. అంతట కామోత్సవసూచకములయిన శివుని దారుకావనవిహారమును పాడి నటియించెను. ఆమె నాట్యసౌరభము, కుమారగిరివర్యుని ఆశ్చర్యమగ్న మానసునిగా జేసివైచెను. అతడు పరితుష్ట హృదయమునందు పొంగిన ఆవేశముచొప్పున, "బళిర! లకుమ

నీనాట్యమహిమ నిజముగా వేల్పువేడియలను ఊర్వశీ తిలోత్తమాదులనుగూడ సిగ్గుపడచేయుచున్నది. బాపురే!" అని హెచ్చరించెను.

అంతలో కామదేవునిపూజకు వేళ యతిక్రమించుచున్నదని వైతాళికులు దెలుపసాగిరి. మహారాజు ఆసందడి నాలకించి యిరువు రిందీవరాక్షులు కైదండ యొసగ పాన్పునుండి దిగెను. ఇరుపార్శ్వములందు అప్రమత్తలైన యిందుముఖులు మహారాజునకు వింజామరలు వీచిరి. మెడలోని తారహారములను పుష్పహారములను సవరించుచు తరుణు లిరువురు చెంత నడువ, వేత్రహస్తలయి స్త్రీలు ముందు బరాబరులు తెలుపుచు జయపెట్టి నడువసాగిరి.

కామదేవుని పూజకు వసంతోత్సవములందు ధర్మపత్నుల పనిలేదు. వారును పాల్గొనవచ్చును. కాని ప్రియాంగనలతోగూడి జరుపవలసిన దీపంచబాణుని పూజావిధానము — భోగపత్నుల కిట్టియెడ అధికారము విశేషముకదా! మహారాజు విరిపాన్పు దిగి నలుదిక్కుల నొకసారి పరికించి కలయజూచెను.

అందు కొల్వులోని మవ్వపుతీగలం బగడు మానినులు, జవరాండ్రు, కన్నియలు ఎంద రెందరో ప్రవేశించుచు బోవుచుండిరి. మహారాజు ప్రసన్నత నేలతాంగిపై ప్రసరించునో! ఏపూవుబోడి ప్రభువు మన్ననల నొంది మన్మథపూజకు నోములు నోచుకొనియున్నదో! అందందు అంద రందరు ఉత్తాశలూనుచుండిరి. ముందు మహారాజుమార్గమును జూపవలయును. అంతట తక్కుంగల రాజన్యులు, చిత్తమున కెక్కిన యట్టి విలాసినులకు కయిదండ యొసగి పిలుచుకొనిపోవుదురు.

మహారాజు మెలమెల్లగా రాజసముతో, భూమి కంపించునటుల అడుగులిడసాగెను. ఆ సంరంభమున రాజేంద్రుడు చెలియొకర్తుక చెంగట నుంచిన బంగారు పాదుకలను తొడుగ మరచిపోయెను. మహారాజు చిత్తము ఎవరితను ప్రసన్నురాలను చేయనున్నదో.

అంతట మెల్లగా వసంతభూపాలుడు, సిగ్గుచే తల వంచుకొని, ఆపాదమస్తకమును గడగడ వడకిపోవుచున్న నాట్యసుందరిని సమీపించెను. నట్టువగణ మంతయు చోద్యమంది చేష్టలు దక్కి చూచుచుండిరి. లకుమ ఇంకను దలయెత్తి చూడలేదు. మహారాజు ఆమెను సమీపించి — ఆమె పాణిపద్మమును తనకరపల్లవమునందు మెల్లగా చేర్చి,—"దేవి! లకుమాసుందరీ" అనుచు ప్రేమతో సంభావించెను.—

నిశ్చేష్టురాలయ్యెను లకుమ. ఒక క్షణములో నామె బ్రహ్మాండమునంతయు నిండిన ప్రేమాధిరాజ్యపీఠమున నధివసింపగలిగితి నని ఆనందపరవశురాలయ్యెను. ఆపారవశ్యమున ఆమెకు మేన పులకలంకురములయ్యెను. "నా జీవితము, నా సౌందర్యము, నా జవ్వనము, నా నాట్యాభినయము, నా మంజుల సంగీతము అన్నియు, జగత్ప్రభువుల పాణిస్పర్శచే ధన్యత నొందినవి. ఈ దాసురాలి ననుగ్రహించుటకు ధరణీశు లెంతటి మహోదారులో గదా!" అనుచు మందహాసముతో క్రీగంటిచూపుచే మహారాజును పరితుష్టునిచేసెను. ఒక లుప్పొంగుచుండ, ఒండొరులు ఒకరి మేనులపై నొకరు వ్రాలిరి. కీలుబొమ్మవోలె లకుమ మహారాజునురముపై తలవాల్చెను.

వసంతోత్సవములు వర్ణనాతీతముగా జరిగిపోయెను. లకుమాదేవిని భూమీశుడు మన్నించి భోగపత్నిగా నంగీకరించెను. ఇపుడామెకు రాణివాసమున నెలవు కుదిరినది. ఆమె పృథ్వీశునకు హృదయేశ్వరి అయినది. కాటయవేముడు తనయేలిక కుమారగిరిప్రభునకు సమ్మోదమును గూర్పదలచెను. లకుమాదేవి భరతశాస్త్రపాటవమును గాంచి సంగీతకళానైపుణ్యమును విని యానందించినపిదప నాతడు భరతశాస్త్రమునకు వ్యాఖ్య రచించి, దానికి వసంతరాజీయ మని పేరిడి, ఆంధ్రోర్వీశునియనుమతి బొంది యాతనికి అంకితమిచ్చి చిరకీర్తి సంపాదించుకొనెను.

లకుమపై ప్రేమచొప్పన కొమరగిరి వసంతభూపాలుడు ఆమె నివాసమునకై గృహరాజమును నిర్మించెను. అది మూడంతస్తులు గల ఒంటిగోపురపు పెద్దమేడ. శోభనము ముడివడునట్లు అలంకరింపబడిన యాగృహరాజమును వీక్షించుటకు తలయెత్తి చూడవలయును. దాని సౌందర్యమును వర్ణింప శేషునికైన అలవికాదు. దానిచుట్టును అనంతము లయిన కేళీసరస్సులు, పూదోటలు, పూవు

పొదరిండ్లు, లతామంటపములు, అనేకములు గలవు. పుష్ప సౌరభమును దశదిశలందు వెదజల్లుచుండు పుష్పజాతులు అచ్చట నుండునట్టివి భూమిపై నన్నియు నొక్కచోట నక్కడున్నట్లు ఎక్కడను గాంచము. గృహరాజమందు ఎల్లవేళల కస్తూరి, కుంకుమ, కాలాగురు, పంకుమదము, చందనము, గంధసారములు పరిమళములు వెదచల్లుచుండెను. గృహరాజమునందే యొక కేళిసరసు గలదు. వసంతభూపాలుడు ప్రియాంగనతో జలక్రీడ లాడుటకు దానిని పనిబట్టి నిర్మించినాడు. అందు శిలానిర్మితములయిన గోడలందు చిత్రములయిన చిత్తరువులను వ్రాయించినాడు. వాటిపై కాంతి వెదజల్లుటకు అందందు వజ్ర వైడూర్య, మాణిక్య, గాణిక్యములను పొదివించినాడు. కుమారగిరి యభిమతమును దెలిసి, శిల్పులును, కాసెవారును, సెలయేటివంటి ప్రవాహము, క్రిందినుండి ఉవ్వెత్తుగ పైకెగసి నల్దెసల నీటిని వెదజల్లు నిర్ఝరీప్రవాహమును నిర్మించిరి. అందుండి సువాసనలతో నిండిన పన్నీరు పైకెగయుచుండెను. అందు చుట్టునుగల గోడలందు లోహనిర్మితము లయిన నిలువుటద్దముల నిలిపి యుంచిరి. కేళిసరసుచుట్టును పూదోట నమరించియుంచిరి. అందందు లతామంటపములు పూవుబొమ్మలు నెలకొల్పియుండిరి.

గృహరాజమునందు మొదటి యంతస్తునందు నాట్యశాల గలదు. అచ్చట వేడుక జనించినపుడు మహారాజు ప్రోలను లకుమ చిత్రగతుల నాట్యాభినయములు చేయుచుండెను. సంస్కృతాంధ్ర వాఙ్మయ గీత ప్రబంధములను పాడుచుండును. నాట్యశాలకు నాల్గువైపులందును సంగీత సాహిత్య, భరత నాట్యాది శాస్త్రములందు పూర్వులు రచించిన మహాగ్రంథముల నన్నింటిని లకుమాదేవికొరకై కుమారగిరిభూపాలుడు, సేకరించి భద్రపరచి యుంచెను. సకల కళాకలాపచతురు డని సార్థకత సంపాదించెను. నిక్కముగ కళాప్రపూర్ణు డయ్యెను. సంగీత, భరతాది విద్యలందు తీర్పులైనవారికి పారితోషకము లిచ్చి వారొసగిన గ్రంథములను సొంతముగ బరికించి విద్వాంసు డయ్యెను. ఆతడు చూడని గ్రంథముగాని, సేకరించని పుస్తకముగాని లేదు. సంగీతనాట్యశాస్త్రములందు లకుమాదేవి కుమారగిరిధీవర్యుని ప్రాపు గల్గి రంభాది దివ్యాప్సరసలకు మిన్నయని గణుతికెక్కెను. ఆ కాలమున లకుమాదేవికి గల్గిన ప్రశస్తి ఢిల్లీసురతాణికిని గూడ లేదన్న నతిశయోక్తి కాజాలదు! ఆమెను ఒకసారి సందర్శించి, ఆమె యనుగ్రహమును సంపాదించి, యామె సౌజన్యమున నామె ప్రకటింపగల సంగీత కళాకౌశలమును నాట్యాభినయ నైపుణ్యమును అలవరుచుకొనదలచి, అందలిమినుకులను గ్రహింపదలచి, జవ్వనులగు సుందరు లెందరో అటు కాంచీనగరమునుండి, విజయనగరమునుండి, ద్వారసముద్రమునుండి, ఇటు కలుబరిగనుండి, కటకమునుండి, అటు దేవగిరినుండి ఢిల్లీనుండి, కొండవీడు చేరి కాపుర ముండవచ్చిరి. "లకుమాదేవి వారాంగన, సామాన్యురాలుగ నెంచరాదు. ఆమె సర్వజగత్ప్రసిద్ధ సుమనోబాణాసనామ్నాయ విద్యోపాధ్యాయినిగదా! కొమరగిరి వసంత భూపాలోపాత్త గోష్ఠీప్రతిష్ఠాపారీణగదా!" అనుచు లకుమాదేవిని కొనియాడనివారు రెడ్డిరాజ్యమునందు గానరాకుండిరి.

గృహరాజమునందు మూడవయంతస్తుపై లకుమాదేవిశయ్యామందిరము గలదు. అందు అమర్పబడియుండు భర్మపాంచాలికలు పృథ్విపై మరియొకచోట చూడబోము. అందు బంగరుతూగుటుయ్యెల కలదు. అందుండు చిత్రములు వర్ణింప నెవరితరము? అందు గోడలపై చిత్రములు రచించినారు. ఒకచోట దారుకావనభూమి, ఒకచోట యమునాతీరము. గోపకన్యలతో విహరించు గోపాలుని రహస్యక్రీడ లన్నియు అందందు మనోజ్ఞముగ చిత్రింపబడియుండెను. ఒకచోట తారాశశాంకుల సరససల్లాపములు, ఒకచోట అహల్యాసంక్రందనుల క్రీడావిహారములు, ఒకచోట పరాశరుని మోహవివశత, ఒకచోట కిరాతార్జునీయకథ — ఒకచోట ఉత్తరరామచరిత్ర యిట్లనేకకథలు అచ్చట కుడ్యభాగములందు చిత్రితములై యుండెను. అది ఒకవిధముగా శయ్యామందిరము. ఒకరీతిగా చిత్రశాలయునుగూడ. ఆ మందిరమున కావల గృహరాజమునకు సౌందర్యమును గూర్చు గాలిగోపురము గలదు. అందుపవసించి చూచిన కొండవీడు ఏడుప్రాకారములును నగరమును సమస్తమును మనోజ్ఞమై కానిపించును.

లకుమాదేవి కుమారగిరుల ప్రేమైకజీవితము పండువెన్నెలవలె దశదిశాంగణములందును పరిమళించుచుండెను. కాని యది రెడ్డిసామ్రాజ్యలక్ష్మీసపత్నిపోరునకు గారణమయ్యెను. రెడ్డిరాష్ట్రరమణి, లకుమతో, కుమారగిరిభూమీశుని ప్రేమను పంచుకొని యనుభవింప నోచుకొనలేదు. అంతట చింతలు పొడసూపెను. కొమరగిరి వసంతభూపాలుడు సకలవసుమతీరాజ్య భారమును తనబావ కేమారెడ్డి భుజాస్కంధముపై మోపి, తాను హాయిగ సుఖవినోదగోష్ఠిలో కాలము బుచ్చుచు దేవేంద్రునిపగిది నుండెను. అట్లు కొన్ని దినములు, వారములు, మాసములు, సంవత్సరములు గడచిపోయెను. ఒకవంక మహాపరాక్రమశాలి బావ, సచివుడు, నెచ్చెలి, చమూపతియునై రాజ్యమును రక్షింపుచుండ నొకవంక అవచి త్రిపురారి, సెట్టియై ద్రవ్యమును కొఱతలేకుండ నొసగుచునుండ కొమరగిరి భూలోకదేవేంద్రునివలె ప్రకాశించెను.

* * *

కాని కొన్ని దినములకు విపరీతములు పుట్టెను. లకుమాదేవి యదృష్టము ఈర్ష్యకు గురియయ్యెను. కొమరగిరిభూపాలునకు లకుమాదేవిపై అనాయ జనింప చేయుట కెవరో పన్నాగములు పన్నిరి. లకుమాదేవి తనప్రాణము, తన సర్వస్వము మహారాజుపాదములపై సమర్పించెను. కాని దుష్టవార్త యొకటి రాజేంద్రుని చెవిసోకెను. భూమిపాలున కీమాట విషముతో నింపిన బల్లెపుపోటువలె బాధ కలిగించెను. తొలుత ఆ నిందను విశ్వసింపలేకపోయెను. కాని పరీక్ష కావలయునని యాతనికి తోచెను. వ్యాజసన్నిభమైన యారాజశేఖరుని హృదయకంచుకము ప్రయ్యలయ్యెను. అమృతభాండమున విషము చిందెను. ఆతడు నమ్మలేకపోయెను. నమ్మకయుండలేకపోయెను. అంతట నాతడు గృహరాజమునకు పోవుట మానుకొనెను. మహారాజు ప్రవర్తనము లకుమాదేవికి వింతగా కనుపట్టెను. మహారాజునకుచుట్టును అంధకారము వ్యాపించుటచే చిత్తశాంతి లేకపోయెను. లకుమకు ప్రాణేశుని యాదరణములేమిచే ఆశ్రయము లేనిదయ్యెను. అనురాగాతిశయముచే, ఆమెను మహారాజు శిక్షింపలేదు; పరీక్షించుటకైనను సాహసింపలేకపోయెను. ఒకవంక స్వాభిమానమును, మానసంరక్షణాభిలాషయు మరియొకవంక హృదయేశ్వరి యగు లకుమాదేవిపై మోహమును, ఆతనికి కర్తవ్యమును దోపకుండ చేసెను. ఈ అంతఃపురద్రోహము చేసిన ఆపాతకుని శిక్షించుటకుగాని, ఆతని విమర్శించుటకుగాని యాతడు పూనుకొనలేకపోయెను. చపలచిత్తయైన దోషము స్త్రీదిగాని పురుషుని దెట్లగును? అని యాతడు వితర్కించుకొనెను.

కొన్ని దినములు, నెలలు, క్రమముగా దీర్ఘములై గడచిపోయెను. చివరకు రాజేంద్రుడు సాహసించెను. గృహరాజమునకు గజారూఢుడై యరిగెను. మూడవ అంతస్తుపైకి శయ్యామందిరమునకు మెల్లగా నెక్కిపోయెను. 'ఇన్ని దినములకు మహారాజునకు మాదేవిపై యనుగ్రహము కలిగె'నని దాసీజనము, పరిచారికలు తత్తరమంది, లకుమాదేవితో విన్నవించిరి. అంతటంతట జాగుసేయక లకుమ సింగారించుకొని, సర్వసన్నద్ధయై మహారాజును సమీపించి ఆయన పాదములపై సాష్టాంగముగ వ్రాలెను. ఆమె కన్నీటిచే మరల రెండవసారి శ్రీపాదములు తడిసిపోయెను. అందు పాపటచంద్రుమండి పద్మరాగములు మునుపటియట్లు శ్రీపాదపద్మములను రంజింపజేయలేదు. 'జగత్ప్రభూ, రక్షింపుడు — ఈదీనురాలు దోషిగాదు' అని గద్గదికతో ఎట్లో పలికెను.

మహారాజు హృదయము చలించెను. కాని లకుమను తన పాణిపల్లవముతో లేవనెత్తలేదు. 'లకుమా! — లెమ్ము నిన్ను పరీక్షింపవచ్చినాడను' అని పలికెను. "ప్రాణేశ్వరులకు దయకలిగిన దదియే చాలును. అదియే మహాప్రసాదము".

"నీవు నిర్దోషివని నిరూపించవలయును."

"దేవరయాజ్ఞ శిరసావహించుచున్నాను."

ఆ యుభయు లంతట శిలాప్రతిమలట్లు కొంతవడి నిశ్చేష్టులయి నిలువబడి పోయిరి. వసంతభూపాలుడు ఎత్తిన చూడ్కులు దింపకుండ నట్లె కొన్నిక్షణములు శూన్యదృష్టితో చూచుచునట్లుండెను. కాని ఆతనిమనోవీథియందు ఎన్ని భావములు పుట్టి, పెరిగి, విరిగిపోయెనో? ఆతని హృదయ

సీమయందు కాఠిన్యము కొనదేలినకొండవలె నుండి పోయెను. మహారాజు ముందునకు నడువసాగెను. అతని యభిమతి నెరిగినయట్లు లకుమాదేవి వెంబడించెను. దాస దాసీజనము భయభ్రాంతులయి గుసగుసలయిన నాడుటకు సంశయించి నివ్వెరపాటు చెందియుండిరి. ముందు కొమరగిరిరాజేంద్రుడును, ఆ వెనుక కారు మేఘమువంటి వెలుగు మెరుపుతీగచందమున లకుమ గృహరాజు మేడ ఉపరిభాగమునకు మెల్లగా నడచి పోయిరి. అక్కడనుండి గాలిగోపురములోనికి పోయిరి. గృహరాజమును నిర్మించినతరువాత అచ్చటికి ధరణీశుడు నాతని పడతియు పోవుట యిది రెండవసారి. ఆ గోపురము ఎంత రమణీయమైనదో అంత భీకరమైనది. గోపురద్వారమును జొచ్చి, కుమారగిరి ప్రియాంగన దిక్కుముఖమై,

'లకుమా! నీవు నిర్దోషివికదా?' అని ప్రశ్నించెను.

'చిత్తము జగత్ప్రభూ! పరీక్షింపవలయునుగదా!'

'పరీక్షయే మా యభిమతమును.'

'దేవర చిత్తము ఈ దీనురాలిభాగ్యముగదా!'

'ఈ గోపుర శిఖరమునమండి నీవు అధఃసుభాగమునకు దుముకవలయును, నీవు నిర్దోషివని నిరూపించుకొనుటకై. చావక బ్రతికియుంటివేని, నీ హృదయము నిష్కళంకము....ఆవల నా భాగ్యము.'

'ఏ త్రిపురాంతకుని సాన్నిధ్యమున ఈదీనురాలిని జగత్ప్రభువులు చరణదాసిగ స్వీకరించిరో ఆ త్రిలోక వంద్యుని స్మరించి మీ యాజ్ఞను శిరసావహింతును' అని పలికి,

"ఓపార్వతీ ప్రాణవల్లభా, మృడా, మహేశా, మృత్యుంజయా రక్షింపుము" అనుచు, నాతరుణి లకుమ, గృహరాజగోపుర శిఖరమునుండి క్రిందికి దుమికెను. రాజేంద్రుడు నిశ్చేష్టుడయ్యెను. ఊరక ఆకాంతములందు దృక్కులు సారించెను.

లకుమాదేవి ధరించిన పావడ అపుడామెకు రక్షణసాధన మయ్యెను. మృత్యువాత బడదలచి నాట్యశాస్త్రోపాధ్యాయిగావున, ఆమె ఒయ్యారముగ దుమికెను. ఆ యొయ్యారము శోభనాస్పదమై వెల్గుచుండ, ధరించినట్టి పావడ విచ్చినఆతపత్రమట్లు రక్షింప మెల్లగ నాకల్యాణి నేలకు వ్రాలెను.

ఆ సంరంభము నంతయు విలోకించుటకై రాణివాసమునందలి దాసదాసీజన మంతయు నొక్కసారిగా గుమిగూడిరి. వారి నందరిని గాంచి లకుమ తల యెత్తలేక పోయెను. మూడులోకములుగూడ పైబడి యొక్కమారు ఆమెను అధోగతిని ద్రోసినట్లు ఆమెకు బోధ గట్టెను. మహారాజు సంభ్రమముతో నొక్కత్రుటిలో తనదేవేరి చెంతకు వచ్చి నిలువబడెను.

లకుమ ప్రాణేశుని ముఖముపై మరల దృష్టి సారింపలేదు.

"భవహరా! శివా! పశుపతీ- ఈపాపిని రక్షింపుము" అని ఆమె యెలుగెత్తి యరచెను. ఉత్తర క్షణమున - ధరణీకాంతునివైపు దిరిగి,

"ప్రాణవల్లభా! తమ పరీక్ష పూర్తియైనది. నేను అకలంకను. కాని నేను తమ చరణదాసిగా నుండ నర్హను. క్షమింపుడు. లజ్జానలము నన్ను కాల్చియు, చావనీయకున్నది. వజ్రాఘాతముకంటె పరుషమయ్యెను భవదాజ్ఞ నాకు మృత్యువును చూపలేదు......... ...మానధనులగు మానినులకు మృత్యువు కోరిన వచ్చును. ప్రాణవల్లభా! క్షమింపుడు. శివా! త్రిపురాంతకా! అమరేశ్వరా! శరణు-" అని అనుచు ఒడ్డాణములో దాచుకొనియున్న చేకత్తిని తటాలున దూసి వక్షస్థలముపై గ్రుచ్చుకొనెను.

* * *

ప్రాణవిహీనయయ్యును రక్తపరసియందు చెన్నుచెదరని సౌందర్యముతో ప్రకాశించు నాయంగనను జూచి హా హా కారము చేయుచు, రాజేంద్రుడు పరువెత్తిపోయి, పదిఅడుగులు దాటకుండగనే మూర్ఛపడి పోయెను.

* * *

లకుమాదేవి వియోగము కొమరగిరి రాజునకు అశనిపాతముకంటె దారుణముగ బాధాకరమయ్యెను. అతనిచిత్తము స్థైర్యమును గోల్పోయెను. అతడు బుద్ధి

మాంద్యము నొందెను. ఆరోగ్యము ఒక్క ముహూర్తము లో ఆతని విడిచిపోయెను. ఆతడు పూర్వపు మానిసి మరల కాలేదు. మంచముబట్టి మరల దిగలేదు. రాజ్యభారమును భార్గవమతియును, గురుసదృశుడునైన కాటయ వేముడు పూనియుండి ధరణీస్థలిని రక్షించెను.

గృహరాజముపై కొన్ని దినములకు పిడుగుపడియెను. సర్వము నక్కడనొక్క త్రుటిలో కూలిపోయెను. పూర్వక్షణమునందు శోభనము నుడివడుచున్న సౌధరాజము, ఉత్తరక్షణముననే కూలిపోయెను. ఇప్పుడా గృహరాజముయొక్క చిహ్నెలయిన అచ్చట గానరావు.

* * *

### పరిశిష్టము

ఇంతవఱకు చదివినదంతయు కేవల కల్పనా కథ గాని చరిత్రగాదు. లకుమాదేవి, కుమారగిరి వసంత భూపాలుడు, కాటయ వేమారెడ్డి, యిమ్మడి హరిహర రాయ మహారాయలును మాత్రము చారిత్రక పాత్రములు. గృహరాజ సౌధమును చరిత్రయందు ప్రసిద్ధి కెక్కినదే! "హర్మ్యనమరావతికి జోడ"యిన కొండవీడు ఒకనాడు ఆంధ్రమహానగరమై విరాజిల్లెను. ఇట్టిచరిత్ర ప్రసిద్ధములయిన సామగ్రియందు ఒక కల్పనాకథను పొదివినాడను! చదువరి యీ కల్పనను చరిత్రయని భ్రమపడి మోసపోకుందును గాక!

---

# ఆహ్వానము

శ్రీ గుఱ్ఱం వేంకట సుబ్రహ్మణ్యం

అవలితీర మాహ్వానము నంపుచున్న
ది మృదులసమీరములచేత దినదినమ్ము;
అచటిసౌరభ్యముల నొకింత చవి చూపి
యూసవెట్టుచున్నది; దూతలట్లు వీచి
కలు పదములఁ జుట్టుకొని నవ్వులొలయనుఁ
గదలి ర మ్మనును; విచిత్రకాంతు లడర
శక్రచాపతోరణ మదె స్వాగతాంక —
మైన నాకేమొ పోవలె ననుతలంపు

పుట్టుకున్నయది, స్వయము కట్టుకొంటి
నీకుటీర, మీమల్లిక లేన నాటి
యళ్లువెట్టితి, నగ్గెడ హద్దులేర్ప
ఱచితి, 'నా'యను భావమ్ము ప్రచురమయ్యె;
నీ 'యహం'భావ మేదిన నే మొదవునో
యెఱుఁగ; ననుభవించినఁ గల్గు నెఱుక యనిన
నే నెటులు నమ్ముకొని పోదు నిచటు వాసి.

---

# నవ్యాంధ్రకవిత్వము: భావచిత్రణ*

శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు

నిగూఢమైన కవితానిర్ఝరి మానవజీవితపు అనాదికాలగర్భంలోనే పుట్టుపు పొందిందని చెప్పవచ్చు. మానవహృదయపు లోతుల నుంచి ఉబికివచ్చే రసోల్బణాన్ని నిరూపించే కవిత్వవాణికి దేశకాలపాత్రలను అధిగమించిన కొన్ని నిత్యమైన మూలసూత్రాలు వుంటాయి. ఈప్రాథమికసూత్రాలు ఒక్కొక్క దేశసాహిత్యంలో ఒక్కొక్కరీతిని అనుసరించి నిర్వచనం పొందాయి. సంస్కృతసాహిత్య చర్చలో 'రస' మన్నారు; 'అలంకార' మన్నారు. ఆంధ్రసాహిత్యచరిత్రలో గతానుగతికంగా కావ్యలక్షణాలను, అలంకారలక్షణాలను వరవడి దిద్దుకున్నారు. ఇక ఆధునిక సాహిత్యాలన్నింటిలోను పురాతనలక్షణ శృంఖలలను తెగత్రెంచుకొనే స్వాతంత్ర్యోద్యమం ద్యోతక మవుతున్నది.

ఈ స్వాతంత్ర్య లక్షణాన్ని నిర్వచించుకోవాలంటే విజాతీయపరిభాష ఒక్కొక్కప్పుడు సుకరమైన సాధనం కావచ్చు. ఈ సందర్భంలోనే విజాతీయ పారిభాషికమైన "భావచిత్రణ" (ఇమేజరీ) అనే గుణాన్ని నిరూపించడం మనపరిశీలనపథంలో కొంత నూతన కాంతిప్రసారం చేయగలదేమో చూడాలి.

ఒక ఆధునిక ఆంగ్లవిమర్శకుడు "శతాధిక కావ్యకర్తకంటె ఒక్క ఉత్కృష్టభావచిత్రం ప్రదర్శించగల కవియే ధన్యు" డన్నాడు. "రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యం" అనీ, "వాక్యం రసాత్మకం కావ్యం" అనీ చెప్పిన సంస్కృత లాక్షణికుల నిర్వచనాలకు, పై ఆంగ్లవిమర్శకుని అభిప్రాయానికి చాల చేరువ వున్నట్లు తోస్తుంది.

"మానసికభావాన్నీ, రసోద్వృత్తినీ క్షణికంలో స్ఫురింపజేసేది భావప్రతిమ" అనికూడా అన్నాడు ఆవిమర్శకుడే. అట్టిభావప్రతిమను ఒక్కక్షణంలో పట్టుకోగలిగితే కాలపరిమితిని, దేశపరిమితిని విజయించే హఠాత్ మోక్షానుభూతి, చైతన్యవిస్ఫూర్తి ప్రఫుల్లమై, మహాకావ్యలక్షణాలన్నీ అందు మూర్తీభవింపగలుగుతాయని కూడా ఆవిమర్శకుడు వ్యాఖ్యానించాడు.

మరొక విమర్శకుడు ఐరోపీయ వాఙ్మయంలోని భావచిత్రకుల గుణనిర్దేశం చేస్తూ వారికవిత్వకల్పనలలోను, కళాసృష్టిలోను, 'ఆకారపటిష్ఠత, విస్పష్ట ప్రతిమాస్ఫూర్తి, సంక్షిప్తత, భావస్ఫురణ, ఛందోబంధనల నిర్లక్ష్యత' ముఖ్యంగా ద్యోతక మవుతా యన్నాడు.

ఈ గుణాలు నవ్యాంధ్రకవుల రచనలలో సందర్శించాలని నా ఆశయం.

నేటికాలపు తెలుగుకవిత్వానికి ఒకవిధంగా అధిష్ఠాతయే కాక, మార్గదర్శకుడూ, ప్రోత్సాహకుడూ అయిన శ్రీ గురుజాడ అప్పారాయకవి చిన్నగేయాలలో ఈగుణం మెరుగుపుడుగులా మిలమిలలాడుతూంది.

* రేడియో ప్రసంగ ఖండి; మద్రాస్ ఆల్ ఇండియా రేడియోవారి అనుమతిని.

అప్పారాయకవి 'పూర్ణమ్మ'కథలో—

"కొంపకు నడుమ కొల నొక టుంది
కొలని ప్రక్కన కోవెల వుంది

అంటూ వర్ణించిన పాదాలలో పూర్ణమ్మ జీవితగాథకు చక్కని అనుకూల వాతావరణం నిర్మించాడు. అయితే ఈ చిత్రంలో బొమ్మకట్టడం ఎక్కువ నేత్రేంద్రియానికే అనిపిస్తుంది.

పై పాదాలతో పోల్చేందుకు ఆతడు వ్రాసిన దే మరోఖండిక ఏరుకుందాం:

"దేశ మంటే మట్టి కాదోయ్,
దేశ మంటే మనుషులోయ్"

అన్నాడు. ఇక్కడ 'మనుషు' లని అనగానే మనుష్యభౌతికస్వరూపం నాకళ్ల కు కట్టదు. అమూల్యమైన మానవజీవితమూ, జీవిత కేంద్రంలోని పిపాసలూ, పిపాస పరమావధిని చేరుకునే ఆందోళన, ఆందోళన విజృంభించి పరిణతి గాంచేందుకు తగిన సాధనసంపత్తి నాహృదయాంతరంలో ప్రతిబింబిస్తాయి.

ఇట్టి ఖండికలలో శ్రీ గురుజాడకవిలో తెలిసీ తెలియకుండానే ఒక నూతనమైన రూపకల్పనవిధానం అంకురప్రాయంగా వ్యక్తమయింది.

రాయప్రోలుకవిలోను, శ్రీ అబ్బూరిలోనుకూడా అలంకారరచనా ప్రావీణ్యం ఉత్తమాంధ్రప్రబంధరచనలలోవలెనే లాలిత్య మనోహరంగా నిరూపితమైనప్పటికీ, వీరిరితి ఒక నవీన భావోద్దీపనకు మూలకందంగాకూడా వుంటుంది. ఈనవీనతయే ఆ ఇరువురి కవుల మనఃస్థితిలోను నూతన పరిణతిని స్ఫురింపజేస్తుంది.

భారతీయ నవ్యసారస్వత ప్రబోధానికి ప్రతిష్ఠాతలైన రవీంద్ర, అరవింద, సరోజినుల కావ్యకల్పనలలో వికసించిన ఆదర్శాన్వేషణ, మదాశయప్రశస్తి సౌందర్యపిపాస - ఈమూడు గుణాలు — తెనుగు దేశంలో వారి అనుయాయులైన రాయప్రోలు, అబ్బూరి కవు లిరువురి కావ్యాలలోను ముఖ్యంగా ప్రతిబింబిత మవుతాయి. అయితే, వీరి రచనా విశిష్టతను మొత్తంమీద నిర్వచించుకోవాలంటే వీరి కవితలో భావచిత్రణంకంటె అలంకార చాకచక్యము, శయ్యామాధుర్యము, అధికతరంగా ప్రగల్భించినట్లు చెప్పవచ్చు.

రాయప్రోలుకవి,

"తన గుణలతలు పూచిన శోభలో యన
చిరునవ్వు వెన్నెలచెండ్లు విసర,
తన మనోలీల కాంచిన రాగమధువు వన
పలుకుకొమ్మలు పూలవాలు పిదుక,
తన భావబంధ మందిన విభ్రమం బన
చూపులు వలపుటున్నులను పన్న,
తన ప్రేమభావముల్ గను నూర్మికళ లన
నడలు ప్రాయంపుమిన్న వలు సూప"

అంటూ నాయికను వర్ణించినప్పుడు కేవలం లలితాలంకారపోషణ మూలకంగా నాయికస్వభావాన్ని, స్వరూపాన్ని నిర్మించే ఆసక్తిని ప్రదర్శించాడు. ఈ విధానం భావచిత్రణకు అత్యంతసన్నిహితం కాకుండా ప్రబంధచమత్కృతికే ఆత్మబాంధవ్యాన్ని ఋజువుపరుచుకుంటుంది. ఇట్టి వర్ణనకు మాతృకలు ప్రబంధకవిత్వంలో అనల్ప సంఖ్యలో చూపట్టగలవు. 'మనుచరిత్ర' లోని వీణావాదిని అయిన వరూథిని వర్ణన దీనికి తీసిపోదుగదా! నేత్రపర్వమైన ప్రతిమా

నిరూపణము అల్లసానివాని కృతిలోనే స్పష్టతరంగా అభివ్యక్త మవుతుం దని అనడానికి అవకాశం వుంది.

పైన చెప్పిన భౌతికస్వరూపకల్పనమునే ఆలంబనగా గైకొని అంతకంటె ఉచ్చతరమైన భావాకృతులను మనోదృష్టికి బింబించే శక్తి ఆంధ్రప్రబంధకర్తలలోకంటె అత్యున్నతస్థాయిలో సంస్కృత మహాకవుల రచనలలో చూడగలము.

నేటి ఆంధ్రకవనంలో భావచిత్రణకు అధికావకాశం ఆత్మపరమైన ఖండికలలో లభిస్తుంది. కొందరు సిద్ధహస్తుల పరిపోషణలో ఈ బాణీ రూఢమై, పటిష్ఠంగా ప్రామాణ్యమును స్థాపించుకుంటోంది.

ఇట్టి సిద్ధహస్తులలో కృష్ణశాస్త్రి, నాయని సుబ్బారావు, విశ్వనాథవంటివారిని అగ్రేసరులుగా పేర్కొనవచ్చు.

కృష్ణశాస్త్రికవిత, సూర్యకాంతపుష్పం ఒక్క కాండంమీద ఒంటరిగా వికసించినట్లు, ఆత్మానుభూతినే ఆలంబనగా గైకొని ఖండకావ్యంగా ప్రఫుల్ల మవుతుంది. దృశ్యప్రపంచాన్ని గుర్తించే ప్రకృతివర్ణనలు, దృశ్యజీవితాన్ని నిరూపించే ప్రబంధ, కావ్యాదులలోకంటె కృష్ణశాస్త్రి మొదలైన కొందరు ఆధునికుల ఖండికలలో ఆత్మపరమైన రహస్యప్రపంచం, సంజ్ఞారూపకమైన నిగూఢానుభూతి, ఉత్కృష్ట రసోద్దీపకములైన భావచిత్రాలూ పాదు లేర్పరుచుకోగల వని చెప్పవచ్చు.

ఇందుకొక ఉదాహరణ: కృష్ణశాస్త్రి—

"నాకు నిశ్వాసతాళవృంతాలు కలవు,
నాకు కన్నీటిసరుల దొంతరలు కలవు,
నాకు.........
నిరుపమనితాంత దుఃఖంపునిధులు కలవు"

అని అన్నాడు. ఈపాదాలలో నిరూపించిన వస్తుసామగ్రిలో ఒక్కటీ మనకు భౌతికపరిమాణంలో లభ్యం అయ్యేది కాదు. వీటిని పట్టుకునేందుకు మరొక ప్రపంచంలోనికి ప్రవేశం పొందాలి. అది కావ్యసాధకుని "శోకభీకర తిమిరలోకం"! ఆ లోకావరణంలోని అంశాలు భౌతిక రూపావరణంలో ఇముడవు. దానికి మించిన భావస్ఫురణను విరజిమ్ముతాయి. ఆ అంశాలు ప్రసరించే భావన ఉపమ, రూపక, ఉత్ప్రేక్షాది అలంకారాల చమత్కృతిలోనే నిర్బంధింపబడ లేదు. ఆయాసామ్యాలకు ఔచిత్యంతో పాటు, అగాధస్ఫురణప్రసరణానికి తగిన స్ఫాటిక స్వచ్ఛతకూడా అగత్య మాతుంది.

మరొక ఖండిక ఏరుకుందాం:

"రేయికడుపున కీచటిచాయవోలె,
తమసు పెడద దివాంధగీతమువిధాన,
ఘూకరావాన వలవంతరేకరీతి,
నా విషాదమ్ములో దాగినాడ దేవె."

విషాదంయొక్క రూపాన్ని మనకు అవగాహన చేసేందుకు మూడు ఉపమానాలు చెప్పాడు కవి; అవి అన్నీ పూర్ణంగా యథార్థప్రకృతిసిద్ధమైనవి కావు. "ఘూకరావం"లో "వలవంత రేక" వున్నదీ లేనిదీ శాస్త్రజ్ఞులు నిరూపించలేరు. అయినా కవి ఆ ఆరోపణ చేసి, తత్ సహకారంతో మన హృదయాలను ఒకానొక శ్రుతికి బంధిస్తున్నాడు. ఆ శ్రుతిలో మనం కవి భావగానం విన్నప్పుడు, అతని ఉపమానచిత్రణం పుష్పంలా వికసించి, సుగంధంలా మనలను ఆవరించి, మన అంతరదృష్టికి కొన్ని అలౌకిక చిత్రాలను స్ఫురింప

చేయగలుగుతుంది. ఈచిత్రాలద్వారా మన మనస్థితి కవి అనుభూతికి చేరువ అవుతుంది.

ఒక చిన్న కావ్యఖండం ఎట్టి పూర్ణానుభవాన్ని క్షణికంలో ఘనీభవింపజేసి, మన ఎట్టయెదుట విస్పష్టమైన రేఖలతో భావప్రతిమను సృష్టించగలదో చూడవలెనంటే,

"మీరు మనసారగా నేడ్వనీరు నన్ను-" అనే పాదంతో ప్రారంభించే "కృష్ణపక్షం"లోని గీతాన్ని పరికిస్తే తెలుస్తుంది. ఈగీతం ఆలపించిన కవి నిలిచినది అంతర్ద్విత వేదిక. ఈ గీతాన్ని అలంకార ప్రాచుర్యంతో కవి చిత్రించలేదు. ఈ కావ్య ఖండం అంతా ఏకైక ప్రపూర్ణ చిత్రాంకితము.

మరొకరకం ఉదాహరణ: ఇదీ కృష్ణ శాస్త్రిదే:

"ఆమె కన్నులలో అనంతాంబరంపు
నీలినీడలు కలవు; వినిర్మలాంబు
పూర గంభీర శాంత కాసార చిత్ర
హృదయములలోని గాఢంపు నిదురచాయ
లందు నెడనెడ గ్రమ్ము; సంధ్యావసాన
సమయముల నీపపాదపశాఖికాగ్ర
పత్రపుటిల మార్గములలోపల నవంపు
ఇరుల గుసగుసల్ వానిలో ఇపుడు నపుడు
వినబడుచునుండు,...............
............................."

ఈ గీతంలో ఒక భావచిత్ర పరంపరను వరుసగా త్తిస్తాడు కవి. అంశము 'ఆమెకన్నులు.' వాని లోతు కాంతులను కవి ఊహాతూలికతో కావ్యయవనికమీద చిత్రపరంపరగా చిందించి, ఆమెకన్నుల అగాధంలో వెల్లివిరిసే అగోచరలోక సాదృశ్యాలను ముక్తధారగా సహృదయుని అంతఃకరణలోనికి ప్రవహిల్ల జేశాడు.

"ఈ కుటీర ముఖద్వార
మింకే త్రేలాడి, పగము
వాడి విరహతోరణమ్మునై."

అని అన్నప్పుడూ,

"ఏ కోక వియోగశాలినీ హృదయరాగ
వేదనాలేఖను......"

అని అన్నప్పుడూ, ఇంద్రియానుభూతిని మీరిన సంజ్ఞాప్రధానమైన భావచిత్రణ ప్రభావం మనకు అవగాహన అవుతుంది.

"ఇప్రడు నేనొక్క తుదిరేయి ఇరులచాయ
నై వశించుచున్నాను.........."

అని వర్ణించిన నిస్పృహార్త మైన మృత్యురావంలోనే, నామనస్సునకు, కవి మరుక్షణంలో పొందగల విభాతోజ్జ్వల పరివర్తన స్ఫురిత మవుతుంది.

మరొక ఆధునిక కవిశ్రేష్ఠుడు:

"ఆమె నవనీతహృదయ; నా అంతరంగ
శాంతిదేవత; ఆశాపథాంతరాళ
పారిజాతమ్ము; ప్రేమజీవన విభాత
కైశికీగీతి; నాతపః కల్పవల్లి!"

అని తన ఆరాధ్యప్రణయినీవర్ణన చేశాడు. ఈ గీతంకూడా చాలా నిర్దుష్టమైన భావపరిణతినే వ్యక్తం చేస్తుంది. అయితే సంప్రదాయసిద్ధమైన సామాన్యత దీనిని ప్రబంధపాకానికి దిగలాగుతుంది. ఈరీతిలో ప్రావీణ్యము భావచిత్రాన్వేషణకు పరమావధిని అందీయదు.

అయితే,— నాయని సుబ్బారావు,

"........నాకదృష్టము లయి
ఎన్ని ఆనందధామము లీయనంత
భువన సంధుల భాసిల్లు, అవియు నేడు
మత్పదాక్రాంతములః భవన్మహిమః జేసి"

అని అన్నప్పుడూ,

"ఈ యగమ్య వాయుపథమ్ముల కేగ జేర్చి
మన నడుమ దూరితలైన ఈ వినమ్రశీల
పరమ పరమాణువులకు వాత్సల్యమున్న
ఎవ్వడే, కఠోరముగ శాసించినాడు?"

అని గభీరపృచ్ఛ ప్రయోగించినప్పుడు నా హృదయచక్షువు మరింత విస్ఫారి, ఏవో భావ ప్రతిమల ఆకారాలు రూపించుకుంటుంది. పరమాణువులను ప్రేయసీ ప్రియుల నడుమ దూరత్వానికి పనిచి, వాటికి ప్రత్యక్ష మూర్తి భావ మొసగిన నాయనికవి ప్రబంధప్రమాణా లకు చాలాదూరం ప్రయాణించి, వినూతన గరిమను చవిచూపాడు.

'విశ్వనాథ' కావ్యాలలో "కొండవీటి పొగమబ్బు"లలో ఉదాత్తశక్తితోను, "కిన్నెర సాని పాటల"నడుమ సుకుమార లాస్యం తోను భావప్రతిమాపరంపర ద్యోతక మౌతుంది నాకు.

ఇంకా ఒకరిద్దరు యువకాగ్రేసరులభావ చిత్రణవిధానం పరిశీలించవలసివుంది.

అత్యాధునికులలో భావచిత్రణకు ప్రాధాన్యమిచ్చి భాషించే అభిరుచి "శ్రీ.శ్రీ" గీతాలలో ప్రస్ఫుటిస్తుంది :

"గాలిలో కనరాని
గడుసు దెయ్యాలు
భూదివమ్ములమధ్య
ఈదుతున్నాయి"

అనే చిన్న గేయంలో బొమ్మలుపేర్చి ఈతడు ఒక చిహ్నచిత్రణ స్థాపించాడు. బహుళపంచమి జ్యోత్స్నకు భయపడ్డ ఈకవికిశోరము

"ఆకాశపు ఎడారి
లో కాళ్లు తెగిన
ఒంటరి ఒంటెలా
గుంది."

అని జాబిల్లిని వర్ణించాడు.

ఈ రచనలో నేను, కృష్ణశాస్త్రి కొన్ని ఘట్టాలలో చూపిన పారలౌకిక ప్రతిమాసృష్టి ఉందని హెచ్చరించను. కాని "శ్రీ. శ్రీ" తన విచిత్ర, భయానక శిల్పచిత్రాలద్వారా సృష్టించిన ఏదో ఒక అద్భుతవాతావరణంతో మనలను ఆవరిస్తాడు. ఆ ఊహాగగనంలో "ఇసుక తుపానులు", "గడుసుదయ్యాలు", "కరికళేబరములా కదలని" కొండలు, "వెలిబూదివోలిన" జ్యోత్స్నలు మనచుట్టూ ఇంద్రజాల, మహేంద్ర జాలం చేస్తాయి. ఈవిశిష్టప్రయత్నము ఈ తరుణకవి భావిరచనలలో ఇంకా ఇంకా చిత్ర విచిత్రంగా విడంబించే ధోరణులు స్ఫురిస్తుంది.

ఈతనికి పూర్వికుడూ, అల్పాయుష్కుడూ అయిన పెనుమర్తి వెంకటరత్నం ఛాయా మాత్రంగా ఈ గరిమను ప్రదర్శించాడు. ఒక్క ఉదాహరణ:

ప్రాతరరుణ నవసువర్ణ
జ్యోత్స లూగే తూర్పుదిక్కున
లో తెరుంగని కాళరాత్రులు
కాతులై నిలచెన్ !

ఈసంకీర్ణవ్యాసంలో అంచులుదొరకని క్లిష్టమీమాంసను సంక్షిప్తం చేయక తప్పదు. అయితే, ఈభావచిత్రణ ప్రాధాన్యాన్ని అనుసరించే రసజ్ఞులు — ముఖ్యంగా వైదేశిక "ప్రతిమావాదులు" – ఏమూలసూత్రాలను అభిమానిస్తారో వివరించడం అగత్యం. వీరిదృక్పథంనుంచి విశిష్టత గడించే అంశాలను దిఙ్మాత్రంగా నిర్వచిస్తాను.

౧. లోకవ్యవహారభాషకు కావ్యభాష చేరువగా వుండాలి. సుమారుగా సరిపోయే

పదాలతోను, అలంకారప్రాయమైన పదాల తోను తృప్తిపొందక, భావపుష్టిని సరిచూచి పదప్రయోగం చెయ్యాలి;

౨. క్రొత్తమనఃప్రవృత్తులకు అనుగుణ్యమైన క్రొత్త గమనవైఖరులు సృష్టించుకోవాలి. ప్రాతరీతులు ప్రాతమనఃప్రవృత్తులనే ప్రతిఫలిస్తాయి. అవసరమైనప్పుడు ఛందోబంధనాలను విసర్జించే స్వాతంత్ర్యంనిలుపుకోవాలి. కవిత్వంలో క్రొత్తనడకను సృష్టించగలిగితే, క్రొత్తభావన దానికి పునాది అయి తీరుతుంది;

3. కవిత్వ వస్తువుకు సంబంధించినంత వరకు పూర్ణస్వాతంత్ర్యమే. కాని, నూతన విషయాలను పేలవంగా చిత్రించడం ఉత్తమ కళా కానేరదు; పురాతనవిషయాలను ఉన్నతశక్తిని అభివర్ణించడం అధమకళా కానేరదు. ఆధునికజీవితరంగంలో కళాసృష్టికి అనంతావకాశం వున్నదని గమనించాలి. అయితే, ఝరీవేగంతో ప్రవహించే నవీన లోకపరిణామంతో సమానంగా రచయిత మనఃప్రవృత్తికూడా సరితూగకపోతే మాత్రం ఆతనికృషి సార్థకతను కోలుపోకతప్పదు.



# ఏప్రిల్ నెలలో విడుదల గానున్నది!



క. యస్. తారాపూర్ వాలాగారిచే
తయారుచేయబడిన
బెజవాడ
రామగోపాల్ పిక్చర్సువారి

# పాశుపతాస్త్రము

(తెలుగు)

తెలుగుదేశమందలి కని విని ఎరుగని ప్రకృతి సౌందర్య దృశ్యములు : కోయిదొరల నృత్యగీతాదులు : ఆదర్శకరమైన కళాపోషణ : పరిపక్వమైన శాస్త్రపర్యవేక్షణ : కథ కిరాతార్జునీయ రసవత్తర గాథ...

స్టూడియో : ఆంధ్రాసినిటోను

నటులు :

నిడుముక్కల
రఘురామయ్య
చంద్రమౌళి
సూరిబాబు
శ్రీమతి అన్నపూర్ణ
శకుంతల

సంగీతము : గోపాలసింగ్
దర్శకత్వము : టి. యస్. మణి
కవి : కాళిదాసు



వివరములకు:— సరస్వతీటాకీసు లిమిటెడ్, బెజవాడ.

# మఱుపు దగులనుండు ఒక కవివర్యుడు

శ్రీ ఒంగోలు వెంకటరంగయ్య

ఆధునిక తెలుగుకవులలో రంగయ్య యను నొక కవి 'రామోదయము' అను నొక యుత్తమమగు తెలుగు గద్య పద్యాత్మకమగు కావ్యము వ్రాసియున్నాడు. ఇది తొలుత ౬౦—౭౦ ఏండ్లక్రింద అచ్చుపడి కొన్ని స్కూళ్లలో పాఠ్యగ్రంథముగ నుండినది. తరువాత ౩౦-౪౦ ఏండ్లు దీనిపోవడి తెలియకుండినది. కీర్తిశేషులు విద్యావినోద బిరుదాంకితులు రాయ్‌బహదర్ వనప్పాకం ఆనందాచార్యులవారు (ప్రసిద్ధ మద్రాసు హైకోర్టు వకీలుగారు) మద్రాసునందుంచిన స్వీయ వైజయంతీ ముద్రాక్షరశాలయందు ౧౯౧౩-వ సంవత్సరమున ప్రథమ భాగము అనగా, బాల, అయోధ్యా, అరణ్య, కిష్కింధా, సుందర కాండములను అచ్చువేయించిరి. దీనికి వీరు ఇంగ్లీషున నొక పీఠికయు వ్రాసిరి. మొదటిభాగము యొక్క వ్యాపకము జూచి ౧౯౧౭ లో రెండవ సంపుటము, అనగ యుద్ధకాండము నచ్చొత్తించిరి. మొదటి భాగము రెండవ భాగము అనవ్యవస్థ ప్రకటనలో చేరిన భేదమేగాని కావ్యరచనయందు లేదు.

ఈ రంగకవి యేయూరివాడో యేవర్ణస్థుడో తెలిసికొనుటకు గ్రంథమున నేమియు స్పష్టమగు ఆధారము లేదు. మతముచే వైష్ణవుడని తెలియుచున్నది. శ్రీమద్రామానుజాచార్యులవారిని స్తోత్రము చేసియున్నాడు. తన కులగురువులను 'కందాళ దొడ్డయార్యుల సుందరపదపంకజముల సుస్థిరభక్తిన్, డెందమున నిల్పి పరమానందమునన్ గొలుతు దినదినం బేమఱకన్' అనియు తెలియపరచియున్నాడు.

ఈ గ్రంథమున నీతినిపంకావళి కలదు. అందులోని పేళ్లసవ్యశిని బట్టిచూడ వీరు దాసనంబులు — సాత్తాదవైష్ణవులు ఇత్యాదినామములచేత 'సాతాని' వైష్ణవులుగ నుందురని తోచెడిని. ఈయూహ పొరపాటగునెడల అపరాధక్షమాపణ ప్రార్థనగ సంగీకరింప పాఠకమహాశయులను ఇతరులను వేడుకొనబడుచున్నారు.

ఈ గ్రంథమునుబట్టి వీరిపూటస్థుడు కుమార రామానుజార్యుడు. ఈతడు సర్వశాస్త్ర విచారసంపన్నుడనియు, ద్రవిడవేదానుసంధానపరుడనియు గ్రంథము వలన తెలియుచున్నది. ద్రవిడవేద మనగ శ్రీనమ్మాళ్వారాదులచే రచింపబడి తిరువాయిమొళి అను పేర వ్యవహరింపబడుచు ద్రావిడవైష్ణవ దేవాలయములలోనను, వారి గృహారాధనలందును అనుసంధింపబడు ద్రవిడ ప్రబంధ గ్రంథమని తెలియుచున్నది. ఈ కుమార రామానుజుల కుమారుడు వెంకటకృష్ణమాహ్వయుడు. ఈతడు మహాభిమగ్యుడు. ఈతని కుమారుడు నల్లరామానుజాహ్వయుడు. ఈతడు గానవిద్యావిశారదుడు. ఈతని కుమారుడు తిరుప్పళ్లదేశికుడు. గొప్పవైణికుడు. ఈతని కుమారుడు రామానుజదేశికుడు. ఈయన ద్రావిడ నిగమాభ్యాసుడు. ఈతని భార్య నారాయణాంబ. ఈ దంపతులకు శ్రీనివాసులు, రంగయ్య అను నిద్దరు కుమారులు కలిగిరి. ఈ రంగయ్యయే ఈ రామోదయ కృతికర్త. వీరియింటి పేరుగాని, యూరిపేరుగాని యీ గ్రంథమున నెచటను కనుపడదు.

ఈ గ్రంథముయొక్క గద్యవలన ఈ కవి శృంగారసారసంగ్రహాది లక్షణగ్రంథములను ప్రహ్లాదచరిత యక్షగానము వ్రాసినటుల తెలియుచున్నది. ఇవి యచ్చున నున్నది లేనిది తెలియలేదు. కందపద్య శతకములు కొన్నియు, కీర్తనలు కొన్నియు రచించినటుల బాలకాండలోని పీఠికాభాగమువలన తెలియుచున్నది. ఈతడును సంగీతశాస్త్రమున గొప్ప నిపుణుడు.

పూర్వకవులలో నీతడు నన్నయభట్టును తిక్కన సోమయాజిని శంభుదాసుని పెద్దనామాత్యుని – పాండు రంగ మాహాత్మ్యకృతికర్తమాత్రము స్తుతించి యున్నాడు. వీరిలో నన్నయభట్టును "నవ్యాంధ్రఘట నార్య నన్నపార్య" అనియు, తిక్కనను "ఘనవచః కుండలీంద్రు" డనియు, శంభుదాసుని శమదమాది భాసు డనియు, పెద్దనామాత్యచంద్రుని మహితగుణ సాంద్రు డనియు, పాండురంగకవివర్యుని ప్రకటచాతుర్యుడనియు విశేషణములతో నుతించియున్నాడు.

ఈ గ్రంథము శ్రీపల్లికొండ రంగనాథుని కంకితము చేయబడియున్నది. ఈ కవి ఇతరరచనలుగూడ ఆ దేవునికే యర్పింపబడియున్నట్లు గ్రంథమువలన దెలియుచున్నది.

ఈపల్లికొండరంగనాథు డెచట వెలసిన దేవు డని కొంత విచికిత్స కవకాశము కలిగినది, గాని గ్రంథ పరిశోధనవలన నెల్లూరు రంగనాయకుల పేటలో పినాకినీ తీరమున వెలసియుండు రంగనాథుడు కాడని నిర్ణయింప నలవియగుచున్నది. ఈ దేవుని ఈ కవి ఉత్తర రంగ నాథు డని బాలకాండ ౨౪ సంఖ్యగల వచనమునందు వర్ణించియున్నాడు. విమర్శింపగ (పూర్వము చిత్తూరు జిల్లా) ఇపుడు నార్తార్కాడుజిల్లా గుడియాత్తము సమీపమున నుండు పల్లికొండయను గ్రామమున వెలసి యుండు దేవు డని బాలకాండ ౧౪-వ పద్యమువలన దెలియుచున్నది.

"ధరణిపై క్షీరవాహినీ దక్షిణమున
నొప్పు భీజాచలమునకు నుత్తరమున
సురుచిరంబగు శ్రీపల్లికొండ యనఁగ
వెలయు నగరంబు"

న నుండు శ్రీరంగనాథస్వామియని యం దున్నది.

క్షీరవాహిని యనునది పాలారు. ఈపల్లికొండ క్షేత్ర మీ పాలారునకు దక్షిణమున నున్నది. ఈ పద్యమున చెప్పఁబడియుండు భీజాచలము పల్లికొండకు సమీపమున నున్నది. నెల్లూరు రంగనాయకులవారికిని పల్లికొండ రంగనాయక స్వామియను వ్యవహార మున్నను పాలారును భీజాచలమును ఇచట లేవు కావున ఈ యుత్తరరంగనాథుడు పాలారుతీరమున వెలసి యుండు పల్లికొండనాథుడే యని యంగీకరింప వచ్చును.

ఇక ఈపల్లికొండ రంగనాథస్వామివారికి 'ఉత్తర రంగనాథు'డని విశేషణ మేల కలిగె నని విచారించిన నిట్లు తెలియుచున్నది. ఈపల్లికొండ రంగనాథక్షేత్ర మునకు ఆదిరంగ మనియు పేరు గలదట. దీనికి దక్షిణ మున తిరుప్పార్కడల్ అను మధ్యరంగ మున్న దనియు దానికిగూడ దక్షిణమున అంత్యరంగము సుప్రసిద్ధ శ్రీరంగక్షేత్ర మనియు డాక్టర్-మక్లీనుగారి గ్లాసరి వలన తెలియుచున్నది[1].

"పల్లికొండను" అరవమాటగ గ్రహించిన దీనికి "పండుకొనిన" అనునర్థ మగుచున్నది. పల్లికొండ రంగనాథుడు పండుకొనిన రంగనాథుడు. పల్లికొండకు ఇంకొక యర్థమును సాధ్యమగుచున్నది. 'పల్లె' వారు అను నొకజాతి కలదు. పల్లెవారికొండ యని కావచ్చును. ఇది కలవకొండ, కురుగొండ, చాకలకొండ ఇత్యాదులవంటి దగును. పల్లె కాపులు అను తెగ తెనుగువారిలోను గలదు. అరవవారిలోను గలదు.

పక్షితీర్థమునందువలె ఈ పల్లికొండ క్షేత్రమునను ప్రతిదినము రెండుపక్షులు మధ్యాహ్నకాలమునకు వచ్చి ప్రసాదము నారగించి పోవునట — ఇది దేవరహస్యమా లేక ఇవి పెంపుడుపక్షులా?

ఈ గ్రంథమునకు ఇంగిలీషున పీఠిక వ్రాసిన కీర్తిశేషులు విద్యావినోద రాయ్‌బహదర్ వనప్పాకం ఆనందాచార్యులు, బి. యల్., గారు తెలుగున గొప్ప విద్వాంసులు. వీరు నవద్వీపమునకు పోయియుండగ

---

1. ఈ ఆదిమధ్యాంతరంగముల కిచట ప్రసక్తి యవసరము గాకపోయినను విషయము తెలియగోరి విమర్శింప నిచ్ఛగలవారి కివియు దెలుపనగు ; ఏమన:- మైసూరురాజ్యములోని శివసముద్రమున కావేరితీరమున నాదిరంగ మనియు, మైసూరురాజ్యములోని శ్రీరంగపట్టణము మధ్యరంగమనియు — తిరుచనాపల్లిజిల్లాలో ఉభయకావేరి మధ్యగతమైనది యంత్యరంగ మనియు చెప్పుట కలదు. ఉభయపక్షములకు అంత్యరంగము శ్రీరంగమే. —

నచటి పండిత ప్రకాండులు వీరివిద్యాధికతకును నానా శాస్త్రగివయ పరిజ్ఞానమునకును మెచ్చుకొని వీరికి విద్యావినోదియను బిరుదము నిడిరట. అట్టివారీ గ్రంథమునుగూర్చి యిట్టుల వ్రాసియున్నారు.

"......I may safely predict for Ramodaya, the widest acceptance by all classes and grades of men and woman - down even to the borders of the unlettered-on the score of its easy and flowing style and of the unelaborated and sparing use in it of word beauty and flights and plays of fancy which are usual and which abound in many works, often to the detriment of perspicuity......"

వీరేశలింగముగారి కవిజీవితములలో నీకవిపేరు మృగ్యముగ నున్నది.

ఈ గ్రంథమున నుండునది రామకథ. రామకథకు ముఖ్యాధారము శ్రీమద్వాల్మీకి రామాయణము. రామాయణమునకు ఇతిహాసమనుకీర్తి ప్రసిద్ధముగ నుండగ ఈకవి యేలకో ఈ గ్రంథమును "శ్రీమద్రామోదయం బను మహాపురాణము" అని గద్యలో వ్రాసియున్నాడు. ఈతడు కేవలముగ వాల్మీకి రామాయణము ననుసరించి గ్రంథము నడిపియుండలేదు — నృసింహపురాణము విష్ణుపురాణము ఇత్యాదులలోని యంశములను గూడ చెప్పినాడు కాబోలు. కొన్నికొన్ని వర్ణనాభాగము లందు వాల్మీకిలో లేని యంశములు గలవు.

ఈ కవికాలము నిర్ణయించుటకు ఆధారము లగపడలేదు. చాల అర్వాచీన రచనయని తోచుచున్నది. కీర్తిశేషులు ఆనందాచార్యులవారి టీకలో నీతడు చిన్నయ్యసూరిసమకాలీనుడుగను ఆయన శిష్యగణము లోనివాడుగ నుండునని యూహించిరి. అటు లగునెడల గడచిన నూరుఏండ్లలోనివాడుగ నుండగలడు.

ఈ కావ్యమున వాల్మీకి రామాయణములోవలె ఆరుకాండము లున్నవి. మొదటి అయిదును కలసి యుద్ధకాండముకంటె చిన్నవిగ నున్నవి.—

| | | | |
|---|---|---|---|
| బాలకాండయందలి గద్యపద్యములు | | | ౫౮౦ |
| అయోధ్యా | ,, | ,, | ౪౦౮ |
| అరణ్య | ,, | ,, | ౩౯౧ |
| కిష్కింధా | ,, | ,, | ౨౭౮ |
| సుందర | ,, | ,, | ౨౭౬ |
| | | | ౧౯౩౩ |
| యుద్ధకాండ మాత్రము | | | ౨౩౨౭ |
| | | | ౪౨౬౦ |

గ్రంథము పెద్దదియే — చదువుటకు రమ్యముగ నుండును. సామాన్యముగ నందరికి అర్థమగును. జనప్రియ మయినదిగ నుండదగినది. వ్యాకరణవిరుద్ధము లగు ప్రయోగము లందం దున్నను మొత్తముమీద గ్రంథము మనోహరముగ నున్నది.

కవిరచనయు, శైలియు తెలియుటకై ఆయా కాండలలోనుండి కొన్ని పద్యము లీక్రింద జేర్పబడినవి.

బాలకాండము, ౨౯౮; గంగావతారఘట్టము.

అనూన మానికులాగ్రగణ్య వినుమేవంభోజ సంభూతుచే
నెయ్యంబొప్పగ నీవిశుద్ధచరనది న్నిక్కంబు గై
కొంటి నా
కుయ్యాలించి రసాతలంబునకుఁ గొంపోవఁగా
నమ్మిక
స్వర్యేలా శరణాగతుండ నను న న్వీక్షించి
రక్షింపవే.

బాలకాండము, ౫౩౨; సీతాకల్యాణ ఘట్టము.

జనకనృపాలుండు దనకూర్మికూఁతును
విమలచిత్తంబున విష్ణురూప
రామ లక్ష్మీస్వరూపా మిమాం కన్యాం ప్ర
తీచ్ఛ తుభ్యం ప్రదదే యటంచు
ధారపోసినయెడ సౌరదుందుభుల ధిం
ధిన్నినాదంబులు దేజరిల్లె
సురలును గుసుమంపు సోనలు గురియించి
రచ్చము లై దిశ లతిశయిల్లె
నపుడు పుణ్యాంగనాజనం బతిముదమున
ముత్తెపరితెండు లంబులు ముత్తియములు

శాతకుంభంపు భాజనజాలములను,
నించి కొనితెచ్చి యచ్చోట నిలుపుటయును.

అయోధ్యాకాండము, ౭౮; కైకమంధరలసంవాదఘట్టము.

అన విని పెనుగూర్కి డి మే
ల్కొను తెఱఁగున లేచి కైక గొబ్బున దనదా
సినిఁ గౌఁగిట నిడి ప్రియముగ
వినుతించుచుఁ దొడవు లొసఁగి వీడ్కొల్పి కశిక.

అరణ్యకాండము, ౧౭౯; శూర్పణఖ రాముని వర్ణించుట.

సరసిజపత్రనేత్రుని విశాలభుజస్కుని దీర్ఘబాహుని
స్మరసనిభాంగు శ్రీకరుఁ బ్రశాంతుని శీతకరాస్యుని న్మహీ
ధరసమధీరుని న్సుగుణధాముని రాముని గాంచి దైత్యసుం
దరి మదిమెచ్చి యిట్లనియె దర్పకసాయకపీడితాత్మయై.

కిష్కింధాకాండము, ౨౫; పంపావర్ణనము.

ఇది వనస్థలి యని యెంచి చూడఁగరాదు
ఝషకేతనాయుధశాలగాని
యివి మావిచిగురని యేర్పరింపఁగరాదు
కాముని వాఁడిఖడ్గములు గాని
పరికింప నివి పువ్వుపజ్జ లనఁగరాదు
కందర్ప బాణసంఘములు గాని
మోదించి యివి భృంగనాదంబు లనరాదు
రతిపతి చాపటంకృతులు గాని
యిందు ననుబోటి కామినీహీనునకు
డొప్పదెప్పుడుఁ దలపోయ నుగ్రమైన
కంతుశరవహ్ని యంతంతఁ గదిసి నాదు
విరహతాపాగ్నితోఁ గూడి వెలుఁగు నకట.

కిష్కింధ, ౨౫౧; సముద్రవర్ణన.

కని రభ్రంకషఘూర్ణమానభయకృత్కల్లోలమాలోత్పత
ద్ఘనవాతూలయుతాంబుబిందు హృతపద్మాకామినీ
నిత్యభే
లనజాయాపతిశేషమంచలతలాక్రాంతిస్థితో పేంద్రనుం
గనటన్నక్రతిమింగిలప్రముఖరేఖాసాంద్రముల్
సంద్రముల్.

సుందరకాండ, ౮౩; హనుమంతుడు సీతకు రాముని
యుంగరము జూపుట.

అమ్మ నీకూర్మిపతిని నిన్నలరఁగూర్పఁ
జాలుబంటను నామాట సత్యముగను
మది నెఱుంగు మిదియె రామమనుజవిభుని
యంగుళీయక మని చూప నతివ పలికె.

సుందరకాండ, ౧౦౭; సీతావాక్యము.

తనకులకాంత నొక్కరుఁడు
దాఁ గొనిపోవఁగ మారకుండు టెం
దును మగపాడి కా దధిక
దుర్బలమానవి యంటేఁ గాక
నామనమునఁ దావకాంఘ్రులఁ
గ్రమంబున నిల్పినదాన నందు నే
ననుటలు గాఁగ నీవు తగ
నారఘువీరున కేర్పరింపుమా.

యుద్ధకాండ, ౧౨౫; విభీషణశరణాగతి.

శరణాగతుఁడను నన్నుం
గరుణారసమింపొల్కఁ బల్కి కను వేగమునం
బరిపాలన మొనరింపుము
సరసీరుహమిత్రవంశజలనిధిచంద్రా.

రమ్ము విభీషణ నిను నా
తమ్మునిఁ గాఁ గాంటి నిపుడు దయ దయివాఱం
గా మెమ్మెసఁగెద లంకాపురి
సమ్మదజాలనునీఁ గ్రుంచి యరమర యేలా?

శ్రీరామ పట్టాభిషేక ఘట్టము. ౩౩౬౪

సద్భక్తి భరతుండు ఛత్రంబు చేఁబూని
యగ్రజానిపియుంచ నరుగుదేర
సరిగూడి లక్ష్మణ శత్రుఘ్నులుభయభా
గములను వెలిచామరములు వీవ
వందిబృందంబులు సందడిం జడియుచు
నుండఁగాఁ గైవారముల నొనర్ప
నిఖిలమంగళవాద్య నినదంబు లందందఁ
బొందికతో దిశల్ గ్రమ్ముకొనఁగ
సర్వప్రజనంబు లాశీర్వదింప
మహిమ దనరార నభిషేకమంటపంబు
చేర నరుదేర నలరి వసిష్ఠుఁ డెదుర
జనిచుఁ జేబట్టి తోడ్తెచ్చె సంభ్రమమున.

# అ ధు నా

శ్రీ బొడ్డపాటి కుటుంబరాయశర్మ

౧

అమృతంబుకోసమై,
అంబోధి మథియింప
హాలాహలము పుట్టె
నయ్యయ్యో!
హాలాహలము కంఠ
మూలాన పదిలించు
శూలాయుధుడ వీవు
కాలేవో!

౨

అగ్నికీలల మధ్య
అజగరంబులమధ్య
అమృతకలశము చిక్కె
నయ్యయ్యో!
అగ్నికీల లడంప
అజగరంబుల ద్రుంప
కాలమేఘుడ వీవు
కాలేవో!
భాగవల్లభుఁడ వీవు
కాలేవో!

3

జగదుపశ్లోకితం
బగ, నగస్త్యమహర్షి
ప్రియమైన కాశికా
విప్రయోగము బొందె
నయ్యయ్యో!
విప్రయోగ ప్రభూ
తప్రభావమ్ముచే
నిగళనవ్రత తప
శ్చరణ ప్రవీణుడై
లోపాసతీపతివి
కాలేవో!
లోకమోహనదాసు
కాలేవో!

—

—'మధుకణములు'నుండి.

# బస్తీ రోడ్డు

శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు

"రోడ్డు" అనేది తెలుగువాళ్లు అప్రయత్నంగా వాడే ఇంగ్లీషుమాటల్లో ఒకటి. ఇంగ్లీషువారు మనకి పబ్లిగ్గా తెచ్చిపడేసిన పదార్థాల్లో రోడ్డుకుడా ఉంది. సాధారణంగా శకటాలు కూడా వెళ్లడానికి వీలుండి, రాగుమీరి ఉన్నప్పుడు మాత్రమే, ఏదేనా మార్గాన్ని రోడ్డు అంటారు. రోడ్డును గురించిన పుస్తకాలు తెలుగులో లేవు. ('నాకు తెలియదు అనేకబురు చల్లగా చెప్పడానికి 'లేవు' అనేది అలంకారికం.) రోడ్డులాంటి అధమ విషయంగురించి రాస్తే, కావ్యంకూడా నీచం అయిపోవచ్చుగదా అనే భీతిచొప్పున సమర్థులు దాన్ని వొదిలేసి ఉంటారు. కాని, ఆసంగతి తెలియకపోడంవల్ల గావును, అన్యభాషల్లోవాళ్లు రోడ్డుని గురించి వందలాదిగా పుస్తకాలు ప్రచురించారు. మానవోపయోగకరంగా ఉండే వృత్తాంతాలు ఎవైనాసరే గ్రంథస్థం అయినప్పుడు పండితులు దుర్ముహూర్తంలేకుండా చూసుగుని క్షమించి పారెయ్యడం మంచిది. నేలబారురచన మాత్రం చెయ్యగల అస్మదాదులకి 'రోడ్డు' సరిపడ్డ విషయం. ఏమంటే, ఇందులో నేల విడిచి సాం అవసరం లేదు. చాలా పూర్వకాలంలోనే మనుష్యులు నడవడానికీ, గుఱ్ఱపుదళాలు వెళ్లడానికీకూడా, అనేకదేశాల్లో శాశ్వత మార్గాలు ఉండి ఉన్నట్టు తెలిసినా, రోడ్డు అనేమాటపుట్టి ఆట్టేకాలం కాలేదు. ౧౭౩౬లో పార్లమెంటుసభకి ఓ ప్రభువు తనబండి మీద వెడుతూండగా. అప్పటి లండన్ బురదవీథుల్లో ఒకచోట ఉన్న ఊబిలో ఆయన బండీ యూవత్తూ దిగబడి ఊరుకుందట. ఈ రెండువందల ఏళ్లలోనూ, ఇతరదేశాల్లో జనం రోడ్లనిగురించి చేసిన ఆలోచనా. చూపెట్టిన ఆచరణా, సాధించిన అభివృద్ధీ మనికి తెలుస్తూన్నప్పుడు, అందరూ రోడ్డుని గురించి దుమ్మురేగేటట్టు ప్రచారంచేసుగుని కాంగ్రెసులు కూడా జరుపుతూన్నప్పుడు, రోడ్డు అనేవిషయాన్ని మనం కొట్టిపారెయ్యడానికి వీల్లేదు— అసలు అనుక్షణం కాళ్లకి చుట్టుగుని ఉండే విషయాన్ని పారెయ్యడం శక్యమూ కాదు, శౌర్యమూ కాదు. మరొక సంగతి. మానవులు కలిసిగాని జీవించలేరు. ఒంటరిగా జీవించగలవాళ్లు ఉండవచ్చు, ఉన్నారు, వాళ్లు మానవాతీతులు. పెద్ద స్థలంలో కొద్దిమందిమాత్రం కలిసి పల్చపల్చగా ఉండేలాగు నివాసం అయిఉంటే దాన్ని గ్రామం అనీన్నీ, కొద్దిస్థలంలో చాలామంది కలిసి ఒత్తిడిగా నివసిస్తే దాన్ని బస్తీ అనీన్నీ అంటారు. ఒక దేశంలో ఈ చివరనుంచి ఆచివరకి ఉండే ప్రతిచిన్నస్థలంకూడా కామధేనువులాంటిదైతే, ఆ దేశంలో ఉండుకున్న గ్రామాల సంఖ్యే ఎక్కువగాఉంటుంది, ఇంకా గ్రామాలు పుడుతూంటాయి. కాని, ఏదేనా దేశంలో చవిటిపర్రలు, ఉప్పుచెరువులూ, ఇసకఎడార్లూ, బోడికొండలూ, గనక విస్తారంగా ఉంటే, జనం ఎక్కడబడితే అక్కడ నివసించడం

అసంభవం అయి, కొత్తగ్రామాలు పుట్ట
డానికి ఆస్కారం లేక, ఉన్నగ్రామాలే బస్తీ
లుగా మారడానికి యత్నిస్తాయి. ఈ దేశం,
వైశాల్యం ధర్మమాఅని, ఏ రకంలోనేనాసరే
చేరుతుంది. ఇక్కడ లేనిరకం ఉండదు. విస్తా
రం గ్రామాలూ ఉన్నాయి, కొత్తవి పుడు
తూనూ ఉన్నాయి, కొన్ని బస్తీలుగానూ
మారుతూన్నాయి. స్థూలంగా చెప్పాలంటే,
జనాభా ఒక పాతికవేలకి దగ్గిరపడినా, లేక
ఎంత వంకరటింకర దైనాసరే ఒక కంకర
రోడ్డు దాంట్లోకి చొరబడినా, గ్రామంఅనేది
బస్తీగా ముదురుతుంది. ఒక బస్తీనించి ఇంకో
బస్తీ చేరుకోడానికికూడా ఘంటాపథాలు
ఉంటాయి. ప్రస్తుతం వాటిసంగతి కాదు. ఒకే
బస్తీలో ఉండేజనం, తను తమ వ్యవహారం
సందర్భాలు చూసుకోవలిసిన అవసరం వచ్చి
నప్పుడు ఒకగృహందగ్గిర్నించి మరో గృ
హానికి వెళ్లాలి. ఈరీతిగా ఘోషాజనం తప్ప
కడం అందరూ వెడుతూంటారు. అందుచేత,
ఇళ్లమధ్య వీలైనంత ఖాళీస్థలం అశేషజనం
ఉమ్మడిగా వాడుకోడానికి కేటాయించి ఉం
టుంది. అటువంటిబస్తీ వీథిరోడ్ల సంగతి కొం
చెం ముచ్చటించడమే ఇప్పుడు సంకల్పం.

రోడ్డు అనేపదార్థం మాయిమంత్రంవల్ల
చిటికెలో తయారయే బాపతు కాదు. దానికి
కప్పకున్నన్ని రూపాంతరా లున్నాయి.
వాటిని జన్మాంతరా లన్నా ప్రత్యవాయవు
లేదు. అసలు దుర్గమస్థలంలో మొట్టమొదట
కాలు పెట్టేవాడు సాహసు డయి ఉంటాడు.
వాడి ఉద్దేశం వాడికే తెలిసి ఉంటుంది.
ఒక్కొక్కప్పుడు వాడికీ మొదట తెలియదు.
వాడు ఎక్కడికో పోతాడు, ఏదో వోటి అవు
తాడు, గాని వాడిఛాయమాత్రం మిగిలి
ఉంటుంది. వాడి ఉద్దేశం ఏమిటో, వా డేమ
యాడో కనుక్కోడానికి వాడి అడుగుజా
డల్లో వెళ్లేవాళ్లు ఉంటారు, లేకపోతే క్రమేపీ
పుడతారు. వాళ్లు మొదటివాడి దారివల్ల
ప్రపంచానికి అవసరం ఉంటే ఆదారి ఖాయ
పరుస్తారు. గమ్యం ఫలానా అని ప్రత్యక్ష
సాక్ష్యం దొరికినమీదటే జనబాహుళ్యం
ఆదారి పడతారు. మరికొంతకాలానికి ఆదారి
రహదారీ అవుతుంది. దాన్ని ఎత్తుచేస్తారు.
దానివెడల్పు స్థిరం చేస్తారు. దాన్ని అడ్డేవస్తు
వుల్ని తీసేస్తారు, పళ్లని దాటేస్తారు. ఆదారిని
గట్టిపరిచి నునుపుచేస్తారు. రంగుగా ఉండి
ఆదారి మానవుల్ని జంతువుల్ని శకటాల్ని
కూడా ఆకర్షిస్తుంది. ఆరూపందాల్చిన దార్ని
"రో" డ్డంటారు. పల్లెటిదిక్కుల్లో ఉండేదార్లు
ఇన్ని రూపవికారాలూ దాల్చేసరికి పుష్క
రాలు ఎగిరిపోతాయి. బస్తీలో అయితే ఒక
ప్పుడు సంవత్సరాలుమాత్రం జరిగిపోతాయి.
బస్తీలోకూడా ఇళ్ల వరసల మధ్య ఉండే
స్థలం ప్రథమంలో దాని చిత్తంవచ్చినట్టే ఉం
టుంది. ఎటొచ్చీ వేసంకాలంలో మేకుల్లాగ
మొనలు తేరిన బెడ్డల్తో ఉంటుంది, వానాకా
లం చిన్న పంటకాలవలా ఉంటుంది. పిల్లలూ
పెద్దలూ ఊటలూరగా ఊరగా, అది చదునై,
మట్టిపడి, లేస్తుంది. అదే కంకరవీథి అయి,
దానిరేఖ బయలుపడాలీ అంటే, అది ఇంతో
అంతో పెట్టిపుట్టింది అయిఉండాలి; అనగా,
ఆవీథులో కాపరంఉండే ప్రతిద్విపదుడూ
మామూలు మనిషై ఊరుకోక, చివరకి
ఏఒకడేనా బస్తీపాలకసంఘంలో ఒకసభ్యు
డై ఉండాలి. రోడ్డులేనప్పుడు అతనికి ఉండే
చికాకు మర్త్యుల్లో ఎవరికీ ఉండకూడదుట.
లేకపోతే, అక్కడ కాపరం ఉన్నవాళ్లల్లో

ఒకడైనా ప్రభుత్వంవారి పరిచయుడైనా కావాలి, లేక ధనవంతుడైనా కావాలి, నిలువుగా చీరేవాడో, అడ్డంగా బాదేవాడో, లేక తెగతిట్టేవాడో, తెగ ఆశ్రయించేవాడో కావాలి. అదీ కాకపోతే, ఒక గవర్నరుగాని అతనిలాంటి గొప్పమనిషిగాని ఆ వీథివెంట వెళతాడని తెలియాలి. ఆయన ఇక రేపో మెల్లుండో ఆదార్ని వెళతాట్ట అని తెలియడంతోటే, అతని మహిమవల్ల, రామపాద ధూళి తగిలింతరవాత రాయి మనిషైనట్టు ఆయనపాదం చెప్పులో ఉండడంనించి తత్పద ధూళికైనా నోచుకోనైతినిగదా అనిచెప్పేసి ఆదారి రాయిలా అయిపోతుంది. అది అట్లా అయిపోయేటప్పుడు ఇంతోటి విద్యార్థ్యాని కేనీ ఇస్త్రీబట్టలు కట్టిన కుల్లుజనంలాగ వెల్ల వేసుకున్న మురుగుతూములు తెలతెల్లపోతూ చూస్తూంటాయి. అదే అదను, మళ్లీ దొరకదు, అని కొన్నిదార్లు అప్పుడు కంకర కూడా అవుతాయి. పురపాలక సంఘంలో అందరూ కంకరవక పోవడంవల్ల, కొన్నిదార్లు ఎన్నటికీ కంకరవనే అవవు. ఒక్కొక్కప్పుడు కంకర వగైరా తెచ్చి, నడవడానికికూడా వీలు లేకుండా ఎడాపెడా పొయ్యడం సమేతూ జరిగిపోతోంది. అప్పు డొస్తుంది ఎగేసుకుని! ఆవీథులో ఉన్నస్థలం స్థలంలాపడి ఉండచ్చా, పైవార్ని ఎదో పేచీ పెడుతుంది గావును. దాంతోటి వారికి తలోమోస్తరుగానూ ఆనేల మీద కోపం వచ్చి, ఆ కంకర్ని ఉన్నపళంగా వొదిలేస్తారు. అయితేం! ఉన్నపళంగా ఏదీ ఉండదు, కంకరా ఉండదు. కోతుల్ని కొట్టడానికీ, కాయలూ పళ్లూ రాలగొట్టుకోడానికీ, పిల్లలు వాట్ని వాడేస్తారు. ఒక్కొక్కప్పుడు అవెట్టి వీథికీపాల అద్దాలు బద్దలు కొట్టి మునిసిపల్ వారిపనే చూస్తారు. పెద్దలు కూడా కాస్త చీకటడి, మాటు మణిగింతరవాత, కాసినికాసిని చొప్పునే ఆరాళ్లని సెనగపప్పులా లగాయించేసి, అవీనూ, డబ్బెట్టికొనుక్కున్న యజమానియింటికి ఇటికెలు తోలుకెడుతూన్న బండివాడు దయతో దానం చేసిన యిటికెలూ పెట్టి నిర్మాణ కార్యక్రమం సాగిస్తారు. అల్లా ఆరాళ్లన్నీ మాయం అయినా సరే ఒకొక్కవీథిలో నేలకి పాలకసంఘం అంటే భయం లేదు, జనం అంటే జాలి లేదు. ఇంకోసంగతి. ఈకాలంలో జనం తిన్నగా తిండేనా తిన్లేరనిన్నీ, వెనకటివాళ్లు రాళ్లుకూడా తిని హరాయించుకునేవా రనిన్నీ కొందరు ముసిలాళ్లు కోస్తూంటారు. కాని ఇప్పుడుకూడా కంకర రాళ్లయొక్క విలువ తినేసేరోడ్లు నిర్మాత లున్నారని వాళ్లతో వాదించి చెప్పి, ముసిలాళ్లని పిన్నలు నెగ్గచ్చు. ఏమైతేం, కొన్ని అవస్థాభేదాలు పొంది దెబ్బలు, పోట్లు, నరుకులు, అణుపులు, నొక్కులు, తిట్లు వగైరా తిని తిని, చివరకి బస్తీరోడ్డు అవతరిస్తుంది. సాధారణంగా ముందు తవ్వి, మరీ పెద్ద గోతు లుంటే వాటిల్లో పెద్ద రామెట్టి, చిన్నసైజు కోనురాయి సర్ది, ఎర్రకంకరో తెల్లకంకరో చిమ్మి, ఇసగపోసి, నీళ్లు చల్లి చేసే పద్ధతి అవలంబిస్తారు. (మహాబస్తీల విషయంలో, వాటి హోదానిబట్టి పలకరాతివీ, సిమెంటువీ, తారువీ, కర్రవీ రోడ్లు వెలుస్తాయి. వాటి ప్రమేయంకా దిప్పుడు.) రోజు గడవనివాళ్లూ, జీవితం నడవనివాళ్లూ వచ్చి, తక్కిన ప్రపంచం నడిచిపోయే నిమిత్తం చెమటతో రోడ్లు వేస్తారు. కాని, ఎంతెంతటి శ్రమలుపడి వీటిని సృష్టిచేసినా,

వీటిల్లో వీటికి బొత్తిగా జాత్యభిమానం లేదు, సోదరభావం లేదు. వీట్లయొక్క రకాలకి హద్దు లేదు. చాలా రకాలు మా ఊళ్లోనే దొరుకుతాయని ప్రతీఊరూ ప్రతీవాడూ విర్రవీగడమే, ఎవడిమాట నిజమో తేలకుండా. కొన్ని కేవలం గజం పన్నా రోడ్లు. తెలుగు లిపిలో తలకట్లు మూలబడడంచేత గజం అంటే ఏనుగు అనుకోగల్రు. కాని ఇక్కడి అభిప్రాయం "గజం" అనగా మూడడుగులు నేల — అయినా మళ్లీ వామనుడు కోరినంత సైజది కాదు! కొన్నిరోడ్లు మనిషి పన్నా — ఆ మనిషేనా భారీరకం అయితే పీతనడక నడిస్తేగాని అతనికి జరుగుబాటుండదు. కొన్నింటికి వక్రభావమేకాని ముక్కుకి సూటిగా పోదామని లేనేలేదు. ఈ సంగతే దొరకపుచ్చుగుని, చుట్టుపక్కల దొరకగల వక్రత్వం యావత్తూ తమ ఊరిరోడ్లే గుత్తకి తీసుగున్నాయనిన్నీ, అందులో మరేమీ వాటా మిగలకపోడాన్నించి తమ ఊరి జనం అశేషం ఋజుమార్గవర్తులయి తీరవలిసొచ్చిందనిన్నీ, ఒకొక్క బస్తీ కవి బడాయికొడుతూంటాడు. నాగరికత ఎరగని రోజులుగనక పూర్వం 'సూత్రపట్టినట్టు' ఒక బస్తీవీధులు ఉండేవిట! ఇతర బస్తీలల్లో రోడ్లు దిక్కుమాలిన రోడ్లనిన్నీ తన ఊళ్లోవి దిక్కున్నవనిన్నీ ఒక నగరప్రియుడు ఒకచోట ఒక పేచీ లేవదీశాడు. ఎంచేత అని అడిగేసరికి, 'దక్షిణముకుమాత్రము బండ్లు పోవాలి' 'పడమరకుమాత్రము జంతువులు కదలాలి' అని దిక్కు తెలుపుతూండే రోడ్లు తన ఊళ్లోగాని లేవని అతడు సమర్థించి నెగ్గుకుపోయాడు. కొందరు మనుష్యులకిమల్లే కాకుండా, కొన్నిరోడ్లు ఉచ్చనీచాలు గల ఘటాలు. అందుకని వాట్లమీదికి ఏదేనా బండీ వచ్చినప్పుడు, ఆరోడ్లు ఆంబోతుల్లాగ కోరచూపులు చూసి ఒడుపు కనిపెట్టి, ఆబండీని బోల్తాకొట్టిస్తాయి. ఒకవేళ ఏమరుపాటుగా నడుస్తూండే మనుష్యులు గనక వచ్చారా, వాళ్ల కాళ్లూ చేతులూ అథమం నడుమూ విరిచేస్తాయి. కొన్ని మరీ నిర్మొహమాటపు రోడ్లు మరీ హెచ్చుతగ్గుగా వ్యవహరించడంవల్ల ఒళ్లల్లో జనం కొయ్యయిపోతూంటారు. 'అచేతనంబులు చేతనరీతి దనర, చేతనంబు లచేతన భాతి నొనర' వీణవాయింపు ఉన్నదని, ఒక కవి అన్నాడు. నేడుకూడా చాలా పాటకచేరీలూ, కొన్నిరోడ్లమీద ప్రయాణాలూ అంతటివీ ఉన్నాయని మనం గర్వపడవచ్చును. కొన్నిరోడ్లుగల వీధుల్లో కాపరంచేస్తే, ఎండాకాల వానకాలాల తేడాలు తెలియకుండా పోతాయనిన్నీ, రోడ్లే కాలవలుగా మారడంచేత, 'ఓడలు బండ్లవచ్చు బండ్లోడల వచ్చు' అనే మాటల్లో ఉండే సంశయత్వం పోతుందనిన్నీ కొందరన్నారు. కొన్నిరోడ్ల మీద, మధ్యగా, మురుగు పోయేనిమిత్తం, ఒక్కగాడి ఉంటుంది, రోడ్డుదేవిగారి పాపిడి కాదుగదా అన్నట్టుగా. మండు వేసవిలో కూడా రోడ్డు మధ్యగా ప్రవహించే శక్తిగల మురుగుకాలవల్ని ధరించిన రోడ్లున్నాయి. వీటిని చూసినప్పుడు, పర్వతాల్లో పుట్టి మంచు కరగడంవల్ల వేసవిలో ఎక్కువ నీటితో ప్రవహించేనదులు జ్ఞాపకంవస్తాయి. ఎటొచ్చీ, వీటిలో నీరు ఘనీభవించినకుళ్లుతో సమపాళంగా మిళితమై నల్లగా ఉండి 'కృష్ణ'స్మరణ చెయిస్తుంది. ఒకొక్క బస్తీలో అధికార్లు ఈ నలుపురంగులోనే కాకుండా అసలైన కంపులోకూడా అద్వితీయమై ఒప్పేటటువంటి కొన్నికొన్ని సైజు కాలవలకి విహారాది విష

యాల్లో సక్రమమైన ట్రైనింగు ఇచ్చి, వాటిల్లోఉండే నీటిమహాత్యం అనుభవించక పోడంచేత పౌరులు చెడిపోతారేమో అనే బెంగ చొప్పున, అవి మరోచోటికి మరో చోటికి తమ యిష్టంవచ్చినట్టు లేచి పోకుండా, తమ ఆజ్ఞానుసారం, చేరువ నున్న మంచినీటి కాలవల్లో కలిసేలాగ చేసి, జనం శ్రమించి అట్టే దూరాభారం వెళ్లక్కర్లే కుండానే ఆ 'గంగాయమునా సంగమపుణ్య దర్శనఫలం' జనానికి పన్ను లేకుండానే మంజూరుచేసి, ఆజనం అల్లాంటి పుణ్యాన్ని పొంది జీవన్ముక్తులవడానికి నానాతిప్పలూ పడుతూంటారు. కొన్నిరోడ్లు తమాషాగా కనిపించి, కొత్తవాణ్ణి బెదిరిస్తాయి. దాంతోటి ఆకొత్త వాడు అనుమానిస్తూ నడుస్తాడు. అవి వాణ్ణి తిప్పి తిప్పి చివరకి ఎవరియింట్లోకేనా లాక్కుపోతాయో, లేక వీధులో పడేస్తాయో వాడికి తెలియదు.

బస్తీరోడ్డుయొక్క ప్రత్యేక విశేషం అయిన దుమ్ము గురించినది పెద్దఘట్టం. దుమ్ము నిరంతరంగా బస్తీలో విజృంభిస్తూ ఉంటుంది. బస్తీపాలకులు దాంతో యుద్ధంచేస్తూంటారు. వారు ఇతరవిషయం ఏదేనా సరే దుమ్ము రేగకొట్టగలరుగాని విషయమే దుమ్మై అదే రేగిపోయే దయినప్పుడు, ఏమీ చెయ్య లేకపోతూంటారు. అసలు దుమ్ము లేకుండా చేస్తే సరి, ఇహ నెల్లా రేగుతుంది దాని మొహం! అని, కొందరు సలహా ఇస్తారు. అందుకని, కొన్ని చోట్ల బస్తీరోడ్లు ఇళ్లూ వాకిళ్లూ తుడిచినట్టుగానే చీపుళ్లతో గంటలో తుడిచేస్తారు. దానిఫలితం ఏమిటా అంటే, ఇరవైనాలుగు గంటల్లో చుట్టుపక్కలగృహావృక్షాదులమీద మలామా చెయించినట్టు సర్దుకు నేదుమ్ము ఒకగంటలోనే గబగబా సర్దుకుంటుంది. ఈపద్ధతిలో పథికులకి కంటె సమీప గృహస్థులకే ఎక్కువవాటా దుమ్ము కిట్టుతుంది. కొన్నిచోట్ల రోడ్లు కూలీలచేతా, కొన్నిచోట్ల కార్లచేతా, తడిపిస్తారు. మొదటి పద్ధతి చాలామంది బీదవాళ్లకి పని చెబుతుంది గనక, అంతమందికి జలక్రీడోద్యోగం ఇవ్వడం ఏమిటని చాలాబస్తీల్లో అది మానేశారు. ఒక్క యంత్రప్రభావంవల్ల వెయ్యిమంది పనివాళ్లు మూలపడతారు. అంచేత గావును బస్తీలో నీళ్ల కారు! దానికి చెయ్యబడిఉండే ఏర్పాటు మూలాన్ని బొతు ఖానాలోంచిలాగ నీరు ఇటూ అటూ చటుక్కున చిమ్మచ్చు, చటుక్కున ఆపచ్చు. ఆ అధికారం సాధారణంగా డ్రైవరు చేతులో ఉంటుంది. కాని, ఆయంత్రం అతిజ్ఞోకుడా దగాచేసి, తన ఖులాసాచొప్పున పోతూండడంకూడా కద్దు. డ్రైవరు ఉద్యోగానికి కారకులైనవారెవరైనా పక్కనించి పోతూంటే, అది చటుక్కున ఆగిపోతుంది. కాని, ఇతరబస్తీజనులుగాని, ఇతర గ్రామస్థులు గాని, స్త్రీలుగాని అయితే, పెద్ద-పిన్న మునలి-పడుచు తారతమ్యం గమనించకుండా నీరు చిమ్మేస్తుంది. అందుకని, ఏకొద్దిమందో తప్ప తక్కినవారు నీటి కారు ఎప్పుడు తననీటిముళ్లు విప్పుతుందో- ఏనుబందిలాగ- అని భయం చొప్పున దూరాన్నించే జాగ్రత్త పడతారు. రోడ్లు తడపడం దుమ్ముని అణచడానికి. అప్పట్లో ఆపని నెరవేరినట్లు కనిపిస్తుంది. కాని, తడిపిన దుమ్ముమీద శకటాదులు వెళ్లడంవల్ల తెగనలిగి వస్త్రకాళితం చేసినట్టు మరీ కాటికలా అయి, ఎండొచ్చి తడి యిగిరింతర వాత, పూర్వం తాడిప్రమాణాన్ని లేచేది, ఆ సాయంత్రానికి తాటిజువ్వలా లేచి, తల

పెట్టిన ఉద్దేశానికి విరుద్ధం ఫలించేటట్టు చేస్తుంది. ఇదిగాక, అలవాటుగా నీళ్లు పోసే సరికి, రోడ్డుమీది మెరకపల్లాలు ఖాయపడి, సంవత్సరంలో బయల్దేరే కతకలు నెలలోనే సిద్ధిస్తాయి. అయినాసరే, ఒప్పుగోడానికి, ఈ భాగ్యం అన్నింటికీ అబ్బదు.

కొన్ని బస్తీలలో వానకాలం గంభీరంగా ఉంటుంది. ఇళ్లు ద్వీపాలు: రోడ్లు కాలవలు: మనుష్యులు పడవలు. కొన్ని రోడ్లమీది మెత్తటిసరుకు యావత్తూపోయి, శల్యాల లాంటి కోనురాళ్లుమాత్రం అరితేరి పాడి చేలాగ చూస్తూ ఉంటాయి. సైడు కాలువలు, పరాయిగా పరాయిగా కొట్టుగొచ్చిన మట్టితో పూడి, బలిసి, రోడ్డుతో తుల్యం అవుతాయి. అట్లాంటప్పుడు ఎక్కడ నడిచినా జనానికి బాధలేదు. కొంతదూరాన్ని మోటారమ్మోవారు దర్శనం ఇవ్వగానే, జనం ఎక్కడివాళ్లక్కడ సర్దుకుంటూ, దుష్టుడుకి దూరంగా ఉండమన్నాడు అనుకుంటూ ఎవరిజాగ్రత్త మీద వాళ్లుంటారు. మోటార్ల వేగాన్ని తిట్టేవారు, గొడుగులు అడ్డుగా ఒగ్గేవారు, అరుగులమీది కెక్కి ఖణాయించేవారు, కట్టుగొచ్చిన చాకింటిడ్రెస్సు వసంతం కొట్టినట్టు కాగా, 'వెధవపొగరు! కళ్లు కనిపించవ్!' అని తిట్టుగుంటూ డ్రెస్సుకేసి చూసి దుఃఖించేవారు,— ఇలా రకరకాలగా ఉంటారు. జారడం, దుస్తులకీ కాళ్లకీ డామేజీ తెచ్చుగోడంకూడా మామూలుదృశ్యాలే. కొంచెం శేగడమట్టిపాలు ఎక్కువగాఉన్న రోడ్డుమీద నడిచేటప్పుడు జ్రుర బాములు వేళ్లసందుల్నించి ఈటెల్లాగ లేచి కంట్లో పడుతూండడం కూడా కద్దు. మామూలు చెప్పులవాళ్లకేం గాని, అకు చెప్పులవాళ్లకి నీలమండలగాయతు నడ్డిదాకా వెనక వేపున రోడ్డుబురద చిలకరింపు సంక్రమిస్తుంది. కేవలం స్లిప్పర్లు తొడుక్కొని తప్పు తప్పున నడిచేవాళ్లకి, బాడిచిందులు బాగా చిమ్ముబుడ్డి రవ్వల్లాగ లేచి నెత్తిదాకా వ్యాపించి యజమానికితప్ప తక్కిన అందరికీ కనిపిస్తూంటాయి. కొన్ని రోడ్లమీది మెత్తకంకర, కాటికలాంటి అడుసులా తయారై, జనంకాళ్లకి పట్టుగోడంలో, బస్తీలో ఉండే స్త్రీపురుషాదులు బస్తీపారాణి రాయించుగుని (పిలవని!) పేరంటానికి వెడుతూన్నట్టు తెలుస్తుంది. ఒక్కొక్కచోట, ఇంట్లోంచి ఇవతలకీ, ఇవతలనించి ఇంట్లోకీ వెళ్లి పడడం అనేది క్రతువులాంటిపని అయిపోతూండడంచేత, అక్కడి యజమానులు తప్పనిసరి అయినప్పుడుతప్ప కొంపలోనే పడుండి, యథాశక్తి దేశాభిమానం అని చెప్పదగిన గృహాభిమానం నేర్చుగుంటూంటారు.

బస్తీరోడ్లవల్ల ప్రయోజనాలు ఒక్కమాటు చూసి పట్టెయ్యచ్చు. రాత్రిభాగంలో కొందరు వయస్సొచ్చిన స్త్రీ పురుషులు తమ యింటి ఎదరదికాని రోడ్డుని బాహ్యానికి ఉపయోగించి, అపని నెరవేర్చి రావడంలో తమకు ప్రకటించగలిగిన ధైర్యసాహసాలకీ తెలివితేటలకీ అభినందించుకునేవాళ్లూ, తమయింట్లో ఉండే జనంచేత మన్ననలూ స్తోత్రాలూ పొందేవాళ్లూ ఉన్నారు. కొందరికి ఇంటి ఎదటిరోడ్డే తమకున్న ఖాళీస్థలం అవడంచేత స్నానాలూ తలంట్లూ రోడ్డుమీదే. భోజనాలకి, కజ్జాలకి, పురుళ్లకి, పుణ్యాలకి, ఓకేమిటి సమస్తానికీ కొందరిపట్ల రోడ్డే ఆధారం. ఎండపెట్టుగోడాలన్నీ రోడ్డుమీదే. కొందరు పశువుల్ని పెం

చడం, కట్టేయ్యడం - అంతా రోడ్డుమీదే. కొందరు తమయింటి ఎదటిరోడ్డుమీద తమ హక్కుస్థాపించుగోడానికే తమరురోడ్డుమీద కలాపుచల్లి ముగ్గెట్టడం. ఇతరులెవరూ దొంగతనంగానేనా పట్టిగెళ్లకుండా అనేధైర్యం గలిగించేవస్తువులన్నీ కొందరు రోడ్డుమీదే దాచుగోడం. కొన్నిరోడ్లమీద రాత్రెళ్లు ఎడాపెడా పడే వేసంకాలపు మంచాలమధ్య సుక్క లుండి, దారెంట వెళ్లవలిసినవాడు కాలెట్టడానికి అవకాశం ఉండదు. చాలా బస్తీరోడ్లమీద ఇటీవల బయల్దేరిన సోడాకొట్ల వల్ల దారి మూసుగుపోతోంది — మాసినతల కాయిలాగ. ఈకొట్లు దేవదారువీ, కర్రవీ, క్రమేపీ ఇనపవీ కూడా అవుతున్నాయి. రోడ్డు ఎంత యిరుకుదైనా సరే, రథంలాంటి సోడాకొట్టు, పాలకసంఘానికి ఫీజు కట్టేసి, అక్కడే తనూ ఇరుకుతుంది. ఒకటి పుట్టేసరికి దినదినాభివృద్ధిగా పిల్లల్ని పెడుతుంది. వీటిల్లో వంటకీ, భోజనానికీ, పడకకీ, విశ్రాంతికీ—అంతస్తులూ, బిలాలూ రహస్యమార్గాలూ అవన్నీ దుర్గానికి ఉన్నట్టు ఉంటాయి. వీటికి కింద చక్రాలు పెట్టిస్తున్నారు కొందరు, కొండలకి రెక్కలు పురమాయించినట్టు. ఈ దెబ్బతో బస్తీకి రథాలులేని అపకీర్తి పోయేట్టు కనిపిస్తుంది.

. . .

అయితే, రోడ్డుగురించి ప్రథమసూత్రం ఏమీ అంటే, గమనంగలిగిన జంతువులే కాకుండా చలనంగలిగిన పదార్థాలుకూడా రోడ్డుని వాడుకోడానికి హక్కుగలవే, అని. కాని, ఎవరైనా సరే, వీలైనంత త్వరలో వాడుకుని ఇతరుల వాడకానికి దానిని వదిలేస్తూండాలి. అందుకనే, ఎంత తక్కువ కాలంలో దానిని వాడుకుని వదిలెయ్యగలవాడైతే, అంత పెందరాళే అది వాడుకోడానికి వాడికి మొదటిహక్కు ఏర్పడుతుంది. ఆ మొదటిహక్కులో ఉండేవయినం గమనించి పేచీలు రాకుండా గమనాలు నడిపించడంనిమిత్తమే కూడలివీధులదగ్గిరా, మలుపులదగ్గిరా, పోలీసుసోదరులు ఖణాయించి, చేతులు— (అవి మీసాలు సర్దుకోడం లాంటి ఇతరపన్లో లేనప్పుడు)— తిప్పుతూండడం. ఈహక్కు పుణ్యమాఅనే, ప్రపంచపు గొప్ప బస్తీలలో ప్రమాదాలు జరిగి రోజుకి సగటున నలుగురు మొదలు పదిమందిదాకా మనుష్యులు ఖర్చుపడుతూ ఉండడం. పోసి, హక్కుమాట సరేగాని, మరి బాధ్యత ఎవరిదీ ? అంటే, ఆమాట అంటేనే చాలమందికి కోపం! పైగా అది వేరే సంగతి!!

# పార్థస్మృతి

శ్రీ కందుకూరి రామభద్రరావు

ప్రాగ్గిరికూటపు
ప్రభాత కాంతుల
పార్థుడు పట్టే కాహాళు లవిగో
వినబడలేదా! వినబడలేదా!

కన్నులు తెరచే
కమలదళమ్ముల
పార్థుని పెదవుల చిరునగ వదిగో
కనబడలేదా! కనబడలేదా!!

పూలకన్నియల
బుగ్గలు నొక్కుచు
బాలానిలుడై
పార్థుడు పాడే గేయము లవిగో
తెలియుటలేదా! తెలియుటలేదా!

ప్రభాతవాయు
ప్రసరణమ్ములో,
పయోదమాలా
ప్రస్తారములో,
స్వర్గవాహినీ
సైకతములలో,
పార్థక్రీడలు! పార్థక్రీడలు!

నిత్యబాల్యమురా పార్థునిది!
సత్యలోకమురా పార్థునిది!
స్వర్గనివాసము పార్థునిది!
స్వామిసన్నిధిరా పార్థునిది!

---

# శరత్ బాబు

'చక్రపాణి'

"ఇది తప్పక రవీంద్రుడు రచించిఉంటాడని నా నమ్మకం. ఒక్కనేనే కాదు. నాతో యింకా చాలామంది ఏకీభవిస్తారు."

"రవీంద్రుడు పేరు లేకుండా ఏదీ ప్రకటించలేదు. ఇది వారిరచన ఎలా అవుతుంది?"

"సరే. నీ మాటప్రకారం వారిది కాదనుకుందాము. ఇంత చక్కగా రాయగలిగినవారిపేరు ఇంకొకటి చెప్పు?"

ఈప్రశ్నకు జవాబుచెప్పటం అప్పుడు కష్టం. బంగాలీ సాహిత్యాకాశంలో రవీంద్రుడు చంద్రునిమాదిరిగా వెలిగిపోతున్నాడు. బంకిమచంద్రుడు ఎప్పుడో అస్తమించాడు. రవి మధ్యాహ్నదశలో ఉన్నాడు.

అసలు, పై తర్కానికి కారణమైంది 'బడదీదీ' అనే నవల. దీన్ని 'భారతి' (నః మాసపత్రిక — ఆకాలంలో ఇది ప్రముఖ పత్రిక—వరుసగా ప్రకటించింది. కాని రచయితపేరు వేయలేదు. అప్పుడు 'ఆ రచయిత 'ఎవరై ఉంటా' రని జరిగిన వాదోపవాదాలనుబట్టి రచన బంగాలీపాఠకులను ఎంతగా ఆకర్షించిందీ తెలుస్తున్నది. ఒక్కపాఠకులలోనే కాదు, సంపాదకులలోకూడా దీని విషయమై బాగానే చర్చ జరిగింది.

చివరకు ఒక మాసపత్రికాసంపాదకుడు 'భారతి' పత్రికలు తీసుకుని శాంతినికేతనానికి వెళ్లి రవీంద్రునికి యిచ్చి — ఈరచన తమది అవునో కాదో తేల్చండి' అని కూర్చున్నాడు. రవీంద్రుడు నవల మొదటినుంచి చివరవరకు ఒక్కబిగువున చదివి — "కథ చాలా బాగుంది కాని రాసింది నేను కాదు" అని, అప్పుడే "'భారతి' సంపాదకునికి — 'బడదీదీ' నేనే రాశానని చాలామంది అపోహపడుతున్నారు. కాబట్టి దాని రచయితను వెంటనే బయటపెట్టవలసిందని ఉత్తరం రాశాడు. మరుసటి సంచికలో వెలువడినది.

"బడదీదీ"

రచయిత

శ్రీ శరత్ చంద్ర చట్టోపాధ్యాయ

ఎవరీశరత్ చంద్రుడు? ఇదివరకు ఈపేరు ఎక్కడా చూడలేదే! ఎక్కడైనా మారుమూలపత్రికల్లో వీరిరచనలు దొరకుతాయా? అని చాలామంది వెదికారు. కాని లాభం లేకపోయింది. పోనీ వీరికొత్తరచన ఏదైనా వస్తుందాఅని కొన్నాళ్లు ఎదురు చూశారు. ఇటూ నిరాశే కలిగింది. నిమ్మళంగా వీరిని మరిచిపోయారుకూడా. 'బడదీదీ' ౧౯౦౭ ఏప్రియల్ మాసంలో ప్రకటితమైంది.

తర్వాత, ఏడనిమిది సంవత్సరాలకు 'యమున' అనేమాసపత్రికలో 'చిందురఛేలే' అనునవల, వీరి పేరుతో వరుసగా ప్రకటితము కాసాగింది. తర్వాత 'రామేరసుమతి' అనేకథకూడా ప్రకటితమైంది. ఈరచనలు ఎలా ఆదరంపొందినవో చూద్దాము.

'బిందురఛేలే' పడకముందు 'యమున'కు చందాదార్లు ౫౦౦ మంది మాత్రమే. ఈ రచన పడిన మరుసటినెలకే వేయికి పెరిగారు. తర్వాత క్రమంగా ౫౦౦౦ వరకూ హెచ్చారు. చిత్రమేమంటే ఈ పత్రిక వీరిరచనలతోనే వృద్ధిలోకి వచ్చింది - వృద్ధిలోకి రావటంకాదు, జీవించింది! చివరకు వీరిరచనతోనే నశించింది! నశించటానికి కారణం 'చరిత్రహీన్' అనే నవల.

ఈనవల పడడం మొదలుపెట్టిన కొంత కాలానికి ఈరచనను ప్రకటించవద్దని సంపాదకునికి చాలా జాబులు వచ్చినవి. కాని సంపాదకుడు వాటిని లెఖ్ఖచేయలేదు. చివరకు, అందరూ ఏకోన్ముఖంగా ఆపత్రికను బహిష్కరించారు. బాగా ఉందనుకుని విరగబడటంలోనూ వద్దనుకుని తోసివేయటంలోనూ బంగాలీలు అప్పటికే సమర్థులు!

ఇంతకూ ఆరచనలో (అప్పటికి ప్రకటితమైనంతవరకు) ఏమున్నది? ఒకకాలేజీ స్టూడెంటు- కులీనుడూ, ధనికుడూ మెస్‌లో ఉండే దా ని ప్రేమిస్తాడు! ఇదే కారణం. దీనికే పత్రికను బహిష్కరించటమా? ఈ స్వల్పకారణం కొంతవరకు పనిచేసినమాట వాస్తవమేకాని ఈఉద్యమానికి ఇంత విజయం కలగటానికి ముఖ్యులు రవీంద్రుని అనుచరులూ, పత్రికలూ. శరత్ - తాగుబోతనీ, అనాగరికుడనీ, నడత మంచిది కాదనీ, నీచజాతులతో కలిసిమెలిసి ఉంటాడనీ ఏమేమో ప్రచారంచేశారు. కాని నిప్పును ఊక ఎంత కాలం కప్పిపెడుతుంది?

చివరకు దానిలో కాలి భస్మమైపోయింది. తనిప్రతిభను అందరూ ఒప్పుకున్నారు; జోహారులు చేశారు. బెంగాలులోని ప్రతి సంస్థా ప్రతివ్యక్తీ వీరిని గౌరవించింది.

కలకత్తా యూనివర్సిటీ జగత్తారిణీ పతకం వీరిని బహూకరించింది. ఢక్కా యూనివర్సిటీ డి. లిట్. బిరుద మిచ్చింది. ౧౯౩౨లో వీరిని బంగాలీ లందరూ కలిసి కలత్తా టౌన్‌హాలులో సన్మానించారు :— 'శరత్ వందన' అను పేరుతో గొప్ప ఉత్సవం చేశారు. ఆనాడు సభలో వీరిని ప్రశంసించుతూ చదివినవన్నీ కలిపి 'శరత్ వందన' అనుపేరుతో వారే పుస్తకరూపంగా ప్రకటించారు. ఇక్కడ రవీంద్రుడు (౧౯౩౬) అన్న ముక్కలు రెండు ఉదాహరించి ప్రసంగం మారుస్తాను.

"శరత్ చంద్రునిదృష్టి బంగాలీల హృదయమర్మాలలో మునిగి తేలింది. సుఖంలో, దుఃఖంలో, కలయికలో, ఎడబాటులో ఘటిల్లుతూ ఉండేటటువంటి విచిత్రసృష్టిని అతడు బంగాలీల కళ్లకు కట్టినట్టుగా వర్ణించాడు. దీనికి నిదర్శనం బంగాలీల తరుగని ఆనందమే. బంగాలీలు ఆంతరంగికంగా వీరి రచనలతో తృప్తిపడ్డంత మరి ఏరచయిత రచనలతోనూ తృప్తి పడలేదు. ఇతర లేఖకులు చాలామంది గొప్పగొప్ప ప్రశంశలు పొందారు, కాని ఇలాఅందరి హృదయాతిథ్యములూ స్వీకరించలేకపోయారు."

ప్రతివ్యక్తీ — అతను ప్రఖ్యాతిచెందినవాడు కానీ; అపఖ్యాతికి పాలయినవాడు కానీ, పతితుడు కానీ, పావనుడు కానీ, ఏదో ఒకఘడియను జన్మిస్తాడు, మరణిస్తాడుకూడా. కాని మనం ఈహెచ్చులొచ్చులు వాళ్లు పుట్టిన నక్షత్రానికో, వేళావిశేషానికో ఇ సూ

ఉంటాము. మహాత్మా గాంధి జన్మించిన ఋషి యనే ఈవిశాలప్రపంచంలో యింకా ఎంత మంది జన్మించిఉంటారు? ఏడీ, మరో మహాత్ముడు కనపడడే! హిమాలయాల్లోనుంచి ఎన్నినదులు పుట్టినవి? పతితోద్ధారిణి అనే బిరుదు ఒక్కగంగకే లభించిందే! ఈప్రపంచంలో చాలామంది గొప్పవారి జన్మతిథులు తెలియవే! కనీసం కాలనిర్ణయంకూడా కాలేదే! అయినా జన్మతిథి తెలిసిఉంటే చెప్పటం ఆచారం. ఈపరంపరాగత ఆచారాన్ని నేనూ వదలను.

శరచ్చంద్రుని జననం ౧౫-౯-౧౮౭౬ వీరికి ఇద్దరు తమ్ములుకూడా ఉన్నారు — ప్రభాసచంద్రుడు, ప్రకాశచంద్రుడు. వీరిది కులీనబ్రాహ్మణవంశము. ప్రభాసుడు సన్యసించాడు. ౧౯౩౦ లో చనిపోయినాడు. శరచ్చంద్రునిది బీదకుటుంబం. వీరిబాల్యం మేనమామలయింట భాగల్పూరులో గడచింది. అక్కడనే స్కూలుఫైనలు పూర్తిచేసి, ఇంటరు చదువుతూ చదువు మాని, దేశాలమీద వెళ్లిపోయినాడు. ఎప్పుడైనామధ్య మధ్య భాగల్పూరు వచ్చినా ఎక్కువరోజులు ఉండేవాడు కాడు. మళ్లీ ఎటో వెళ్లిపోయేవాడు. ఎక్కడా ఉద్యోగంకూడా పట్టుమని నాలుగునెలలు చేయలేదు. అప్పుడు ఎక్కడెక్కడ తిరిగాడో, ఏమేమి చేశాడో, ఏ చరిత్రకారుడూ వ్రాయలేదు, (నమ్మతగింది) వీరూ బయటపెట్టలేదు. ఆరహస్యం వారితోపాటు చితిలో భస్మమైపోయింది.

౧౯౧౦ ఆప్రాంతాల వీరు రంగూను పోయి సెక్రెటేరియటులో ఉద్యోగం సంపాదించుకొని కొంతకాలం అక్కడనే ఉన్నారు. అక్కడ ఉంటూనే వీరు 'యమునకు' 'చిందురఛేలే' పంపింది. అప్పుడు రవీంద్రుడు ఇండియాలో లేడు. పశ్చిమయాత్రకు పోయినాడు. వారు వదలిన బంగాలీ సాహిత్యాకాశంలో శరత్ చంద్రుడు పూర్ణంగ ఉదయించి, నిండు కళలతో, మలినరహితమైన చంద్రికలు వెదచల్లినాడు. మధ్య ఒకమాటు వెలిమబ్బు కమ్మినా, అది వారికాంతిని హెచ్చించిందే కాని తగ్గించలేదు. అస్తమించేవరకు అదే కాంతితో ప్రకాశించినాడు. ఈ ప్రపంచంలో చాలామందిమాదిరిగా వీరు ప్రతిష్ఠాశిఖరాన్ని ఒక్కొక్కమెట్టే ఎక్కలేదు; ఒక్కమాటే దానిపైకి ఎగిరి కూర్చున్నాడు. చాలామందివలె అక్కడనుంచి దిగనూలేదు; చివరివరకూ అదే గౌరవంతో తన ఆసనాన్ని కాపాడుకున్నాడు.

వీరిరచనలు 'యమున'లో పడటం మొదలుపెట్టినాక, వీరు ప్రతిభావంతులని తెలుసుకుని 'భారతవర్ష' పత్రికాధిపతులు (గురుదాస చటర్జీ అండ సన్సు) వీరిని రంగూనునుంచి పిలిపించి నెలకు నూరు రూపాయల జీతంమీద తమ ఆఫీసులో ఉద్యోగం ఇచ్చారు. యమునలో పడిన కథలు 'చిందురఛేలే' అనుపేరుతో సంపుటిగా ప్రకటించుకోవటానికి మొదట వీరు ఒకపబ్లిషరుకు అనుమతి ఇచ్చారు కాని మొదటి సంస్కరణ మూడుమాసాలకే అమ్ముడుపోయేవరకు, రెండవ సంస్కరణ తానే ప్రకటించుకుని గురుదాసచటర్జీ అండ్ సన్సు వారికి డిస్ట్రిబ్యూటింగ్ అధికారం ఇచ్చారు. తర్వాత ఇలాగే ప్రతిపుస్తకం సొంతంగా ప్రకటించుకున్నారు. రచనల మీద వీరు సంపాయించి నంత డబ్బు హిందూదేశంలో ఎవ్వరూ సంపాదించలేదు.

వీరి ప్రథమరచన 'మందిర్' అనేకథ. ఇది చిన్నతనంలో వ్రాసింది. దీన్ని వీరిఅక్కయ్య, అనిలాదేవిపేరుతో ఒకస్టోరీ కాంపెటిషనుకు పంపినారు. ఆ ప్రతియోగితకు వచ్చిన 150 కథలలో ఇదే శ్రేష్ఠమైనదని ఎంచి నిర్ణేత, బహుమానం ఇచ్చినాడు. ఈయన చిన్నతనం నుంచీ రాస్తూఉండేవాడు; కాని పత్రికలకు పంపేవాడు కాదు, కనీసం జాగ్రత్తపెట్టేవాడు కూడా కాద. 'చంద్రనాథ్' అను రచన చిన్నతనంలో వ్రాసిందేనని చెప్పతారు. వీరిరచనలు అన్నీ కలిసి యాభైదాకా ఉంటవి.[1]

వీరికథ లన్నీ క్లుప్తీకరించిన నవలల్లా గుంటవి. వివరంగా రాస్తే నవలలకు సరిపోయే సామగ్రి వీటిలో ఉంటుంది. తెలుగులో అనువదింపబడిన వీరికథలు చదివితే ఈసంగతి తెలుస్తుంది.

వీరిరచనలు చాలా ఇంగ్లీషులోకి ఫ్రెంచిలోకి అనువదింపబడినవి. విశేషప్రశంసలను కూడా పొందినవి. దేశభాషలసంగతి చెప్పనక్కరలేదు. దాదాపు అన్నిటిలోకీ ఒకటో రెండో వచ్చినవనవచ్చును.[2]

---

1. కథలూ, నవలలూ:—చరిత్రహీన, గృహదాహ్, దేనాపావ్నా, దత్తా, శేషప్రశ్న, విప్రదాసు (చివరి రచన), దేవదాసు, పండితమహాశయ్, చంద్రనాథ, విరాజబహు, పల్లీసమాజ్, అరక్షణీయ, బడదీదీ, బామునేర మేయే, అనూరాధాసతీ ఓపరేశ్, వైకుంఠేర్ఉయిల్, పరిణీత, బిందురఛేలే, నవవిధాన్, స్వామీ, మేజదీదీ, హరిలక్ష్మి, రామేరసుమతి, ఛబి, నిష్కృతి, కాశినాథ, పథనిర్దేశ, మామలారఫల్, మందిర్, అభాగినీర స్వర్గ, హరిచరణ్, శ్రీకాన్త, అనుపమార ప్రేమ, అంధారేమే ఆలోక, దర్పచూర్ణ, మహేశ, ఆలోఓఛాయా, ఏకాదశీ, బైరాగీ, విలాస్.

నాటకాలు:— రమా (పల్లీసమాజ్), షోడశీ (దేనాపావ్నా), విరాజబహు (విరాజబహూ), విజయా (దత్తా కావచ్చు.)

నాటకాలు కొత్తవేవీ రాయలేదు. నవలలే తిరిగి నాటకాలుగా రాశారు.

వ్యాసము:— నారీరమూల్య.

సాహసికకథలు:— శ్రీకాంతేర భ్రమణకాహినీ (నాలుగుపర్వాలు) ఇది వీరిజీవితచరిత్ర మంటారు కొందరు. పథేరదాబీ (దీన్ని బెంగాలు ప్రభుత్వం నిషేధించింది.)

2. మొట్టమొదట వీరిని తెలుగువారికి పరిచయంచేసింది శ్రీ శివశంకరశాస్త్రిగారు. అనువదించినరచన 'అరక్షణీయ.' సరస్వతీ గ్రంథమండలివారు ప్రకటించారు.

'రామునిబుద్ధిమంతనం', 'తీరనితలపులు'—శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు అనువదించారు. ప్రజామిత్రలో ప్రకటితమైనవి. పుస్తకంగాకూడా ముద్రితమైనవి. వీ రింకా చాలా అనువదించామని ఒకమాటు వ్రాసినారు. ఆంధ్రులు త్వరలోనే అవికూడా చదవగలరని నావమ్మకం.

'అంధకారంలో ప్రకాశం'—దీన్ని శ్రీసూర్యదేవర వెంకటసుబ్బయ్యగారు హిందీనుంచి అనువదించారు. గృహలక్ష్మిలో ప్రకటితమైనది.

'హరిచరణ' - దీన్ని శ్రీ ఈదర లక్ష్మీనారాయణగారు హిందీనుంచి అనువదించారు. 'చిత్రగుప్తలో' ప్రకటింపబడినది.

'బడదీదీ' (ప్రజాబంధు); 'దేవదాసు' నవశక్తి. ఇది పుస్తకంగాకూడా వెలువడింది; 'పరిణీత' (ఫీణ ఇంకా పూర్తికాలేదు). 'పెంచినప్రేమ' (ఆంధ్ర దినపత్రికలో ప్రకటితమైనవి. పైవి నేను అనువదించాను.

ఇవికాక ఇంకా ఎవరైనా అనువదించి ఉండవచ్చును. నాకు తెలియకపోవటంచేత పేర్కొనలేదు. అలాంటిది జరిగిఉంటే క్షమించమని అనువాదకుని ప్రార్థిస్తున్నాను.

"నేను తరుచు పాపులచరిత్రనే వర్ణించాను – బహుశా వారు పాపంకూడా చేసి ఉండవచ్చు. అంతమాత్రానికే వారికి ఉరిశిక్ష వేయవలసిందేనా ? మనుష్యుని ఆత్మను నే నెప్పుడూ తిరస్కరించలేదు. ఎవరినైనా సరే, 'నువ్వు పాపివి' అని అంటానికి నాకు చాలా కష్టంగా ఉంటుంది. ఒకమాటు చెడిన మానవుడు మరల బాగుపడలేడా ? మంచీ చెడూ అందరిలోనూ ఉంటుంది; కొంతమందిలో చెడ్డే ఎక్కువ ఉండవచ్చు. అంతమాత్రానికే వాడు తిరస్కారపాత్రుడా ? నేను పాపం మంచి దని చెప్పటంలేదు – పాపం చెయ్యమని కూడా నే నెవ్వరినీ ప్రోత్సహించను. చెడ్డవానిలో ఉన్న మంచినికూడా మనం ఒప్పుకోవాలని నా ఉద్దేశము."

పైమాటలు శరత్ చంద్రునివి.

వీరిరచనల్లో ఈఉద్దేశం కనపడుతూనే ఉంటుంది. శరత్ చంద్రుని తంబురకు ఒకటే తీగ. వారు వాయించిందకూడ ఒకటేరాగం! ఈయన ఈతంబుర తీసుకునే ప్రతిబంగాలీ ఇంటిముందు నిలబడ్డాడు – అది మహాలు కానీ, గుడిసెకానీ ! ఆఒకేరాగాన్ని ఆలాపించాడు – వినేవాళ్లకు అది ఎన్నివిధాలగా వినిపించినా !

"మీకాళ్లక్రింద పడి స్త్రీలూ, బీదా బక్కా నలిగిపోతున్నారు. మీవర్ణవ్యవస్థకు ఎన్నో పవిత్రాత్మలు బలిఅవుతున్నవి. వాటి మూలుగు మీకు వినపడటం లేదా ? మీ బధిరత్వం వదలదా ?"—ఇదీ వీరు పాడింది, రాగం అనుకోండి, పాట అనుకోండి.

వీరిఉద్దేశం ఎంతవరకు సఫలమైందీ భావిచరిత్రకారుడు వ్రాయవలసిందే. కాని, వీరిపుస్తకాల అమ్మకాన్నిబట్టీ, వివిధసంస్థల నుంచి వీరికి లభించిన సన్మానాన్నిబట్టీ వీరి ఉద్దేశాలు ప్రజలకు నచ్చినవని మనం కొంత ఊహించుకోవచ్చును.

శరచ్చంద్రుడు ఆదర్శవాది కాడు; రియలిస్టు. వీరిరచనల్లో ఎక్కడా ఉపదేశం కనిపించదు. సమాజంలోఉన్న దోసగును ఎత్తిచూపి కొత్తసమస్యను లేవనెత్తుతాడు. ఆసమస్యను పరిష్కరించుకోవలసింది సమాజమే. విధవలదుస్థితి చాలాచోట్ల వర్ణించాడు; కాని ఎక్కడా వారికి తాను వివాహం చెయ్యలేదు. వారికి వివాహం చేయాలో అక్కరలేదో నిర్ణయించేభారం సమాజానికే వదలినాడు.

శరత్ చంద్రుడు సృష్టించిన పాత్రలు చిత్రాలు కావు; ప్రాణమున్న విగ్రహాలు అవి మనకళ్ల ఎదుటనే తిరుగుతూ ఉంటవి. మనసానుభూతిని సంపాదించుకుంటవి. అవి తర్కానికి లొంగేఘటాలు కావు. మనల్నే నిలవదీసి అడుగుతవి:

"భగవంతుడా ! ఇంతవిశాలప్రపంచంలో ఈఅభాగినిజీవితంతప్ప మీకు, ఆడుకోవటానికి ఇంకోవస్తువు దొరకలేదా?—" 'అచల' '(గృహదాహ్‌లో)'

ఈ ఉపాలంభన భగవంతునిమీదనే కాదు; పాఠకునిమీదకూడా !

"నేను ఎవరి కేమి అపకారంచేశాననీ, నా కిష్టమైనవస్తువు లొక్కటొక్కటే ఇలా చేయిజారిపోతున్నవి. — 'సతీశ్' ('చరిత్రహీన్'లో)

"భగవంతుడా ! నేను ఎవరి కేమి అపకారం చేశాను, అందరిదృష్టికీ యింత

కంటకంగా ఉంటానికి? నాకు అందం లేదు. —ఇది నాతప్పేనా? నా ఈరోగిష్టి, లావణ్య హీనశరీరం ఎవ్వరినీ ఆకర్షించటం లేదు.— ఇదీ నా నేరమేనా? నాకు వివాహం కావటం లేదు; నావయస్సు పెరిగిపోతూఉన్నది.— ఇదికూడా నాదోషమేనా?'' — 'జ్ఞానదా' 'అరక్షణీయా'లో.)

''అధికారమే కాదు, కర్తవ్యమనేది కూడా ఒకటి ఉంటుంది శ్రీకాంతబాబూ! వారు భర్త! వివాహంనాడు నాతోపాటు ఆ మంత్రాలే ఉచ్చరించారు. కాని వారివి గాలిలో కలిసిపోయినవి! ఇక, స్త్రీనికాబట్టి వాటిబంధనమూ బాధ్యతా అంతా నామీద పడవలసిందేనా? భర్త చేసిన తప్పులకు ప్రాయశ్చిత్తం భార్యకా? బ్రతికి ఉన్నంత కాలం జీవన్మృతవలె పడి ఉండటమే నారీ జన్మకు సార్థకతా? ఒక్కవివాహంనాడు మాత్రమే నాచేత మంత్రాలు చదివించారు. —నాజీవితంలో అచదవించటమేనా సత్యం; మిగతాదంతా మిథ్యేనా? ఈఅన్యాయమూ అత్యాచారమూ సత్యం కాదా? నాకు పత్నిత్వాధికారం లేదా? తల్లిని కావటానికి తగనా? సమాజంలో, ప్రపంచంలో లభ్యమయ్యే ఆనందాన్ని పంచుకోటానికి నాకు హక్కు లేదా? దుర్మార్గుడూ, నిర్దయుడూ, మిథ్యావాదీ అయిన భర్త, ఏమీ తప్పుచేయని భార్యను వెళ్లగొట్టినంతమాత్రంచేత ఆమెనారీత్వము వ్యర్థం కావలసిందేనా? ఇందుకోసమేనా భగవంతుడు స్త్రీలను సృష్టించి భూమిమీద వదలిపెట్టింది? అన్నిజాతుల్లో, అన్నిమతాల్లో ఈఅన్యాయానికి ప్రతీకారం ఉంది.—నేను హిందువులఇంట పుట్టటంచేతనేగా, నాకీ అధికారం లేకుండాపోయింది, శ్రీకాంతబాబూ?

''నేను మాట్లాడకపోవడం చూసి — 'జవాబివ్వండి శ్రీకాంతబాబూ! అన్నది మళ్లీ అభయ.'' — 'అభయ' (శ్రీకాంతం ద్వితీయపర్వంలో)

అభయభర్త భార్యను నమ్మించి రంగూను వెళ్లి అక్కడ బర్మాస్త్రీతో ఉంటూ భార్యను వదిలిపెడతాడు. అభయ ఇంకొకనిని వెంటబెట్టుకుని రంగూను వెళ్లి భర్తను కలుసుకుంటుంది. భర్త ఈమె సతీత్వాన్ని సందేహించి, ఈమెను కొట్టి అర్థరాత్రివేళ ఇంట్లోనుంచి వెళ్లగొడతాడు. పైప్రసంగం ఆతర్వాతది.

శరత్ బాబుకు ఆధునిక సభ్యతమీద విరక్తి ఉన్నట్టుగా కనపడుతుంది. కూలీలు ఎంత అసహాయస్థితిలో ఉన్నదీ, సభ్యులమనుకునేవారు వారిని ఎంత అధోగతికి లాగుతున్నదీ ఒకచోట హృదయం ద్రవించేటట్టుగా వర్ణించారు. ఈక్రింది ప్రసంగం రైలురోడ్డువేసే కూలీలది. వీళ్లు ఉండేచోటు రైలువాగన్లు. వీళ్లలో చాలామంది కలరా తగిలి చనిపోతూఉంటారు. తల్లీ కొడుక్కూ తగిలిఉన్నది:

''నీళ్లు'' అన్నాడు కుర్రవాడు. నేను కుర్రవాడిముఖందగ్గరకు వంగి — ''నీళ్లు లేవు నాయనా, ఉదయం యిస్తాను'' అన్నాను. కుర్రవాడు ''సరే''అన్నట్టు తల తిప్పాడు. తర్వాత నిశ్శబ్దంగా కళ్లు మూసుకున్నాడు.

''దప్పిక తీర్చటానికి నీళ్లు లేకపోయినవిగాని నాకళ్లనుంచి ఏకధారగా నీళ్లు కారుతున్నవి! ఇది మానవుని సుకుమారప్రవృత్తి

కాదు, ఉదాసీనత! పశువు అంటే ఇటువంటివాడే! ఇది ధైర్యశక్తి కాదు, జడత్వం. ఈ సహిష్ణుతకంటే మానవత్వానికి అధోగతి మరొకటి ఉండదు!

"మాట్రక్కులో ఉన్న వాళ్లంతా గుండెమీద చేయి వేసుకుని నిద్రపోతున్నారు. హారికేన్‌లాంతరుకు మసివేసింది. నేను ఆ గుడ్డి వెలుతురులోనే తల్లీ కొడుకుల శరీరం కండెలు కట్టిపోవటం చూశాను. కాని నేను చేయగలిగింది ఏ మున్నది?

"ఎదుట, నీలాకాశంలో చాలాచోటు ఆక్రమించుకొని సప్తర్షిమండలం ధగధగ మెరుస్తున్నది. నేను అటువైపు చూసి, వేదనతో, క్షోభతో, నిష్ఫల ఆక్రోశంతో శపింపనారంభించాను:

"ఆధునికసభ్యతకు" వాహనములైన మీరు చావండి! కాని ఏ హృదయవిహీన సభ్యతైతే మిమ్మల్ని యిలా పట్టుకు పీడిస్తున్నదో, దాన్నిమాత్రం మీరు క్షమించకండి. దాన్ని మీరు మోయక తప్పనట్టయితే సాధ్యమైనంత వేగంతో రసాతలానికి తీసుకుపోండి."

* * *

"తమరు నాకు ఏమి సలహా యిస్తారు?" ఒక లేఖకుని ప్రశ్న.

"నేను ఏమి ఇచ్చేది? నాకు మా పంతులు ఇచ్చిన ఉపదేశమే నీకు ఇస్తున్నాను. ఒకమాటు మాపంతులు నన్ను చూచి, ఏమోయి శరత్! 'నువ్వు బాగా రాస్తున్నావటే. నాకు ఒక్కరచనా చూపించలేదేమి?' అన్నారు. నేను 'తమబోటివారు చూచేటంత విశేష మేమీ లేదు నారచనల్లో' అన్నాను సంకోచిస్తూ. అప్పుడు వారు, 'సరే, నువ్వు ఇవ్వకపోతే ఇంకొకరిదగ్గర తీసుకుని చదువుకుంటాను. నువ్వు రాస్తున్నావంటే నాకు సంతోషంగా ఉంది. కాని, శరత్! రెండువిషయాలు జ్ఞాపకంపెట్టుకో. ఒకటి వ్యక్తిగతంగా ఎవ్వరినీ విమర్శించబోకు; రెండోది, నీకు అనుభవంలేని విషయాన్ని తీసుకుని నీవు ఏమీ రాయవద్దు' అని చెప్పారు. ఇదే నీవుకూడా అనుసరించమని నాసలహా." ఇది శరచ్చంద్రుని జవాబు.

శరత్ బాబు ఇప్పుడు మనలో లేరు. నిందకూ స్తుతికీ మించిన మరోప్రపంచంలో ఉన్నారు. వీరు పుట్టేప్పుడు తనతో సమానమైన ప్రతిభావంతుని వెంట తీసుకురాగలిగారో లేదో కాని చనిపోయేటప్పుడుమాత్రం ప్రొఫెసరు కోడి రామమూర్తిగారివంటి ప్రపంచవిఖ్యాత మల్లవీరునితో కలిసి పోయినారు. ౧౬-౧-౧౯౩౮ బంగాలీలకే కాదు; ఆంధ్రులకుకూడా దుర్దినము.

# ఎవడో

శ్రీ చిలుకూరి నారాయణరావు

వాడే సూత్రము చేత బట్టుకొని
ఆడేవారిని ఆడిస్తాడట,
వాడే అందరిలో తిరుగుతు తా
కూడేవారిని కూరుస్తాడట,
అతడే అందరి హృదయములోపల
అణుపుకంటె మరి అణువౌతాడట,
అన్నిలోకముల నతిక్రమిస్తూ
అన్నిటి కథినాయకు డౌతాడట,
ఎవడో! వా - డెవడో !!

వేయితలలతో, వేయికళ్లతో
వేయికాళ్లతో విశ్వము నిండియు
కురుచగు పదిఅంగుళములరూపము
వరిమొనవాసిగ వరలే దేహము
అంతా తానే, అంతా శూన్యము,
వింత! వింత!! యిది యెంతో మాన్యము,
ఎవడో ! వా - డెవడో !!

రూపము వలసిన రూపము గొనునట,
రూప మేల యన రూపము గొనడట,
పలుకరించినను పలుకరించునట,
పిలువకయున్నా వెంట నుండునట,
పుట్టిస్తాడట, గిట్టిస్తాడట,
పట్టినవారిని పట్టి విడువడట,
ఎవడో ! వా - డెవడో !!

బ్రహ్మ విష్ణు రుద్రావతారుడట,
అహూరుమజ్దా, యహోవ వాడట,
జినుడును బుద్ధుడు చైతన్యమునట
అనుపము డగునా యల్లా యతడట,
పేరు లున్నవట, పేరే లేదట,
వేరుగ నిలబడి వెత్తిచేయునట
అంతా తానని అరసేవారికి
శాంతి సౌఖ్యములు సమకూర్చే వా-
డెవడో ! వా - డెవడో !!



# భారతీయ కథా సాహిత్యం

## ఆరంభములు

శ్రీ ఎం. నాగేశ్వరరావు

మానవ క్షేత్రం విశాలమైంది. పశుపక్ష్యాదుల క్షేత్రంలా సంకుచితమైంది గాదు. మానవత్వంలో నున్న సహానుభూతిశక్తి పశుపక్ష్యాదులలో లేదు; వున్నా పరిమితిగలది. మానవాత్మ భావసాగరంలో "అహం"ను మరిచిపోతుంది. ఆశక్తి 'నా' సంకుచిత క్షేత్రంలో వుండజాలదు. ఆ భావాత్మ తన క్షేత్రాన్ని విస్తరింపజేయటానికి ప్రయత్నిస్తూ వుంటుంది. ఈ శక్తిచే ప్రేరేపింపబడి, ఇతరుల సుఖదుఃఖాల పరిచయ ప్రాప్తికి మానవుడు ఉత్కంఠితుడు ఔతున్నాడు. ఇతరులకు తన సుఖదుఃఖాల్ని తెలియబరచటానికి ప్రయత్నశీలుడౌతున్నాడు. కథల్లో ఈ లోటు పూర్తి చేయబడుతుంది. కావున[1] కథలు వ్రాయబడు తున్నవి.

మానవునిలో కథచెప్పటం, వినటం అతిపురాతన సహజప్రాకృతిక స్వభావము అనాదినుండి మానవ సమాజంలో ఈ ప్రవృత్తి పరంపరా వస్తూనే వుంది. బాలుడు మాతామహి ఒళ్లో కూర్చొని ఆమె చెప్పే కల్పితకథల్ని ఎంతో శ్రద్ధతో వింటూంటాడు. తాను కూడా కథాపాత్రలతో ఏకమై, పాత్రల సుఖదుఃఖాల్ని అనుభవిస్తాడు. స్వయంగా తానుకూడ అనుకరించుట మొదలుపెడతాడు. తోడిపిల్లలకు ఈ కథల్ని వినిపించి, చప్పట్లుకొట్టుకూ ఎంతో ఆనందం పొందుతాడు. వాని బాల్య హృదయం అద్భుత కల్పనలతో నిండి భావసముద్రంలో ఓలలాడుతుంది. వానికి అద్భుత రసానుభవమే కలుగుతుంది. దీనికి బాల్యఅజ్ఞానమే కారణం. వానిమనో క్షేత్రంలో వివిధకల్పనలు అంకురిస్తుంటాయి. దైవము, దేవత, ఎలుక, పిల్లి ఆది అమానవపాత్రల్ని కల్పించి వీనితో గలసి భావలోకంలో విహరిస్తుంటాడు. కాలక్రమేణ, వయసు ముదిరినకొద్దీ యీ కాల్పనిక అద్భుత భావచిత్రాలతో ఆనందం పొందుతాడు. జ్ఞానవృద్ధితో బాటు భావప్రసారంకూడ వృద్ధి పొందుతుంది. ఇది సహజమే జ్ఞానవృద్ధితో బాటు భావ రుచులుకూడ మారుతూవస్తుంటాయి అప్పుడు ఈ బాల్య కాల్పనిక చిత్రాల్ని అలంకరించటం మొదలిడుతాడు. కాల్పనిక చిత్రాల్ని సహజత్వానికి దగ్గరగా తీసుకొస్తాడు. ఈ కల్పనలు సత్యానూరంగా వుండవు. ఈ కల్పనల్లో అవసరమైనవాటిని తీసుకొని, అనవసరమైన వాటిని తీసివేసి తనవృత్తిను అలంకరిస్తాడు. ఈసాహితీ రూపాన్నే కథ అంటారు.

స్వయంగా మానవజీవన మొక కథారూపం వహిస్తుంది; కాని ప్రత్యక్ష మానవజీవన ఘటనల్లో సాహితీ రసానుభవం లేదు. ప్రత్యక్ష మానవజీవనంలో ద్వేషానికి చోటుంది. ఈజీవన ఘటన పరోక్షమై సాహితీరూపం దాల్చినప్పుడు రసానుభవం గలుగుతుంది. దీనిలో రసామృతం తొణుకుతూ వుంటుంది. ఈసాహితీరూపంలో (కథలో) పాత్ర నీచుడైనా, లంపటుడైనా పాఠకులు ఆనందాన్ని పొందుతారు. ఈ ఆనందం ప్రత్యక్షజీవనంలో లేదు. పక్షపాతాన్ని వహించివుంటుంది. సాహితీరూపంలో యీపక్షపాతానికి తావులేదు. కాల్పనిక భావలోకంలో విహరిస్తూ మానవుడు తనను తానే మరచిపోతాడు. ఆత్మైక్యం కలుగుతుంది. కావున మానవజాతి అనాది నుండి కథావాఙ్మయాన్ని ప్రేమిస్తూ వస్తున్నది. నేడుకూడ భయంకర అడవిజాతుల్లో (ఆఫ్రికా-ఆది దేశాల్లోని) మౌఖికరూపంగా కథాసాహితీ మూల రూపం ఆదరింపబడుతుంది; కాని వీరి కల్పనలు

1 ఈ వ్యాసంలో 'కథ'ను తరచుగా అన్నిచోట్ల (Short story) గా అర్థంచేసుకోవాలి.

అద్భుతంగా వుంటాయి. కొన్ని అడవిజాతుల్లో అనేక మూఢనమ్మకాలు వున్నాయి. కథలు చెప్పినందువల్ల దేవతలు సంతోషిస్తారట. కథలు చెప్పినందువల్ల వానలు కురుస్తాయనికూడ కొన్ని అడవిజాతులు నమ్ముతున్నాయి. అమెరికాలోని హబశీ జాతుల్లోకూడ ఇటువంటి కథలు ప్రచలితంగా వున్నాయి. కాని యీజాతులు తమభావాలకు పశుపక్ష్యాదుల వార్తాలాపంలో మూర్తరూపం యిచ్చి తృప్తిపొందుతున్నాయి. వీరి భావాలుకూడ బాలకుల భావాలవలె ఆశ్చర్యంతో కూడుకొని వుంటాయి. నేటి ఈ అనుభవాల్ని బట్టి కథాసాహిత్యం అత్యంత ప్రాచీనమైనదని, అనాదినుండి మానవజాతితో బాటు వృద్ధి పొందుతూ వస్తున్నదని తెలుస్తున్నది. ఇతర సాహితీ అంగాలకన్న కథాసాహిత్యమే అతిప్రాచీనమైనది. మానవజాతికి అత్యంత ప్రియమైంది. సమస్తవిశ్వభాషల ప్రాచీన (ఆది) సాహిత్యంలో కథా సాహితీరూపం విద్యమానమైవుంది. మానవ సభ్యత్వంతో బాటు కాల క్రమానుసారంగా కథావిషయమూ దాటిరూపమూకూడ మారుతునే వుంటుంది. జ్ఞానప్రసారంతో బాటు భావ ప్రసారంకూడ వృద్ధిపొందుతుందని ఇంతకుముందు వ్రాసేవున్నాను. కాని కథయొక్క మూలతత్వం అక్షుణ్ణమై, అపరివర్తనంగా వుండగలదు.

సర్వప్రథమం భారతీయ సాహిత్యంలో కథోత్పత్తి అయిందని విద్వాంసులు ప్రమాణాలు చూపిస్తున్నారు. భారతదేశానికే గాదు, విశ్వమంతటికి అతి ప్రాచీన గ్రంథమగు ఋగ్వేదంలో, ఉపనిషత్తులలో పురాణాల్లో, జైన, బౌద్ధధార్మిక సాహిత్యంలో కథా వికాసం నేటికి స్పష్టంగా కనిపిస్తూనేవుంది. అప్పటి ధార్మిక, దార్శనికాచార్యులు గంభీరక్లిష్ట విషయాల్ని సులభంగా బోధించటానికై కథల్ని వుపయోగించేవారు. ప్రాచీన భారతీయ సాహిత్యంలో యిటువంటికథలు చాల వున్నాయి. ఋగ్వేదంలోమాత్రం ఉపదేశాత్మక కథలు లేవు. ఋగ్వేదంలో దేవతావర్ణనగీతాలే వున్నాయి. ఉపనిషత్తులలో, పురాణాలలో యీకథలు స్పష్టంగాకనిపిస్తున్నాయి. ఛాందోగ్యోపనిషత్తులో సత్యకాముని కథ, కఠోపనిషత్తులో నచికేతుని కథ ఇటువంటివే. ఇవి ఉపదేశపూర్ణాలు, క్లిష్టదర్శనాన్ని సులభం చేయటానికి ప్రయోగించబడినాయి. కథా సాహితీ దృష్టితో చూచినపక్షాన ఋగ్వేదంలోని 'అపాలా'కథ, బ్రాహ్మణము (పురాణము)లలోని వామదేవ, రోహితులకథలు, ఉపనిషత్తులలోని జాబాలి, నచికేతులకథలు అతి ప్రాచీనములు. తరువాత దార్శనికులు అతిక్లిష్ట విషయాలగు న్యాయ, దర్శనాల్ని సుబోధం చేయటానికి కల్పిత కథాప్రయోగాలు చేసివున్నారు. దానిలో వారు పర్యాప్తసాఫల్యాన్నికూడా పొందేరు. కఠినవిషయాల్ని సుబోధం చేయటానికి కథలు ఉపయోగింపబడినందువల్ల వాటి ఉపయోగం, ప్రచారంకూడ వృద్ధి పొందింది; కాని యీకథల్లో పశుపక్ష్యాదులు, భూతప్రేతాదులు — చేతనాచేతనాలు కథాపాత్రలుగా వచ్చినందువల్ల స్వాభావికతత్వానికిఅవి చాలాదూరంగా వున్నాయి. క్లిష్టసమస్యా పరిష్కారమే వారిదృష్టిలో ఉన్నమై వుండేది; స్వాభావికతాస్వాభావికతలు వారి చింతన విషయాలు గావు. దర్శనమాత్రాల్లో ఇటువంటి కథలు విశేషంగా వున్నాయి.

తరువాత బుద్ధదేవుని జాతకకథలు వ్రాయబడినాయి. ఈ కథలే "త్రిపిటక" గ్రంథములపేర సంకలనం చేయబడినాయి. సంశయతః క్రీస్తుకు పూర్వం ౪-వ, శతాబ్దంలో ఇవి రచింపబడి వుండవచ్చు. బౌద్ధ భిక్షువులద్వారా దేశదేశాల ప్రచారం కాబడినాయి. యూరోపు, మధ్య ఏషియా మొదలగు దేశాల్లో యీ జాతకకథల ననుసరించే కథా సాహిత్యం వికసించింది. యూరోపు కథాసాహిత్యం మీద మధ్యయుగం వరకు జాతక కథల ప్రభావం ఉంటూనే వచ్చింది. క్రీ. పూ. 300 శతాబ్దంలో గ్రీసు దేశస్థు డొకడు జాతకకథల్ని భాషాంతరీకరించి సంకలనం చేశాడు. ఈ సంగ్రహమే "ఈసప్" (Aesop) పేరుతో ప్రసిద్ధిగాంచింది. ఇది జాతకకథల రూపాంతరం మాత్రమే. ఈజాతకకథలు గ్రీసుసభ్యతకు అనుకూలంగా మార్చి వేయబడినాయి.

బుద్ధుని జాతక కథలు పాలీభాషలో వ్రాయబడినాయి. తరువాత బౌద్ధుల ననుసరించి బ్రాహ్మణులు హితోపదేశము, పంచతంత్రము మొదలగు కథా

గ్రంథాల్ని ధర్మోపదేశానికై వ్రాశారు. జాతక కథల ననుసరించి పైశాచిక అపభ్రంశ భాషలలోకూడ కథా గ్రంథాలు వ్రాయబడ్డాయి. గుణాఢ్యుని "బృహత్కథ" పైశాచికభాషలో, క్రీస్తు శకారంభంలో వ్రాయబడింది; కాని నేడీ గ్రంథరాజము అలభ్యము. దురదృష్టవశాత్తు అది లుప్తమైపోయింది! బృహత్కథను ఆధారంగా తీసుకొని సంస్కృతంలో బృహత్కథామంజరి, కథాసరిత్సాగరము, శ్లోకసంగ్రహము వ్రాయబడినాయి. తరువాత సంస్కృతంలో భేతాళపంచవింశతి, సింహాసన ద్వాత్రింశిక, కథార్ణవము, హరచింతామణి ఇత్యాది గ్రంథములు రచింపబడినాయి. దండి దశకుమార చరిత్రంకూడ చాలా ప్రసిద్ధి. ఈ కథాగ్రంథము లన్నియు పద్యబద్ధము లైనవి. ప్రాచీనకవు లందరును కవితనే పోషించారు. వారిదృష్టి 'గద్య' పైపుకు పోలేదు. గుణాఢ్యుని "బృహత్కథ" గద్యంలో వ్రాయబడిందని కొందరు విద్వాంసులు అనుమానిస్తున్నారు. కాని ప్రమాణము దొరకలేదు. మూల గ్రంథమె లుప్తమై పోయింది. అస్తు.

## వర్తమాన ప్రగతి

ప్రాచీనభారతీయ కథాసాహిత్యంలో మనోరంజనకు గౌణస్థానమే ప్రాప్తమైంది. కథలద్వారా ధర్మోపదేశం చేయటమే వారి ముఖ్యోద్దేశ్యము. నేటి కథాసాహిత్యంలో మనోరంజన(ఆనందం)కు ప్రథమస్థానం ప్రాప్తించింది. ప్రాణిమాత్రికి ఆనందం అత్యంతావశ్యకం. కాని లౌకికానందానికీ, సాహితీరసానందానికీ చాల భేద ముంది. లౌకిక ఆనందసుఖాలు వృద్ధిపొందినకొద్దీ మానవుడు అతిశయపరుడు కావచ్చు; అత్యాచారం వృద్ధిపొందవచ్చు; పాపం పెరుగవచ్చు. ఇది సంభవమే గాని, అసంభవం గానేరదు. లౌకిక సుఖానందాలవల్ల పరులకు కీడు గలుగవచ్చు; కాని సత్సాహితీ ఆనందంవల్ల పరులకు హాని కలుగనేరదు. ఈ ఆనందం ఎప్పుడూ ఒకసనీమలోనే వుంటుంది. దీని స్థానము లౌకికప్రపంచంలో వుంటూ కూడా అలౌకికమైంది. పవిత్రమైంది. సాహిత్య రసభావానందాన్ని పొందటానికి అందరు సమానులే. ధనాధనికుల వివక్షత లేదు. అందరూ ఒకటే. ధలేహీ అనత్కురాస్యులు అనర్హులు కావచ్చు. ఇది సాహిత్యదోషం గాదు. సామాజిక నిర్మాణదోషం లేక రాజనైతిక పరిస్థితుల దోషం. సాహితీద్వారం అందరికొరకు తెరవబడి వుంది. అందరూ ప్రవేశించవచ్చు.

ప్రాణిమాత్రికి ఆనందం కామ్యవస్తు వని చెప్పినాను. దీన్నే వేదాలుకూడా ఘోషిస్తున్నాయి. "ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే, ఆనందేన జాతాని జీవంతి, ఆనందం ప్రయంత్యభిసంవిశంతి." అనాదినుండి మానవుడు ఆనంద పిపాసువై వస్తున్నాడు. ఈపిపాస ఎప్పటికీ చల్లారదు. మానవజాతి సౌందర్యానందశూన్య మైతే విశ్వసౌందర్యమే నష్టమగుతుంది. విశ్వంలో ఆకర్షణే వుండదు. మాతృగర్భం నుండి శిశువు భూమిమీద జననంతోనే ఆనందాని కధికారి అవుతున్నాడు. క్రమేణ వాని ఆసక్తి ఆనందం మీదికి పరిలక్షిత మవుతుంది. తరువాత ఆ శిశువే మానవుడై ఆజన్మాంతం ఆనందపిపాసువై ఆనందప్రాప్త్యభిలాషతో పీడింపబడుతున్నాడు. మానవుడు ఆనందపిపాసు వగుటవల్లనే కళ సృష్టించవలసివస్తున్నది; సృష్టిస్తున్నాడు. మానవుని ఈపిపాస సాహితీ ఆనందామృతాన్ని త్రావితేనేగాని చల్లారదు. కాని యిది క్షణికమే. మరల మామూలుగానే 'పిపాస' మేల్కొంటూనే వుంటుంది.

నేడు విశ్వసాహిత్యంలో కథలు సర్వోచ్చ స్థానాన్ని పొందివున్నాయి. కాలపరిస్థితి దీనికి ముఖ్యకారణం. కథాసాహిత్యవృద్ధికి పత్రికలు విశేషంగా తోడ్పడుతున్నాయి పత్రికాలోకం కథలతో నింపబడుతున్నది. సాప్తాహిక, మాసికపత్రికలలో ఒకటి, రెండు కథలు అనివార్యంగా వెలువడుతున్నాయి. ప్రత్యేకంగా మాసిక, సాప్తాహిక కథాపత్రికలుకూడ వెలువడుతున్నాయి. దైనిక వార్తాపత్రికల్లోకూడాను. కథలు వెలువడని పత్రికలు ప్రజాదరాన్ని పొందలేకున్నాయి. ఈకథాప్రగతికి కారణం విశ్వమానవభావలోకంమీద ఒకసారి విహంగమదృష్టి ప్రసారించిన బోధపడగలదు. ఇది విజ్ఞానయుగం. క్షణకాలం ఎంతో విలువగా జూడబడుతుంది. మానవాత్మ విజ్ఞానసిద్ధితో ప్రకృతిమూలతత్వాన్ని కనిపెట్టుటకు (జయిం

చుటకు) రాత్రింబవళ్లు ఘోరయుద్ధం చేస్తున్నది. బుద్ధిబలాన్ని ప్రయోగించవలసివస్తున్నది. అందువల్ల వర్తమానయుగంలో మానవభావ (మానసిక) ప్రపంచంలో అలసట మేఘాలు క్రమ్ముతున్నాయి. మానవుడు మానసిక పరిశ్రమ చేసి అలసిపోతున్నాడు. భావక్షేత్రంలో శిథిలత్వం వస్తున్నది. ఈశిథిలత్వాన్ని దూరంచేయటానికి మానసికభోజనం అత్యంత అవసరమై వుంది. ఈ మానసికభోజనాన్ని కథాసాహితీకళ సులభంగా ప్రసాదించగలదు. కాఫీ పుచ్చుకొంటూకూడ చిన్నచిన్న కథల్ని చదివి ఆనందించటానికి వీలుంది. నేడు యూరోపీయ సాహిత్యాలలో చాలా చిన్నచిన్న కథలు వెలువడుతున్నాయి. కాఫీ పుచ్చుకొంటూ అయిదు నిమిషాలలో వీటినిచదివి ఆనందించవచ్చు. పెద్ద ఉపన్యాసము (నవల) రసకలశమైతే, కథ చిన్నరస బిందువు.

కథాసాహిత్యం మానవాదరాన్ని ఎందుకు పొందుతుంది? కవితనుండి మానవుడు ఆనందాన్ని పొందలేడా అన్నప్రశ్న తర్కరహితము. అవును, కవితనుండి ఆనందానుభవం పొందవచ్చును. కవితను చదివేటప్పుడు మానవాత్మ అసీమభావ ప్రపంచంలో విహరిస్తుంది. ఈభావప్రపంచానికి 'సీమ' లేదు. ఈ భావప్రపంచంలో మానవాత్మ పక్షిలా విహరిస్తుంది. కవితాత్మ ప్రబలశక్తి గలది. అది మానవాత్మను సునాయాసంగా వెంట తీసుకపోగలదు. కాని కథను చదివేటప్పుడు మానవాత్మ హృదయంలోనే విహరిస్తుంది. తన పరిమితసీమలోనే ఆనందాన్ని అనుభవిస్తుంది. ఆనందభోజనమునకై బయటికి పోవలసిన అవసరంలేదు. కథను చదివేటప్పుడు మానవుడు (పాఠకుడు) తనలో తానే ఆనందపులకితుడవుతుంటాడు. కవితలో ఆనందం విశాలమైంది. కథయొక్క భావాత్మ పరిమితిగలది. దాని క్షేత్రం దానిలోనే వుంది. కవిత్వభావాత్మవలె ముక్తాకాశంలో విహరించనేరదు. కథాత్మ కవితాత్మకన్న సంకుచితమైనప్పటికీ, హృదయంలోని సుప్తభావాల్ని అతిత్వరితంగా మేల్కొల్పగలదు. కవితలో యింత చురుకైన శక్తిలేదు. అదిగాక కథ చాల సరళంగాను, సర్వజనానుకూలంగాను వుంటుంది. కొద్దిగాచదువుకొన్నవాడుకూడ కథనుచదివి మనోరంజనము పొందగలడు. కథాధ్యయనానికి పాండిత్యంతో పనిలేదు. కవితాక్షేత్రం వేరు. అది నియమాల్లో బంధింపబడి వుంటుంది. ఈనవీనయుగంలో నియమాల్ని పరిత్యజించి కవితను వ్రాస్తున్నప్పటికీ స్వర, లయ, గతులు కావలసి వున్నాయి. ఇవి లేకపోతే కవిత్వసౌందర్యమే నష్టమవుతుంది. స్వరహీనకవిత తన ఆత్మను ప్రకటించలేదు. గతి, లయలు లేని కవిత్వములో కవిత్వరసాత్మ మూర్ఛితావస్థలో పడివుంటుంది. సౌందర్యం మంటిలో కలిసిపోతుంది. స్వరంతో కలిసి కవితను పాడినప్పుడు దానిలో అతిరిక్త సౌందర్యం వస్తుంది. సంగీతానికికవితకు దగ్గరసంబంధ ముంది. రెండూ అక్కచెల్లెండ్రన్నమాట. ఒకదాన్ని విడిచిపెట్టి మరొకటి శోభించదు. ఒక పక్షంలో సంగీతము (నాదము) కవిత్వం లేకుండా తన సౌందర్యాన్ని నిలబెట్టుకొనగలదు. కవిత్వం సంగీతం లేకుండ శోభించదు. దీనికి లయ గతులు అత్యంత అవసరము. ముక్తసుస్వరకంఠంతో పాడగలిగినవారే కవిత్వ రసానందాంబుధిలో పూర్తిగా నిమగ్నులవగలరు. మౌనఅధ్యయనంలో కవిత్వ సౌందర్యం కుంఠితమైపోతుంది. ఈబాధలు కథలో లేవు. కథకు స్వర లయలు అనవసరం. అక్షరాస్యుడుకూడ కథను చదివి ఆనందం పొందగలడు. ఇంకొకటి. భాషలోకూడ చాల భేదముంది. కవిత్వభాష జనసామాన్యభాషకన్న సుసంస్కృతరూపంలో, జనసామాన్యానికి కొంచెం దూరంగాను వుంటుంది. కవితాధ్యయనానికి ప్రతిభ కావాలి. విశేషఅధ్యయనం లేకుండా అర్థంచేసుకోవటం చాలకష్టం. కథభాష మనకు చాల దగ్గరగా ఉంటుంది. రోజూ మనం మాట్లాడేభాషే. జనసామాన్యానికి దూరంగావుండదు. కథ మానవజీవనానికి చాల దగ్గరలో వుంటుంది. కవిత కొంచెం దూరంగా వెనుక-వెనుక నడిచివస్తుంది. వెనుక తిరిగి చూస్తే గాని దాని సౌందర్యాన్ని అనుభవించలేము. కాలచక్రంతో పాటు ముందుకువెళ్లే మానవుడు వెనుకకు తిరిగి, కొంచెం సేపు ఆగితేగాని కవిత్వసౌందర్యాన్నే పొందలేడు. కథ ? అది మనవెంటనే వస్తుంటుంది. మానవజీవనంతో చేతులుచేతులు పెనవేసుకొని వస్తుంటుంది. ఆగవలసిన అవసర ముండదు. కథ మనభుజాలమీద చెయ్యివేసి

వస్తున్నప్పుడు ఆగవలసిన అగత్యమేమిటి ? కథపాత్రలు కూడ మనకు చాల దగ్గరగా వుంటారు. మనకు పరిచయ వ్యక్తుల్లాగానే కనిపిస్తారు. మానవజీవనానికి నికటస్థంగా వున్నందువలననే కథాసాహిత్యం మానవాదరాన్ని పొంది దినదినాభివృద్ధి పొందుతుంది.

నేడు నవలాసాహిత్యంకన్న కథాసాహిత్యం వుచ్ఛస్థితిలో వుంది. యుగపరిస్థితే దీనికి కారణం. భవిష్యత్తుకూడ ఉజ్జ్వలంగావుంది. ఈవైజ్ఞానికయుగంలో 'నవల'ను చదువుటకు సమయమెక్కడ ? నవలను ఎవరూ చదువుట లేదనికాదు నా అభిప్రాయం; నవలాసాహిత్యంకూడ వృద్ధిలోనే వుంది ; కాని కథాసాహిత్యానికున్నంత ప్రజాదరం(ప్రేమ) నవలాసాహిత్యానికి లేదు. నేటి మానవమనోవృత్తి చిన్నిచిన్ని కథలనే కోరుతుంది. కళాదృష్టిలోకూడ కథ రత్నంలాంటిది. ఉపన్యాస (నవల) క్షేత్రం పెద్దది. ఉపన్యాసకళ చిత్రకళవంటిది. అవసరమైనచోట రంగు వేయవచ్చును ; అనవసరమైనచోట రబ్బరుతో తుడిచివేయవచ్చు. నవలారచయిత నవలని రచిస్తూ క్రొత్త ప్రాత్రల్ని ప్లాటు కనుకూలంగా సృష్టించుకోగలడు. ఈస్వతంత్రత కథాకారునకు లేదు. కథశిల్పకళవంటిది; అతిసూక్ష్మమైంది. శిల్పి ముందుగా హృదయంలో మూర్తిని నిర్మించుకొని, అప్పుడు ప్రస్తర మూర్తికి జీవనం పోస్తాడు. మూర్తి నిర్మాణంలో జాగ్రత్తగాను, నిపుణత్వంతోను ప్రవర్తించవలసి వస్తుంది. ఎక్కువదెబ్బ తగిలిందా మూర్తిసౌందర్యం నష్టమైపోతుంది. పోయిన సౌందర్యాన్ని తీసుకురావటానికి బ్రహ్మతరంగాదు. ఇటువంటిదే కథాసాహిత్య కళ. కథలో జీవితాంశమాత్రమే ఉంటుంది. ఒక ఘటనను తీసుకొనే కథ నిర్మిస్తారు. ఈ అంశ మాత్రవల్ల 'పాత్ర' జీవనంమీద పూర్తి ప్రకాశం పడుతుంది. కథాపాత్ర యిటువంటివాడుగదా అని పాఠకులు తెలుసుకొంటారు.

కథలో అనవసరప్రసంగాలకి తావు లేదు. ఉపన్యాసంలో అక్కడక్కడ లోట్లు వచ్చినప్పటికీ 'కళ' నష్టంకాదు. దాని విస్తృతాకారంలో యీలోట్లు విలీనమైపోవును. కథలో కథానకు (వర్ణన) ముందుకు నడుస్తూవుండాలి ఎక్కడా ఆగినట్లుకనిపించగూడదు. కథయొక్క ప్రతిఘటన 'కథానకు'ను ముందుకు నడుపుటకు సహాయపడాలి. ఎక్కడా బాధ కలుగగూడదు. ఇటువంటికథ ఉపన్యాసంకన్న అత్యుత్తమమైంది. మానవహృదయంలో త్వరగా ప్రవేశించగలదు.

ప్రాచీన భారతీయ సాహిత్యంలో ఉపదేశానికై కథలు వ్రాయబడుతుండేవి. ఆకథలలో స్వాభావికతత్వం సున్న. అమానవపాత్రలు మానవభావాలతో నింపబడేవి. ఇహ పరలోకాల అలౌకిక విషయాలు జనోపదేశానికై అలౌకికంగా వర్ణింపబడుతుండేవి. కథలద్వారా ఉపదేశ మివ్వటమే ముఖ్య విషయమై వుండేది.

రానురాను భారతీయ జనరుచిలో యుగపరివర్తన గలిగినట్టు కలుగుతుంది. అసంభవ కపోలకల్పిత స్థానాన్ని వాస్తవికతత్వం ఆక్రమించుకొంటే దీనితో బాటు భావచిత్రణ మహత్తుకూడ అధికమైంది ప్రాచీన సాహిత్యం వర్ణనా ప్రధానం ; నవీనసాహిత్యం భావ ప్రధానం. ప్రాచీనకవులు స్థూలసౌందర్యాన్ని వర్ణించేవారు. వారికి స్థూల 'నాయిక' ఆలంబనగా వుండేది. నఖశిఖ వర్ణన ప్రాధాన్యము. నేడు సూక్ష్మసౌందర్య భావం ప్రాధాన్యంగా వుంది. నవీనకవులు సూక్ష్మ సౌందర్యానికి సంకేతాత్మకశైలితో మూర్తరూపం యిస్తున్నారు. నేడు కథలుకూడ భావప్రధానాలు. నవీనభావాలతో కథలు వ్రాయబడుతున్నాయి. నవ జీవన అంగప్రత్యంగలు కథల ద్వారా చిత్రింపబడుతున్నాయి. కాలపరిస్థితితో బాటు సాహిత్యానికి కూడ నవీనవిషయాలు దొరుకుతూనే వుంటాయి. సాహిత్యం వీటిని అస్వీకారం చేయలేదు.

నేడు విశ్వసాహితీజగత్తులో విఖ్యాతిలేఖకులు (కవులు) అందరు కథలు వ్రాయుచున్నారు. కథలు చిన్నిచిన్ని గద్యకావ్యాలుగా ఎంచబడుతున్నాయి. 'వాక్యం రసాత్మకం కావ్యం.' లలిత కళలలో కథలు ప్రథమస్థానాన్ని అలంకరిస్తున్నాయి.

సామాజిక రాజనైతిక పరిస్థితుల ప్రభావం సాహిత్యంమీద పడుతుంది. సాహిత్యనిర్మాణ స్వర్గం.

నుంచి రాదు, అతను సమాజంలో ఒకవ్యక్తి. పరిస్థితుల కనుకూలంగానే భావం పుట్టుకుంది. సాహిత్యకారుడు ఆ భావానికే సాహితీరూపం యిస్తాడు. ఏ జాతి సాహిత్యంమీద సామయికప్రభావం పడదో ఆ సాహిత్యం సజీవమైంది కాదు; ప్రజాసామాన్యానికి చాల దూరంగా ఉంటుంది. ప్రస్తుతిభావానుకూలంగా సాహిత్యం లేనందువల్ల ప్రజ నిరాశ పొందుతుంది. సామాన్యప్రజాభావానుకూలంగా లేని లలితసాహిత్యం జాతిప్రతినిధిత్వం చేయటం లేదన్నమాట. ప్రాచీన భారతీయసాహిత్యంమీద యీ సామయికప్రభావాలు స్పష్టంగా గోచరిస్తున్నాయి. భారతదేశం ధర్మప్రాణ దేశము. ఇది స్పష్టంగా మన ప్రాచీన సాహిత్యంలో కనిపిస్తుంది. ఈ ధార్మికభావంవల్ల 'కళ'కు హాని కలుగలేదు. అప్పటి కళాకారులు "స్వాంతః సుఖాయ" కొరకు గాక తమ ఇష్టదేవులప్రీత్యర్థమై కళను సృష్టించేవారు. అజంతా చిత్రాల్లో యీ భావం స్పష్టంగా గోచరిస్తుంది. ప్రాచీన కళాకారులు తమభావాల్ని స్త్రీరూపంలో ప్రకటించేవారు. ఆ స్త్రీ యిహలోకవాసిని కాదు; దేవి. పార్వతి, లక్ష్మి, జగదంబ, శక్తి, బుద్ధజనని లేదా స్వర్గీయఅప్సర. వారిభావాలు యీ స్వర్గీయ స్త్రీ రూపాలు దాల్చినాయి. వాటిలో అశ్లీలత లేదు. స్త్రీ సౌందర్యరూపంలో కామవాసనకు తావుంటే అది 'కళ' కానేకాదు. ఈ 'కళ' పురుషరూపంలోకూడ వెలువడింది. ఆ పురుషుడుకూడ మానవుడు కాడు; విష్ణువు, రాముడు, కృష్ణుడు, బుద్ధదేవుడు. ఇది మన ప్రాచీన 'కళ' విశిష్టత. మన పూర్వులను ఆర్యుల అంతరాత్మను పరిశీలించాలంటే ప్రాచీనసాహిత్యం చదవాలి. ప్రాచీనార్యుల ఆత్మ ప్రాచీనసాహిత్యంలో శృంఖలాబద్ధంగా వుంది.

భారతీయసభ్యత్వం 'ప్రకృతిగోది'లో (ఒడిలో) పెంపొందింది; యూనానీసభ్యత నగరాల్లో. ప్రాచీనార్యులు ప్రకృతిసౌందర్యం ముందు స్వర్గాన్నికూడ మరిచిపోతుండేవారు. అజంతా చిత్రాల్ని గురించి ఒక దంతకథ ప్రచలితంగా వుంది. "దేవతలు స్వర్గసుంఖంతో తృప్తిపొందక భూలోకవిహారం చేసి వస్తామని దేవేంద్రుణ్ని సెలవు అడిగారట. దేవేంద్రుడు ఒక్క రోజు సెలవు యిచ్చి, సూర్యోదయం కాకముందే రమ్మని ఆజ్ఞ యిచ్చాడట. దేవతలు దేవేంద్రుని ఆజ్ఞ పొంది అజంతా పర్వతాలమీద విహరించటానికి భూలోకం వచ్చారట. భూలోక ప్రకృతిసౌందర్యం మీద ముగ్ధులై దేవతలు దేవేంద్రుని ఆజ్ఞను మరిచిపోయారు. సూర్యోదయమైంది. దేవతలు స్వర్గానికి వెళ్లలేదు. అప్పుడు దేవేంద్రుడు క్రుద్ధుడై 'అజంతా గుహల్లో చిత్రాలై పోవుదురుగాక' అని దేవతలకు శాపం యిచ్చాడు. ఆదేవతలే నేడు అజంతాగుహల్లో చిత్రాలై వున్నారట. ఇది భారతీయ మనోవృత్తి. ఈదంతకథవల్ల మనప్రాచీనుల ప్రకృతిప్రేమ ప్రకటితమగుతుంది. అస్తు.

విజ్ఞానయుగ సంపర్కంలో భారతీయ ధార్మిక భావం ఆక్రమించుకొంటుంది.

ఆంగ్లసామ్రాజ్యం స్థాపిత మైనప్పటినుంచి భారతీయసాహిత్యంలో యుగపరివర్తన కలిగింది. బ్రిటిషు ప్రభుత్వంవారి ప్రాథమిక సువ్యవస్థిత శాసనాన్ని చూచి భారతీయులు మంత్రముగ్ధులైరి. భారతీయహృదయంలో ఆదరభావ మేర్పడింది. ప్రముఖభారతీయులు ఆంగ్లేయుల్ని ప్రశంసించనప్పటికి వారిహృదయంలో ఆదరభావమే వుంది. ఇతిహాసాన్ని పరిశీలిస్తే అనేక ఉదాహరణలు దొరుకును. రవీంద్రుడుకూడ బ్రిటిషు ప్రభుత్వాన్ని ప్రశంసించాడు. భారతీయులు తమను హీనులుగాను, ఆంగ్లేయుల్ని గొప్పవారిగాను భావించారు. ఈభావం యింకా నశించలేదు. ఈభావం ఐరోపా మహాసంగ్రామంవరకు వచ్చింది. సంగ్రామానంతరం జాగృతి కలిగింది. భారతీయులు పరాధీనతారహస్యాన్ని తెలుసుకొన్నారు. స్వాతంత్ర్యభిలాష దినదినాభివృద్ధి పొందుతూవచ్చింది; నేను వృద్ధిపొందుతున్నదికూడాను. ఈక్రమభావవికాసం భారతీయసాహిత్యంలో స్పష్టంగా గోచరిస్తుంది.

భారతీయులు ఇంగ్లీషువారినే ఆదరించలేదు; వారి రీతి రివాజుల(సభ్యత)ను, సాహిత్యాన్నికూడ ఆదరించారు. ఈ ఆదరణవల్ల మంచిచెడుగులు రెండున్ను కలిగినాయి. శాసకుల రీతి రివాజుల ప్రభావం శాసిత

వర్గంమీద పడుతూనేవుంటుంది. ఈప్రభావం అతి సూక్ష్మంగా ప్రవేశిస్తుంది. దీనిని అడ్డుకోవటానికి ఎవరి తరమూ గాదు. ఆంగ్లేయుల సంపర్కంవల్ల ప్రతివస్తువు లోను పరివర్తన కలిగింది. బాహ్యప్రపంచంలోనే గాదు, ముఖ్యంగా భావప్రపంచంలో విపరీత పరివర్తన కలిగింది. ఆంగ్లేయులు తమ శాసనంతోబాటు తమ సాహిత్యాన్నికూడ విస్తృత ప్రచారంతో వ్యాపింప జేసారు. అందువల్ల ఆంగ్ల సాహిత్యప్రభావం మన సాహిత్యంమీద పూర్తిగా పడింది. పాశ్చాత్య దేశాలతో సంపర్కం వృద్ధి అయినకొలది రష్యన్, ఫ్రెంచి - ఆదిసాహిత్యాల ప్రభావం మనసాహిత్యం మీద, విశేషంగా కథాసాహిత్యంమీద, పడుతూనే వుంది. నవీనపాశ్చాత్య కథాసాహిత్య ప్రభావంవల్ల నేడు భారతీయకథాసాహిత్యం నవ్యరూపం దాల్చి సాహిత్యాకాశంలో దేదీప్యమానమై ప్రకాశిస్తున్నది. తెలుగు కథాసాహిత్యంకూడ యీప్రభావంవల్ల నవ్యరూపం దాల్చింది.

---

# కూరాకు పడుచు

శంకరంబాడి సుందరాచారి

నెత్తితడిసినకూరాకు; నీటిబొట్లు
జారిపడుట చీరతడిసె; చాలవేగు
మంచుపడుచుండె; చలిబాధ కించుకైన
నిలువనేరక కాయము విలవిలపడి
వడకుచుండెను—వడకుచు పడుదువేమొ!
 పరుగు లివి యేల? సుళువుగా నరుగు చెల్లి!
 కాలు విరిగిన కడుపుపై కత్తి, చెల్లి!

కడుపుమంటలు నిను లేపగలిగె గాని—
కరకుసూర్యు! కిరణాల చురుకునైన
నరకుసేయక, హాయిగా గురకలిడుచు
పడకపై పొర్లు సోమారిపడుచు లింక
తెరచియుండరు కనులు, నీనరకు కొనగ
 పరుగు లివి యేల? సుళువుగా నరుగు చెల్లి!

 కాలు విరిగినకడుపుపై కత్తి, చెల్లి!
వాడవాడల నడయాడి, వాడి మాడి,
అరచి యమ్మిన దొరకునో దొరకబోదొ!
కానికాసులు —— అందుకై లేనిపోని
 పరుగు లివి యేల? సుళువుగా నరుగు చెల్లి!
 కాలు విరిగిన కడుపై కత్తి, చెల్లి!

ప్రియునికౌగిలి విడనాడి, పెందలకడ
బెదరి లేచితి విందుకా! పిచ్చిచెల్లి!!!

---

# వార్ధావిద్యావిధానసింహావలోకనము

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

ప్రత్యక్షజీవితమునకును, సాహిత్యమునకును సఖ్య ముండు టెంత యావశ్యకమో, కఠోర దైనికసమస్యలకును, విద్యావిధానమునకును నేస్త ముండు టంత యావశ్యకమే! భారతభూమిలో నింతకుము న్నీమైత్రి మృగ్యమైయుండెను. సర్వతోముఖ సంస్కరణము కతన నీ లోపమును మార్పనవచ్చును. ఇందులకు నక్కఱగు శక్తిసామర్థ్యములు పట్టప్రదానమహోత్సవము ముగిసినపిదప నెందుండియో యెగిసి వచ్చి విద్యార్థుల యంతరంగములందు ప్రవేశింపవు. ఒకసుప్రభాతసమయమున మేలుకాంచి, విద్యార్థులు ప్రత్యక్షజీవితమునకు సంబంధించిన సంపూర్ణ విజ్ఞానమునకును, సముచితానుభవమునకును అవగతులు కాలేరు. పుస్తక ప్రపంచమందే నక్కియున్న అభాగులు పట్టభద్రు లైన యనంతరము బాహ్య ప్రపంచమునకు పరిచితు లెట్లు కాజాలుదురు? ప్రస్తుతము దేశమం దెల్లకడలందు ప్రబలియున్న నిరుద్యోగమును నిలిపిన బహుళ హేతువులలో (Plurality of Causes) పట్టభద్రులు తా మున్న ప్రపంచమును గుఱుతింప జాలకుండుట యొక్కండు సుడీ! ఎదుటి పరిస్థితుల నిజరూపములను గుఱుతించి వానితో పొందు గుదుర్చుకొనజాలు ప్రధాన జీవితకళను వీ రలవఱుచుకొనలేదు. ఆధునిక భారతీయులలో నీయంశమును చక్కగ గుర్తించిన మహనీయుడు గాంధిజీ. అట్లని యాతడు సృష్టించిన వార్ధావిద్యావిధానమే చెప్పక చెప్పుచున్నది. ప్రత్యక్ష జీవితసమస్యలను మార్పనవలయు శాంతియుత సాధనములను చదువరులు విద్యారంభమునుండి సిద్ధము కావించుకొనవలె నని యీ నవ్యవిధాననిర్మాత యుద్దేశించినాడు. సర్వసాధారణ దృష్టితో నుపలక్షించిన యెడల నీవిధానమును ప్రతిఘటించువారు పల్వు రుందురు. భారతభూమి ప్రస్తుతము ప్రదర్శించు దృశ్యమును పురస్కరించుకొని ప్రత్యేక దృష్టితో పరికించినయెడల, దీనిని ప్రతిఘటించువా రెందఱో యుండరు.

అక్కరములతోపాటు చేతిపనులను నేర్చుకొన మొదలిడి, యేడేండ్లలో బాలు రీ శిక్షణమును ముగింపవలె నని, వార్ధావిద్యావిధానము తెలుపుచున్నది. వడకుట, నేయుట వ్రడంగిపని, తోటపని మున్నగు చేతలు ఈ చేతిపనులు. పుస్తకము చేబూనుటే విద్య యందు టని యపోహపడువారి కీరీతి చేతిపను లొనరించుట విపరీతమై యుండుట నిక్కము. వ్యక్తిగతరుచిని పాటింపక, నిర్బంధవిధానమును బాలకులెల్లరశిరములకును గట్టు టేటిపాడి యని తలపకమానము. "ఈ పనులందే తనువులు గడప నర్హత గలవారు కొందఱు మాత్రమే యుందురు. పక్షివిశేషమున నియుత్తల వీథి కెగసి మధురగానలహరి నంతరిక్షమునుండి వసుంధరపై వర్షింపగల విహంగముల బోలు నైసర్గికప్రతిభాసమన్వితులు కొంద ఱుందురు. వీరిని కట్టుగొఱ్ఱులకు

బంధించియుంచు టేటిన్యాయ?'' మని ప్రశ్నింతుము.

భారతభూమియందు తలయెత్తి విజృంభించుచున్న పరిస్థితుల నొకకంటను, వార్ధా విద్యావిధానము నింకొక కంటను జూచుట పాడి. వాని నెదుర్కొనుటకు అక్కరైన సాధనము సుమారు నూఱేండ్లనుండి యెద్దియును మనకు దృగ్గోచరము కాలేదు. సాధారణదృష్టితో నుపలక్షించి యీనవ్యవిధానము నాడిపోయు పెద్దలు కంటబడుచున్నారు. కాని మనల నింతకు దెచ్చినపరిస్థితుల నెదిరించుటకై వలసిన వ్యవస్థను చూపగలవారెవ్వరును అగపడుచుండుట లేదు. అది కూడదని విన్నకొనియుండువారును, విధ్వంసవిమర్శనమున సిద్ధహస్తులైనవారును చేయుగలమే లేది? ఉన్నతపరిశోధనపై పిడ్రిగుడు ప్రయోగించువారి నెడరించు టెంత ముఖ్యమో కలకత్తా విశ్వవిద్యాలయమును బోలు మహాసంస్థలదెస నెడమొగములను పెడమొగములను బెట్టువారిని గర్హించు టెంత అక్కరైనదో, తక్కిన ప్రక్కలనుండి దండెత్తివచ్చు ముక్కడి యిక్కట్టులను గ్రక్కున నెదుర్కొనుటయు నంత యక్కరైనదే! ఈ యవార్యప్రతిఘటనమునకు అనివార్యముగ నావశ్యకమైన సాధన మొక్క వార్ధా విద్యావిధానమందే ప్రస్తుత మగపడుచున్నది. రోగము నిలిచినంతకాల మౌషధసేవనము జరుగుచుండవలెను. "వార్ధావిద్యావిధాన మౌషధసేవనముం బోలు తాత్కాలిక వ్యవస్థ మాత్రమేనా?" అని ప్రశ్నించువారుందురు. చిరస్థాయి యగుట కిది సముచిత సంస్కరణ మంది క్రమవృద్ధికతన నాత్మసిద్ధి గమచుండవలె నందును.

వ్యక్తిగతమైన శక్తి, ప్రత్యేకమైన అభిరుచిని చాలకాలమునుండి అమలులో నున్న మన విద్యావిధానము పాటించుచున్న దని తలచుట తప్పు. ప్రతిభారహితులుకూడ పెద్దచదువులదరికి బోయి త్రెళ్లుచున్నారు. ప్రతిభాన్వితుల సదాశలను, మేలిపులుగుల రెక్కలను ముక్కలుచేసినట్లు నఱకు పెట్టి యకృత్యమో, ప్రతిభా శూన్యులను తగని తెరవుల జొరనిచ్చుటయు నట్టి యకృత్యమే! మనదృష్టి నాకర్షించుచున్న దోషము కుత్తుక మీది కురుపువంటిది. శస్త్రచికిత్సవలన గాని కురుపు మడియదు. కాని పదునైనకత్తి కంఠముపై కడుజాగరూకతతో చలింపవలెను.

ఏ విద్యావిధానమైనను కేవలము చేతిపనుల కార్ఖానాసై యుండరాదు. అక్కరైన మానసిక ఆధ్యాత్మికాభివృద్ధి కీ విధానమున నిక్కమైన స్థాన ముండవలెను. ఈ యభివృద్ధి మార్గమున ముందంజ వేయజాలు సహజ ప్రతిభాసమన్వితులైన బాలకులను గుర్తించి, తరువాతి తెరువుదెస వారికి చేసన్న చేయగల ఆచార్యులే,— జీవితజలధి జాలినంత యనుభవ మందిన గురువులే వార్ధా విద్యావిధాననౌకను నడపు కర్ణధారులై యుండవలెను. "చేతిపనులనే పరమావధి జేసికొను" డని యీ విధానపాలకులు తెలుప సాహసింతురా?

ప్రజ్ఞాధురీణులెందరెందఱో మన నేలలో నేడు కూడు గుడ్డల నందక అల్లాడుచున్నారు. వీరి గ్రంథరచనా కౌశలముగాని, వక్తృతానైపుణ్యముగాని సుడిగుండమునుండి వీరిని రక్షించుచుండుట లేదు. ఊరక నిట్టూర్పులూర్పుటకంటె, తమను గుర్తింపజాలని జడు

లను సేవించి నాలుగుపైసలను పడయుట కంటె, బుద్ధిని స్వాతంత్ర్యముపై నిలిపియు ప్రారబ్ధము దాస్యమున గూలద్రోయుచున్న దని యిచ్ఛకును, తమ ప్రకృతికిని ప్రతికూల మైన చాకిరులను "దేవుడా! ఏమి గతి దెచ్చి పెట్టితి"వని లోలోన నేడ్చుచు జేయుటకంటె క్రొత్తలెన్ను ద్రొక్కు సాహిత్యోపాసకులు చేతిపనులందు సహజప్రజ్ఞను గాకమానె గౌరవమును, స్వాతంత్ర్యమును గాంచగలరు. ఆత్మవృద్ధికి శరీరము నిమిత్తమగునట్లు, ఉన్నత వైజ్ఞానికాశయసిద్ధికి (ఒక భోజుడుగాని ఒక కృష్ణదేవరాయలుగాని లేనికాలమున, ఒక అక్బరుగాని ఒక పెరికిల్సుగాని లేనిసమయమున) గృహపరిశ్రమలు (ఉత్కృష్టాశయ సిద్ధికైనను, భౌతిక జీవిత నిర్వహణము జరుగుచుండవలెను గావున)నిమిత్తము లగును. నేటి నిరుద్యోగులు చేతిపనులను నేర్చియుండినచో, వీరు తయారొనరించు సామగ్రి తప్పక విక్రయమగు వ్యవస్థను పాలకులు నిలిపియుండినచో, దీనారవములుగాని, హాహాకారములుగాని చెవుల బడునవి కావు. వార్ధా విద్యావిధాన మట్టి ప్రబోధమును, ప్రజాప్రభుత్వము లిట్టి వ్యవస్థను (యంత్రయుగము తెలుపు మాటను బారుగ చెవినుండి తలుపుక, అంతర్జాతీయ సంబంధములను త్రోసిరా జనక, అధునాతన నాగరకతను పూర్తిగా గసరికొట్టక) స్థాపించుచో లలితకళోపాసకులు, తమ కళల కతననే తమ యాయువును నిలుపజాలు ఆర్థిక తరణోపాయము నందనితతి వాని నాదరించి "బ్రదుకు జీవుడా!"యని మహాత్ముని పవిత్రనామమును పలుమారు పునశ్చరణ మొనరించెదరు

కలమునకును హాలమునకును తప్పనిసరియైన సంబంధమున్నదని తలపరాదు. కాని మాడిమాడి మడియుకవికి సన్నిహితమైనది ఆత్మగౌరవవినాశనకరమగు యాచనమును, దాస్యమును, గ్రుడ్డి పొగడ్తయును గాక సేద్యమే యగుడు కలమునకును, హాలమునకును గౌరవప్రదమైన చుట్టరికము కలదని తలపజెల్లును. వ్యాసవాల్మీకులును, కాళిదాస భవభూతులును కలమునే పట్టిరి గాని హాలమును గాదు. కాని పోతనకవి కలముతో పాటు హాలమునుగూడ చేబూని, హాలికుడై కందమూలగౌద్దాళికుడై, స్వతంత్రజీవియై, చిరారాధ్యుడు కాలేదా ?

కవి యనుడు, మరేకళోపాసకు డనుడు, మరెట్టిప్రతిభావంతు డనుడు,—భావప్రపంచమున మంత్రశక్తి గలవారే యగుదురుగాక ప్రత్యక్షప్రపంచమందలి కఠోరసమస్యల నుపేక్షించి వీరు నిముసము నిలువజాలరు. తక్కుంగల విద్యార్థులవలె వీరును దొలినుండియు వీని నుపలక్షించుచుండవలెను. ఈ యంశమును విద్యార్థిలోకమునకు జ్ఞప్తికి దెచ్చునది కావున గొంత సంస్కరణము నందినపిదప ప్రస్తుతప్రతికూలపరిస్థితులను క్రమక్రమముగ బోకార్చగల స్వతస్సిద్ధమైన శక్తి గలది కావున వార్ధావిధాన మాచరణీయమైన దని వాకొందును.

సంస్కరణము నందవలె నంటిని. ఈ సంస్కరణమునకు సంబంధించిన వేర్వేరు విషయములను విమర్శించుట కిందు చోటు లేదు. ఒక్కయంశమునుమాత్రము ప్రస్తుతము పరిశీలింతును.

ప్రయిమరీ సెకండరీవిద్య లేడేండ్లలోనే ముగియవలె ననునుద్దేశము వార్ధావిద్యా

విధానాచార్యులకు గలదని తోచెడిని. దీనిలో నాంగ్లమునకు చోటు లేదు. సెకండరీవిద్య ముగిసిన వెంటనే విశ్వవిద్యాలయవిద్య ఆరంభమగును. విశ్వవిద్యాలయమందలి శిక్షణము న్నతమైనదై యుండవలెనుగదా! ఇందాంగ్లమునకు తప్పక తావుండవలెను. ఆంగ్లము నేడంతర్జాతీయభాషలలో నగ్రస్థానము నందినది. అనివార్యమైన అంతర్జాతీయ సంబంధములకు దీనియందలి యభిజ్ఞత అవార్యమైనది. కావున నే స్వతంత్ర దేశములుకూడ తమవిద్యాప్రణాళికలలో దీనికివలసినంత ప్రాముఖ్య మొసగినవి. మనము నేఱు తెరువు ద్రొక్కరాదు. తొలుత మాతృభాషను, పదపడి హిందీని, తదనంతర మాంగ్లమును నిలిపి సంస్కృతముతోపాటు మన విద్యావిధానమున వీనికై తగు శిక్షావ్యవస్థను నెలకొలుపవలెను. విశ్వవిద్యాలయమందలి ఉన్నతబోధకు మార్గదర్శకము కాజాలు సముచితశిక్షణము ఆంగ్లమునగూడ సెకండరీవిద్యయందు గావలెను. కావున నేడేండ్లలో కడముట్టువిద్యలో నాంగ్లము ప్రవేశమునందజాలనిచో, విశ్వవిద్యాలయవిద్య ఆరంభమగుటకుమున్న మఱి కొన్నేండ్లు ఆంగ్లాది విషయములందు అక్కరైన ప్రబోధము జరిగితీరవలెను. వార్ధావిధానవిద్యకును విశ్వవిద్యాలయవిద్యకును నడుమ నుండవలయు నీ యేండ్లు సెకండరీవిద్యాపరిమితికి జేరవలెను. కావున నేడేండ్లలోనే సెకండరీవిద్య ముగియరాదను నంశమును వార్ధావిధానాధికారులు గమనింపవలెను. బాలురు చేయువస్తువులమీదిరాబడి ఉపాధ్యాయుల వేతనము కావలెనను భావ మీవరలో తల యెత్తినది. చేయబడిన చేతివస్తువులు చెల్లుబడియగుట ముఖ్యమే కాని వీనిమీదిమొత్తముమీదనే యీవిధాన పోషణ మాధారపడియుండవలె నని నిర్ణయింపరాదు. జ్ఞానసంపాదనమునకు కొంత శారీరకచలనముకూడ అవసరమైనదని మహావిద్వాంసు లందురు. ఈ యాశయమునకు వార్ధావిధానము చేయూత నిచ్చుట నిక్కమే! కాని యిందు దుల్లేఖింపబడిన తెరగులందును, బుద్ధిమంతులు నిర్దేశించు తదితరరీతులందును నిది తప్పక సంస్కరణము నందవలెను. మహాత్ము డీ సంస్కరణమున కడ్డునిల్చువాడు కాడని నా యాశ.

ఈ విద్యావిధానమునకు సంబంధించిన వివిధాంశములను గురించి పల్వురలో నభిప్రాయభేదము లుండవచ్చునని పాఠకు లెఱుంగుదురు. ప్రత్యక్షజీవిత సమస్యల నెదుర్కొనుటకు నక్కరైన శాంతియుతపరికరములను విద్యారంభమునుండి చదువరులు తయారుకావించుకొనవలె ననునుద్దేశ మీవిధానమందు గలదని యెంచువారును ఈరీతివిధానము నపేక్షించువారును దీనిపై వక్రకటాక్షమును సారింపరని పత్రికలు గ్రహింపగలరు.

# విశ్వగానము

శ్రీ ఆదిభట్ల రామమూర్తి

అది నితాంత వసంత హృదంతరంత
రనుభవైక సుఖాస్పదమౌ ప్రభాత —
మదియె గాంధిజి విజయశంఖారవమ్ము
వైరిజన కర్ణయుగ్మవిదారణమ్ము;
అదియె మురళీ నినదమంజులార్ద్రగీతి,
భక్తకోటికిఁ బ్రీతి; అల్లదిగో! యతడు
వేణునాదమ్ముఁ గావించి విశ్వమెల్ల
హాయి నుయ్యాల లూగించునప్డు ప్రకృతి
తన్మయతఁ జెంది మధురగీతమ్ముఁ బాడి
స్వాగతం బిచ్చుచుండె, సుస్వాగతమ్ము!!

కాలవాహినిలోన షికారొనర్చి,
హృదయకాసారమందుఁ బరిభ్రమించి,
భావసంచలదూర్మికావళిఁ జరించి,
ఆననాబ్జంపు సౌరభ మానియాని,
ప్రేమగీతామృతమ్ము సేవించి, తన్మ
యత్తచిత్తత గాంధీమహాత్మకీర్తి
గానరసపూరమున మలయానిలమ్ము
దొప్పదోగు సతమ్ము సంతోషగరిమ!!

హారనీహారపాండురాస్యప్రకాశ
శోభితార్ణవనీరవిశుద్ధభంగ
సముదయోద్ధూత రమ్యతుషారభావ
గర్భితాహ్లాదనినదచక్రచయము, లని
శముమహాత్ముని సితయశశ్చంద్రికలను
నవ్యమోహనవిశ్వగానమ్మొనర్చు!

భావనాతీతనిర్మలాంబరతలస్థ
చారునక్షత్ర గోళసంచారజనన
కారణాకర్షణ ప్రభాసారలీన
మంజులారవ మనిశ మమందగతిని
కర్మయోగీంద్రు దివ్యవిజ్ఞానజనిత
రాగసాగరపూరనిర్మగ్న యగుచుఁ
గాలగర్భానఁ గూనిరాగాలఁ దీయు
ఉదయరాగపరాగసముజ్జ్వలత్ప్ర
కాశశోభిత నిర్మలాకాశమధ్య
విహరణానంద సౌభాగ్యవీచికల, వి
లాసగతి దోఁగి, మోహనాలాపగీతి
శ్రావ్యతమమగుఁ గలకలారావమందుఁ
బల్లవి యొనర్చి, పంచమస్వనముతోడ
నండజచయమ్ము గాంధీమహాత్మకీర్తి
లలన మేల్కొల్పి, భక్తి సలా మొనర్చు!!

మానసాహ్లాదకారణానూనబాల
భాస్కరోదయ కిరణలావణ్యపుంజ
భరితనీహారబిందుశోభాకరసుమ
దళ మధుమరందపానతత్పరతఁ, గారు
మొయిలు రెక్కల నల్లార్చి, ప్రియు మెసంగ
నళికుమారుఁడు కుసుమకోమలులతోడి
వలపుచెరలాటమునఁ బరిమళము మేన
నలఁదుకొని, మోదపారవశ్యాన, దేశ
నాయకుఁడు కర్మయోగీంద్రుఁడే యటంచు
అహరహమ్మును క్రమగీతాళిఁ బాడు!

అరుణతరణికిరణవార సురుచిర ప్ర
భాసమన్వితరోచీవిలాసమాత్తి
కాదృశ(?)స్నిగ్ధ తరళనీహారకణవి
రాజితోన్నత తరుపర్ణరాజి, మకుట
హీనసర్వంసహామండలేశ్వరుండు
అతఁడె "సెయిగను కర్మసన్యాసి" గాంధి
యంచు లోకాలఁ బర్వ సనాతభూది
గంతవిశ్రాంత విజయశంఖారవమ్ము
శ్రవణపర్వంబుగా, సంతసమున సుప్ర
భాతమందు నానందబాష్పాల రాల్చు !!

పర్వతతటమ్మునందు నుద్భవముఁ జెంది,
జిలుగుఁ దలిరాకుఁ జొంపపు నెలవులెల్ల
మధురశీతల వాఃపూరమయ మొనర్చి,
పండుటాకుల గలగలస్వనముతోడ,

గరగరం జారు చిఱుగాలి కెరటములను
క్రమలహరీ విలోలభంగాల సెలలు,
గాంధిజిమనోజ్ఞ వేణుసంకాశవాగ
మృతముఁ గ్రోలుచు, రాల్గరగించురీతి
చిందు లొనరించి పాడు, స్వచ్ఛందగీతి !!

వింతపుష్పాలతోడ వసంతలక్ష్మి
కమ్మనెత్తావిపుప్పొడుల్ గ్రుమ్మరింప
లలితసాలరసాల పల్లవసమూహ
ఖాదియై చొక్కి, హృదయవికాస ముదయ
మొందఁ, గోకిలయుఁ "కుహూ కుహూ"
యటంచుఁ
దీయమామిడిగున్నపైఁ దేనెపాట
లొలుక నెలుగెత్తు, గాంధిజిపలుకుఁ దేనెఁ
ద్రావి సంతోషపరవశత్వాన హాయి !!



# దాటు తాడి

శ్రీ కవికొండల వేంకటరావు

ఊరిపేరేదైతేం - ఊరు, ఊరావల ఏరు, ఏరవల ఊర్లంకపాలం, పాలంలో బలరామరాజు ఇల్లు, వ్యవసాయం, పాడి, పంట, కాపరం, వ్యాపారం, - ఇన్నెందుకు చదవడం - పాలమే బలరామరాజు, బలరామరాజే పాలం: ఊర్లోకి బలరామరాజు వెళ్లినజాడే అరుదు.

బలరామరాజు అంటే ఎవరో ఏవర్ణపు మనిషో కాడు: పేరైన క్షత్రియ కుటుంబీకుడు. అతని భార్య పేరు కామయ్య. రాజుకూ కామయ్యకూ సంతానం ఎనమండుగురు మగపిల్లలు, నలుగురు ఆడపిల్లలూను. ఆడపిల్లలందరూ అత్తవారిళ్లకు కాపురానికి వెళ్లిపోయినారు. మగపిల్లలు వొకడుత్తర పొలాన్ని, వొకడు దక్షిణ పొలాన్నీ, వొకడు మెరక పొలాన్నీ, వొకడు పల్లపు పొలాన్నీ ఇలా సర్దుకుని అందరూ కంఠతాలుమీద పెత్తనం వహించుకున్నారు. ఇంటిపట్టున ఊర్లంకపెట్టున బలరామరాజు కామయ్య దంపతులిద్దరుమట్టుకే వుండడం పరిపాటి.

పొలంలో ఇల్లని చుట్టునుకోని వెయ్యలేదు రాజు. మహా పెద్ద భారీభవనం కట్టాడు. భవనానికి తగ్గ పెరడు ప్రాంగణం వుంచాడు. సింహద్వారాని కిటూ అటూ చక్కటి నున్నని నల్లటి నిగనిగలాడే గచ్చు అరుగులు, ఎంతమంది వచ్చి కూర్చున్నా ఇబ్బంది లేదన్నట్టు తయారు చేయించాడు. ఆ అరుగులే చాలు ఇంటి యొక్క రాజభోగం చాటి చూపించడానికి.

ఓ శుక్రవారప్పొద్దులానుంది, బలరామరాజు, వేసంగికి కితకట్టుకూ దోపంచుగోజుల్లో, పడినంపు అరుగుమీద అప్పుడే దంతధావనం గావించుకు, ఉత్తి మామిడాడ చెంబుమీద చెయ్యి ఆంచుకుంటూ చెంబు చేతపట్టుకు లేచినాడు, తనాటీ ఎత్తుకూ!

వాకిటలోకి 'పింగళిసిద్ధాంతి' అనుపేర బరగే బ్రాహ్మణు డొకాయన వచ్చి "రాజా! లోపలకు వెళ్లిపోకు. ఆ చెంబు ఎంతకొన్నావు? బంగారపుదా ఇత్తడిదా?" అన్నాడు. రాజు "తంపకే చిత్తగించండి!" అని ఆ బ్రాహ్మణునకు నమస్కారమైనా పెట్టకుండా, బ్రాహ్మణ్ణి కూర్చోమనైనా కనుసంజ్ఞ కానీకుండా, నుంగిటనున్న బ్రాహ్మణునకు తా నరుగుమీద వుండే అలా అందిచ్చాడు, తన చేతిలోని మామిడాడ చెంబును. సిద్ధాంతి అందుకుంటూ అలాయీలా చెంబు చూచి "చూడు! రాజా! ఇది నా కిచ్చివేస్తివా వడ్డీ క్రింద రెండు రూపాయలు జమ కట్టించినవాడ వవుతావు!" అని రాజు సెలవును ఎటకారంగానే అడిగినాడు గావున, రాజు సెలవు ఇవ్వకుండానే ఆ చెంబు చేతపట్టుకుపోయినాడు సిద్ధాంతి.

రాజు మాట్లాడలేదు. మీసం దువ్వుకుంటూ నట్టింటిలోకి వెళ్లిపోయినాడు. రాజుభార్య కామయ్య రాజును చూస్తూనే "ఏమండీ! చెం బేంచేశారు? మామిడాడచెంబు? దాసీది తోమడానికి కనిపెట్టు కూర్చుంది" అంది. రాజు "పింగళిసిద్ధాంతి పట్టుకుపోయినాడు" అని ఓబికమైన రిత్తచూపు చూచాడు. కామయ్య "వాని కేం పొయ్యేకాలం వచ్చింది. ఇదేల కుక్కరోరపొద్దు. పైపెచ్చు అది మా పుట్టింటారు సారెలో పెట్టిన చెంబు. మీ కియ్యాలని ఎలా బుద్ధి పుట్టింది. పింగళిసిద్ధాంతి అంటే ఎవడు? ఎందుకు వచ్చాడు? వానితో మీ కేం పని?" అంది. బలరామరాజు "అసలు శుభూమీపుత్రా ఇదంతా ఎలా వచ్చింది అనుకున్నావు? పింగళిసిద్ధాంతి బదులివ్వబట్టే! నేనేం గొప్ప తవ్వి గొయ్యి తవ్వి మిఠాల్చిచచ్చానా ఏనాడైనా? ఆ డిచ్చాడు, నే తెచ్చాను. విన్నావు? విన్నావుటే?" అన్నాడు ఘట్టిగా మండువామీది ఆకాశం మాఱుమోగేటట్టు. "అంతేడబ్బు ఆయన కివ్వడానికి ఆ సిద్ధాంతి కెలా

వచ్చింది?" అని అడిగింది కామయ్య, మెళ్లో మేలిం మిరియాల పేరు సవరించుకుంటూ. "ఎరగవంటే! అంతా మఱచిపోయినావు? మన పెళ్లిలో సదస్యసంభావన కోసం, ఓ సిద్ధాంతి లిక్కిలా నడుం వేసుకు, సుద్ద లా వాడు! వానికి పెద్దలు పెళ్లి చేసిన యీ వెనక పెద్దల మీద కోపం వచ్చి కాశీ పాఱిపోయినాడు. ఆకో జల్లో గంగలో నిలబడి యిలా చెయి సాపితే బాపనయ్యలకు పైనుండి కనకవర్షం కురిసేదట! దోసిట్లో పోసేవారట మొహరీలు కాసులూ విశ్వేశ్వరుణ్ణి చూడవచ్చిన యాత్రికులు. అలా సంపాదించిన సంపాదన అంతా యీసిద్ధాంతిముండాకొడుకు ఇక్కడకు పెళ్లాం పేరట మని ఆర్డరు కట్టి, అడబ్బు నావొక్కడికే బకులిమ్మని పెళ్లాంకు వుత్తరాలు వ్రాశాడు. పెళ్లాం నన్నొకరోజున కబురంపించి సంగతి చెప్పి, "రాజూ! నీవల్లను ప్రోనోట్లు వ్రాయించుకుని నీకే యిమ్మన్నారు బదులుగా మా ఆయన గరణ అంతాను. మళ్లీ యిస్తావో యెగవేస్తావో బాగా ఆలోచించుకుని, తెల్లవాఱగట్ల రా! వెయ్యి రూపాయలకు ప్రోనోటు వ్రాసి తీసుకురా!" అంది. అంటే ఎకో వైకుంఠం వొలికిందని భావించి మనమామిడాడి చెంబుచ్చుకు ఆ తెల్లవాఱగట్ల వెళ్లి ఆ వెయ్యికి ఆమె చెప్పినట్లు నోటు వ్రాసియిచ్చి తెచ్చాను. తీసుకు వచ్చి వెంటనే కొన్నపొలమే ఉత్తర పొలం. మఱి నెల్లాళ్లకు మఱో వెయ్యి, మఱి మూణ్ణెల్లకు మఱో వెయ్యి యిలాగ్గా ఏడైవేలు పట్టుకొచ్చాను: ఎలా తెస్తేం. వేశే రూపాయలు లెక్కపెట్టనంలేదు. నీ మామిడాడి చెంబునిండా పోసేది ఆ యిల్లాలు రూపాయిలు, వెయ్యిరూపాయిలూ నా లెక్కకు టకీమని సరిపోయావి. ఆలా చెంబు వెత్తి లేకుండా పడమటూవుహా లట్టుకొచ్చినట్టు పట్టుకొచ్చి కొన్నాను సుక్షేత్రఖండికలు దక్షిణపొలం, తూర్పు పొలం, చెప్పన్న పొలాలు మన కిప్పుడున్న రెండువందల యెకరమూను —". కామయ్య వింటూ "ఆ ముండా బ్రాహ్మడు మళ్లా రా డనుకున్నారా? వళ్లా డబ్బు అడగ డనుకున్నారా?" బలరామరాజు "మనిషి అయినవాడు ఎవడూ అలా అనుకోడు. ప్రతీవాడూ తాను తెచ్చిన అప్పు తీర్చి వేదామనే ఊహిస్తాడు. తీర్చగలననే అనుకుంటాను. అయితే కాలమానం తిరుగబడిపోతే బ్రహ్మదేవుడుమాత్రం ఏం చేయగలడు? ఎకరం రెండువేలు పెట్టి కొన్న బంగారంలాంటిభూమి యిప్పుడు రెండువందలు చెయ్యడం లేదు. కొనబోతే కొరవి అమ్మబోతే అడవి గానూ వుంది. మఱిన్ని ధాన్యంధర, అపరాలధర సగానికి సగం తగ్గిపోయింది. పన్నుల బాధ హెచ్చిపోయింది. అయినా యీ ఘడియదాకా తీరుద్దామనే సదుద్దేశ్యంతోనే వున్నాను" — అని పళ్లు పటపటకొఱికినవాడై, లోపలి త్రుళ్లు పైకి వెళ్లబుచ్చుతూ ఇలా అన్నాడు. "కాని యిప్పుడు ఆ వెధవ! ఆ దరిద్రదేవత! పీనుగుమీద డబ్బు లేరుకునే పీనాసి! వాడు వాచేతిలోని నిక్షేపంలాంటి చెంబు పుచ్చుకొని వడ్డీక్రింద జమకట్టుకుంటా నన్నాడే! ఆఘడియలో నామనస్సు మాఱిపోయింది. చెంబు ఎలా వడ్డీక్రింద జమకట్టుకుంటాడో మాస్తాను" అన్నాడు. "జమకట్టుకు ఇంట్లో వుంచుకుంటాడా? యింటింటా తిరిపె మెత్తుకునేవాడు కాదూ ఆ బ్రాహ్మడు? నా చెంబు చేతపట్టుకు తిరిగాడా అంటే మనపరువు ఎక్కడుంటుందో? అదికూడా కుసింత యోచించండి మీరు" అంది కామయ్య.

"ఆలోచిస్తూనే వున్నాను. అన్నీ ఆలోచిస్తూనే వున్నాను" అంటూ ఆరుబయట పెఱట్లోకి వెళ్లిపోయినాడు మీసం దువ్వుకుంటూ బలరామరాజు.

పెఱట్లో యిద్దఱు మాలవాళ్లు పాలేళ్లు చింతచెట్టొకటి పడిపోయిందంటే దాన్ని వంట చెరుగ్గా చెలుపుతూ వున్నారు. వాళ్లు కొడుతూవుంటే తాను ఎండదెబ్బ తగ్గకన్నట్టు కడగా వోతుమ్మ దుంగమీద కూర్చుని ఏదో ఆలోచిస్తూ వున్నాడు బలరామరాజు. అతనికి వచ్చిన ఆదురహంకారానికి మఱి మేరలేదనుకోవలసిందే. అతని చూపెంతసేపూ అక్కడ పనిచేస్తూ వున్న గొడ్డళ్లమీద, పనికి సిద్ధంగావున్న సునపం, పార, పోటికత్తి యిత్యాదులమీదికే వులికలేస్తూ వుంది కాని అహింసాస్థాయిని కనిపించే ప్రకృతిలోని పుష్పం మీదికిగాని పత్రంమీదికిగాని పోవడంలేదు. కూర్చుని కూర్చుని లేస్తూ మాలపాలేళ్లను ఇద్దర్నీ "మాలబొలం చేనిగట్టుకు గొడ్డళ్లతో సాయంకాలం రండ్రా!

మీ బిడ్డలూ మఱచిపోకుండా!" అని ఆజ్ఞాపించి విసం దువ్వుకుంటూ యింట్లోకి వెళ్లిపోయినాడు. కాలు కాలినపిల్లిలా వొళ్లు తెలీకుండా తిరుగుతూవున్నాడు బలరామరాజు నాడు పట్టింట సందెసువ్వాలు తుడిచే వేళదాకా.

భార్య కామయ్య అప్పటి కప్పుడే చాటుగా దాసీదానిచేత తన పుట్టింటారింటికి కబురెట్టింది. తన అన్నగారైన "వెంకటేశ్వర్రాజు"ని వెంటనే ఎనభైవేల రూపాయలు తీసికొని రావలసినదిగా వర్తమానించింది. ఈ సంగతి కించిత్తూ బలరామరాజు ఎఱగడు. భర్త ముఖం చూస్తే మాట్లాడే కళ్యాంగాకుండా వుంది. ఏమి చెప్పినా ప్రయోజనం లే దనుకుంది రాచముత్తైదువ.

* * *

అక్కడ అనగా ఊరిలో తనయిల్లు చేరుకుని పింగళసిద్ధాంతి తా జేసిన ఘనకార్యాన్ని భార్యకో చెప్పినవాడై, భార్య చేతికి తాను తెచ్చిన మామిడాడ చెంబు ఇచ్చి దాన్ని పరిశుభ్రంగా వన్నె వచ్చేటట్టు తోమమన్నాడు. భార్య ఆ చెంబు తీసికొని "యింట్లో తోమి వున్న చెంబులు పనికిరావు? ఇప్పుడిది తోమి యిచ్చేదాకా అంత హాజరుజవా బేమొచ్చె?" అంది. అని తెచ్చిన చెంబు చూచి, దానిమీద కామయ్య పేరు పోల్చిందై, "బలరామరాజుగారి కామయ్యగారి చెంబులావుందే ఇది? ఇది మీ చేతిలోకెట్లా వచ్చింది? ఆమె బాగా వుందా?" అని అడిగింది. సిద్ధాంతి "బాగుండకేం! దీర్ఘసుమంగళి ఆమె! మేలిం మిర్యాలపూస లేసుకుని తలుపోరగా నన్ను చూచి తలుపేసుకుంది. ఆమెకేం? ఆమె బాగానే వుంది" అన్నాడు. "అయితే యీ చెంబు మీ కెలా వచ్చింది? బలరామరాజు ఇచ్చాడా? అని అడిగింది. "ఇస్తాడూ వాడై? నే పట్టుకొచ్చాను. నే నెత్తుకొచ్చాను. నాకు పదివేలకు పైగా వడ్డీ యివ్వవలసిన వాడు వొక్కరాగిపైసా యివ్వకుండావుంటే, వొళ్లు మండిపోయి వూళ్లాక్కొచ్చాను. ఏం! అలా మిడుతూ మిడుతూ చూస్తావు? నీకు నచ్చలే నాచర్య" అన్నాడు పింగళసిద్ధాంతి. "అవునులేండి, పట్టుకు వెళ్లినప్పుడు" చెంబు పరికిస్తూ చేతిలో తిప్పుకుంటూ- "దీంతోనే కొల్చిచ్చినట్టు పట్టుకెళ్లేరు రూపాయలు ఆరాజుగారు!" "రాజుగా రంటావు! నీకింకా రాజులంటే మోజు పోలే. ముద్దుముండకానా! యింకా తోమావా లేదా చెంబు? ఈ చెంబుద్చుకు ఊరంట ముష్టెత్తి అందరికీ చాటిస్తా ఫలానావాళ్లది యీ చెంబు" అని అన్నాడు భర్త. భార్య "శాంతించండి" అంది. అని ఇంకా బోధించింది ఇలా: "నిన్నను పత్రికలు చూచికూడా వైఘా యిత్యంలోకి దిక్కండి. రాజుగారు వ్రాసియిచ్చిన నోట్లన్నీ ౧౯౩౧ లోవి ౧౯౫౯ లోవీని. ఆయన వల్ల మనకు వడ్డీ దమ్మిడీ రాదు. నేను ఆయన భార్యతో మాట్లాడి మీకు అసలును కట్టేటట్టు చేస్తాను. ఇది నా పూచీ! పాపం! ఈ చెంబుమీద ఆయిల్లాలు పే రుంది చూచారా! మఱి మీరు నన్ను ఏమనుకున్నా సరే! మీరు కాశీలో వున్నన్నాళ్లూ నాకు ఆమె ఆమెమగడే దిక్కయ్యారు. వాళ్ల పరువు తీసెయ్యకండి" అని బతిమాలు మొగంవేసింది. పింగళసిద్ధాంతి "మఱి అల్లాగయితే, రెండో కంటివానికి తెలియకుండా నే నెల్లా తెచ్చానో చెంబు, అలాగ్గా చెంబు మళ్లీవాళ్లకు ఈ రాత్రి వొప్పచెప్పిరా! అసలు నీ వేలా యిచ్చావో ఎంత యిచ్చావో అంత సొమ్ము ఆలా పట్టుకురా!" అన్నాడు సిద్ధాంతి. అని పాత కొత్త దూతగళ్ల దళసరి తాటాకు చాపమీద జములుదుప్పటీ తన్ని పెట్టుకు పనుకున్నాడు.

* * *

దీపదీపాలవేళ సిద్ధాంతిభార్య రాచవారి చెంబు చేతపుచ్చుకుని అలా అలా ఏరు దాటి ఊరలంక చేల గట్లంట బలరామరాజుగారి లోగిలి చేరుకుంది. బలరామరాజుగారు ఇంటివద్ద లేరు. కామయ్యసోదరుడు అప్పటి కప్పుడే కావళ్లమీద ఎనభైవేలరూపాయలు మోయించుకు లోగదిలో దింపించి లెక్కెస్తూవున్నాడు. సోదరి అతగానికి తనమగని అప్పయొక్క యావద్వృత్తాంతం వచ్చచెబుతూ వుంది. బ్రాహ్మణి- "రాజుగారు ఇంట్లో వున్నారా?" అన్న గొంతు విని "ఎవరు వారు?" అంది కామయ్య. "నేను పింగళవారికోడల్ని" అంది సిద్ధాంతిభార్య. అని "మీ మామిడాడ చెంబు మఱిపోయి మా యింటాయన ఈ యుదయం మీ వారిచేతిలోంచి తీసికొన్నారట. మీ కిచ్చివేయడానికి వచ్చాను" అంది.

తన పారచెంబు తిరిగి వచ్చిందని వినీవినడంలో కామయ్య హెచ్చరిల్లింది. "అన్నయ్యా! ఉండు!" అని సోదరుణ్ణి ఆపి, వీథితలుపు తీసింది. తీసి "మీరేనా సిద్ధాంతిగారి భార్యగారు? మీరే వచ్చారా కష్టపడి యీ రాత్రిపూట, ఏరు అందిందా?" అని అడిగింది కామయ్య. "ఇప్పటికి అందుతూనేవుంది, మఱిపయిని అందదేమోగాని. ఇదిగో తల్లీ! మీ మామిడాడ చెంబు. ఇదిగో మీ పేరు. చూచుకోండి. కొత్తగా వచ్చిన "రైతుఋణనివారణచట్టం"ను గురించి నిన్న విన్నప్పటినుంచీ మావారికి మతిపోయింది. అసలు సొమ్మైనా దక్కుతుందో లేదో అని జిజ్ఞాసందేహంలో పడి ఇలాంటి ధూర్తప్పని చేసినారు. క్షమించండమ్మా! ఇది మీపార చెంబుగా తోస్తుంది" అంది, చెంబు కామయ్యకు అందిస్తూ.

"దానికేంగాని మీరు సమయానికి పట్టుకొచ్చారు చెంబు. ఈ చెంబుతో నేలగా మీరు కొల్చిచ్చేరటగా మా ఆయనకు అప్పు; మీ రేలా కొల్చి యిచ్చారో అలా తీసికోండి. అదేగా యిప్పటి 'లా'" అంది కామయ్య. సిద్ధాంతిగారి భార్య "నే కొల్చి పోసిరుంటే వొకటే మీరు కొల్చిపోస్తే వొకటేనా? మీరే కొల్చి ఏభై చెంబులూ పొయ్యండి యీ చెంగులో" అని కొంగ గట్టింది. "యిక్కడ కాదు గదిలోకి రండి. గదిలో వున్నాయి రూపాయలు - అన్నయ్యా! తప్పుకో" అని కేకేసి సిద్ధాంతిగారి భార్యను ఆలోచన గదిలోకి కామయ్య తీసికొనివెళ్లి రూపాయలరాశి చూపెట్టింది. ఎన్భైవేల రూపాయలరాశి చూచేసరికి సిద్ధాంతిగారిభార్య కళ్లన్ని చెదిరింది. ౫౦ వేలు వోట్లో పోయించుకుంది కొలిపించుకుని, వడ్డీ క్రింద తక్కినవి పోస్తారేమోనని ఎగాదిగా చూచింది సిద్ధాంతిగారిభార్య. "మఱి వొక్క చిల్లిగవ్వ మీకు ముట్టబోదు. మే మేం లేనివాళ్లమని అనుకున్నారా? అయినా మీతో తగువు ఎందుకు దయచెయ్యండమ్మా!" అంది కామయ్య. "ఇదే వడ్డీ! ఇదే అసలు. నా ప్రాణం దక్కించారు అంతే చాల!" అని కొంగులో రాశి ముడేసుకు ఎత్తబోయింది. సిద్ధాంతిభార్యకు కదలలే. అప్పుడు కామయ్య, దూడల్ని విడిచి యిల్లకు పోయే పాలేళ్లను నలుగుర్ని పురమాయించి సిద్ధాంతిభార్యకు తోడుగా రూపాయలమోతకు వొప్పగించి రాత్రి రాత్రి రెండోకంటికి తెలియకుండా సాగనంపింది. సాగనంపి సోదరునితో ఊసాడుతూ "ఏం? మీ బావ యింకా యింటికి రాలేదు" అని రెండు మూడు తడవ లడిగి "వస్తాడు. రాకేమౌతాడు!" అన్న పతిభావను పూరుకుంటూ వచ్చింది కామయ్య.

* * *

ఊరికీ ఊరలంకకూ మధ్యనువున్న యేరు రాత్రి రాత్రి నిశిరాత్రికి గట్లుదాటి గట్లపనుల్లంట ఊళ్లేస్తూవుంది. నక్క లరుస్తున్నాయి. గుడ్లగూబలు "హూమ్ హూమ్" అంటున్నాయి. అతిభయంకరంగా వుంది. ఎక్కడా మనిషి అలికిడి లేదు. మనిషి అలికిడి లేనంత సేపూ ధైర్యంగానే నడిచింది సిద్ధాంతిగారిభార్య, తనకూడా రూపాయలు పట్టుకొస్తూవున్న మనుష్యులను గబగబా నడవండి అంటూ. కాని వొకానొకచోట ఏటివొడ్డే చెట్టు మీద గొడ్డలి పెట్టి కొట్టినట్టు, ఒక్కడు కాకుండా యిద్దఱు రెండు గొడ్డళ్లుచ్చుకు కొడుతూవున్నట్టు వినబడింది. వాళ్లెవళ్లో దొంగలు కావచ్చుననే అనుమానం ఆమెకు తట్టింది. ఆమెకు తట్టి తోటిమనుష్యుల్ని తన వెంపుకు త్రిప్పికుంటూ మఱోదిక్కుగా గట్టెక్కింది. ఏరు అంకోభాంకాలుగా అగపించింది. దిగి వెళ్లడం కష్టం అనుకుంది. అర్ధం ప్రాణంకూడా పోవచ్చనే ననుకుంది. మళ్లీ వినిపించింది, తాటిచెట్టు పడకొడుతూ వున్నప్పటి చప్పుడుగా దెబ్బదెబ్బకు చివరాకులు అల్లాడ్డం. "వాళ్లు దొంగలు అని అనుకోవడమేం! మంచివాళ్లే అని ఎందు కనుకోకూడదు? అలాగు నడిచే వారి సాయాన్ని ఏరు దాటొచ్చునేమో?" అని ఊహ మార్చుకొన్నదై తనజనంతో అటువైపు నడచివెళ్లింది సిద్ధాంతి భార్య.

గొడ్డళ్ల చప్పుడు వినబడ్డవైపునకు వెళ్లినకొద్దీ చప్పుడు తగ్గి మనుష్యులు మాయమైపోయినట్టయి, ఒకానొక తాటిచెట్టుమాత్రం ఏటి కడ్డంగా పరిపడా, వ్రేళ్లలోకంటా పెల్లగింపబడుడు నఱకబడి కూలద్రోయబడి అగపించింది. "ఇ దెవరో మనకోసమే ఏటికి దాటుగా పడేసిన ట్టున్నారు, అమ్మా!" అని కూడా

వున్న రూపాయల మూటవాళ్లు అంటూవుంటే ఆమె వాళ్లతో కూడా ఆదాటుతాడిమీదుగా ఏరు దాటి ఊరు చేరుకుని తన యింటికనుమ్మం మెట్లు ఎక్కింది. కూడా వున్న వాళ్లను "రూపాయల మూటలు ఆలా దించుకోండి" అంటూవుంది.

*　　*　　*

ఇంటిలోపల రెండు గొడ్డళ్లతో ఇద్దరు మనుష్యులు ఒకమనిషిని తలను తలా కాళ్లను కాళ్లా తెగనరుకుతూ "మామిడాకు చెంబు! ఎక్కడుంచావు! చావు! సిద్ధాంతీ! చచ్చావురా!" అని అన్నట్లయింది.

"అమ్మబాబోయ్! ఇం కేముంది? దొంగలర్రో! దొడ్డితోవ కాయండర్రోయ్! నా మొగుణ్ణి నరికిపారేశారర్రో!" అని పెద్దబొబ్బ పెట్టి సొమ్మసిల్లిపోయింది వెఱ్ఱిబ్రాహ్మణి ఆమెతోకూడా వచ్చిన యీవలి మనుష్యులు ఇల్లు చుట్టూ ముట్టడేసి కాసి పట్టుకున్నారు దొంగల్ని. పట్టుకొని "ఓరి మీరుట్రా! మా మనుష్యులేనట్రా!" అని పలకరించారు. "మీరుటండీ! మా మనుష్యులేనటండీ!" అని దొంగలు వీళ్లను పలకరించారు.

"ఏటివంచ తాడిపడగొట్టుకు అడ్డంగా దాటుకు వెళ్లింది మీరేనట్రా!" అంటే దొంగలు "మేమే? బలరామరాజుగారు వతీకెళ్యమంటే వతీకేళాం" అన్నారు. అని మళ్లీ "మనిషినా? చెట్టునా! ఖామందుగారు వతీకెళ్యమన్నది" అని గుర్తింపుకు దచ్చుకొని, నలుగురు, ఇద్దరు మొత్తం ఆరుగురుపాలేళ్లు కలిసి అమాంతంగా పడగొట్టిన తాటిచెట్టును పైకెత్తి నిలబెట్టారు ఎప్పట్లా తెల్లాంగట్టుకు.

కాని ఆ చెట్టు మళ్లీ వ్రేళ్లు నాటుకోలేదు. సూర్యరశ్మికి తలెండిపోయి దానంతటదే బాహాటమైన దాటుతాడిగా ఏటి కడ్డంగా శాశ్వతంగా రెండోసారి పడిపోయింది.

---

# ప్రబోధము

శ్రీ డోటుకూరు ఆంజనేయశర్మ

తెలిలేమబ్బుల రాచకన్నియలు ప్రీతిన్ త్రోవలన్ జూప సొం
పులకున్ మేరలువెట్టు మోమునను నవ్వుల్ చిందులాడన్ తళ
త్తళలన్ గుల్కెడి చుక్కకన్నియలు, మాంద్యం బేలనే? కల్వపూ
చెలి కాంతుం డిదె! వాలుఁజూపుల సుధల్ చిందింపవే వానిపై.

తెలియంజాలని వెఱ్ఱిదాన? వినువీథిన్ వింతయొయ్యారముల్
బలియన్ వెన్నెలఱేఁడు వచ్చుటయె యాలస్యంబు; క్రొమ్మావి పూ
వులకున్ లేత పసందు తేనియల సొంపుల్ నిగ్గు దేర్పన్ వసీ
లలనారత్న మొసంగె కాన్కలుగ హృద్రాగంబు రేకెత్తగన్.

మగవాఁ డన్న దిటంబు సున్న, హృదయమ్మా చంచలాచంచలం
బు, గణింపండు నయానయంబుల, దినంబున్ తిత్సువర్ణాక్షరా
లె గళంబందెడి, హారవల్లరిగ హృల్లీనాగ్ని నిర్వాపణం
బుగ నాహారముగాఁ దలంచు పడతిన్ బోనాడు నొక్కింతలోన్.

కనులన్ నీరిడ నేల ఇట్టి చెలులన్ గన్నామె లోకంబునన్
నును దేంట్లన్ గుమిగట్టి మేపుగొను కన్నుంగ్రేవలన్ నారువో
సిన ప్రేమాంకురముల్ చిగిర్చి లతలన్ జేకూర్పవే వానిచే
తనె బంధంబులు వైచి వానిఁ గొని చెంతం జేర్చుకోఁజాలవే.

ప్రియురాకల్ తలపోసి పోసి దినమున్ వేగించుచున్ ఱెప్పపా
టయినన్ సౌఖ్యములేక మింట తపనుం డవ్యాహతిన్ లోకమం
తయు ప్రమగ్గింప దపంబు చేసితివి కాంతా యాతపం బెల్ల పా
ల్లయి పోనేరదు కాంతు నీవు ప్రియు దోర్లాలిత్య సంభావనల్.

# అహింసాతత్త్వము

శ్రీ మంచళ్ల సుదర్శనాచార్యులు

శ్రీకృష్ణభగవానుడు విషాదవిభ్రమ మోహావేశచిత్తుడగు పార్థునికి మనోవికారము తొలగునట్లు ఉద్బోధించిన ప్రతి వాక్యమునందు నహింసాసూత్రము ప్రతిపాదింపబడియున్నది. తొలుత స్వకర్మ నిర్వహణముకన్న మించిన మఱియొండు ధర్మము వేరు లేదని రూఢిపఱచినాడు. పిదప కర్మ, సన్న్యాస, జ్ఞానయోగ నిరూపణద్వారా ఆత్మతత్త్వమును, జీవాత్మపరమాత్మ సంబంధమును, జీవాత్మకన్న పరమాత్మయే విశిష్టగుణములనుబట్టి ఉత్తమోత్తముడైనట్లు బోధగావించినాడు. జీవాత్మ భగవదంశమే యైనను, ప్రకృతినియమములకు వివిధముగా వశమగుచున్నదో వివరించుచు, పారమార్థిక చింతనము, కర్మసన్న్యాసము, జ్ఞానయోగముల ద్వారా అవినశ్వరమును, సుస్వాస్థ్యమును, ఆనందమయమును, నిత్యమును, ప్రకృతినియమాతీతమునగు పరమపదమును జేరుమార్గము నుపదేశించినాడు. కర్మయోగమునందు ప్రతి మానవుడును నిర్వికారుడై, ద్వంద్వాతీతుడై, దృఢచిత్తుడై, స్వధర్మము నెరవేర్పవలె ననియు, కర్మసన్న్యాసమందు తాజేయు కర్మఫలము నపేక్షించక, సర్వము భగవదర్పణమని భక్తిపూర్వకముగ సమర్పించి సమభావమున నుండవలెననియు, విజ్ఞానయోగమునందు భగవంతుని దివ్యవిభూతి సృష్టియందలి ప్రత్యణువునందును గోచరించునను పూర్ణవిశ్వాసము కలిగి, భగవంతుని ప్రీత్యర్థము సృష్టిజాలము నంతటిని సమానదృష్టితో జూడవలె ననియు, గృధచిత్తులుకాని వారలకు భగవదర్పణముగా స్వీయధర్మము నెరవేర్చుట మొదటి మెట్టనియు, తదనంతరము జ్ఞానయోగ మార్గ మవలంబింప సాధ్య మగునని యానతిచ్చి, అప్పటికిని పూర్తి విశ్వాసము, మనోనిశ్చలత, భావగంభీరము కలుగక సంశయాత్ముడై ప్రశ్నించు ప్రాణతుల్యుడగు పార్థునికి తన విశ్వరూపమును చూపించినాడు. ప్రత్యణువునందు భగవద్విభూతి గానబడుచుండునని వచించినదానికి తార్కాణముగా సృష్టియందే సకలవస్తువులందు తన అంశ గలదో స్పష్టముగా నిరూపించినాడు. తదుపరి సాక్షాత్ దృష్టాంతము చూపునిమిత్తము విశ్వరూప సందర్శనభాగ్య మొసంగినాడు.

యజ్ఞము లొనర్చుట శాస్త్రసమ్మతమేయనియు, యజ్ఞకర్త, భోక్త తానే ననియు చెప్పినను, సాధారణముగ యజ్ఞములు చేయువారు డాంబికులై, పునరావృత్తికారకములగు స్వర్గసౌఖ్యముల ననుభవింపదలంచియో, పలువురు తమ్ము సోమయాజులని పిలిచి గౌరవింపవలెనను కుతూహలముతోనో చేయుచుందురనియు, ఆ విధముగ ప్రతిఫలమును కోరుచు చేసినవానికన్న నిష్కామకర్మ లొనర్చువాడు శ్రేష్ఠతముడని వక్కాణించినాడు. ఈయజ్ఞములందును జ్ఞానయజ్ఞము మానసికయజ్ఞము లను వేరువిధముల భేదములను చూపించినాడు. జ్ఞాన మానసిక యజ్ఞముల శ్రేష్ఠత్వమును నిరూపించుటలో జంతుబలి గావించుచు చేయుయజ్ఞము లప్రస్తుతము లనియు, అనాచరణీయములనియు మనకొక భావము స్ఫురించుట లేదా? శ్రీ కృష్ణభగవానుడవతరించకపూర్వము, అవతరించిన తరువాతను ఈజంతుబలియుక్త యజ్ఞములు జరుగుటచేతనే, వాటిని గావించువారు ఘనులని, పరమపదము లభించ గలదని దురభిప్రాయపడుటచేతనే, సక్రమధర్మమును నిరూపించదలచి, యజ్ఞములలోనేది ఉత్తమమో పార్థుని సంశయములను పోద్రోలు సందర్భములో ప్రపంచమునకు చాటినాడు. సర్వము పరమాత్మకు సమర్పణము గావించి కర్మాచరణకు పూనుకొనినవాడు హింస గావించినను, గావించనివానితో సమానుడే యని తన అభిప్రాయ మొసగినాడు,

శ్లో. యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే,
హత్వాపి స ఇమాన్ లోకాన్ న హంతి న నిబధ్యతే.
(భగవద్గీత- అ. ౧౮, శ్లో. ౧౭)

అనగా ఎవనియం దహంకారభావము లేదో, ఎవనిబుద్ధి మలినమయినది కాదో, అట్టివాడీప్రపంచమున జంపుచుండినను, చంపనివాడయి బంధనమున బడుట లేదు.

దీనికి గాంధీమహాత్ముడీ క్రింది విధమున వ్యాఖ్యాన మొసంగెను.

"పైపైదృష్టితో జదువుటచే నీశ్లోకము మనుష్యుని వంచించునదయి యున్నది. గీతయందలి యనేక శ్లోకములు కాల్పనికాదర్శనము నవలంబించునవిగా నున్నవి. దానికి యథార్థముగు నమూనా జగమున లభింపదు. మఱియు నుపయోగమునిమిత్తము నయితే యెట్లు రేఖాగణితమునందు గాల్పనికాదర్శముయొక్క యాకృతుల యావశ్యకత కలదో, అట్లనే ధర్మవ్యవహారమునకును గలదు. కాబట్టి యీ శ్లోకమున కర్థ మీరీతిగా జెప్పవచ్చును. ఎవని యహంకారము భస్మమయినదో, మరియు నెవని బుద్ధియందు లేశమాత్రమేని మాలిన్యము లేదో వాడఖిలజగమును జంపినను జంపవచ్చునని యాతని విషయమున జెప్పవచ్చును. కాని యెవనియం దహంకారము లేదో వానికి శరీరము లేదు. ఎవనిబుద్ధి విశుద్ధమో, వాడు త్రికాలదర్శి. ఇట్టి పురుషుడు కేవలమొక భగవానుడు కలడు. వాడు చేయుచుండియు నకర్త. చంపుచుండియు నహింసాపరాయణుడు. ఇందుచే మనుష్యునిరొద్ద జంపకుండుటయు, శిష్టాచారమును ననువ దొక్కటె శాస్త్రముయొక్క మార్గమయి యున్నది." (బలరామ కృష్ణయ్యగారి ఆంధ్రానువాదము- నిష్కామయోగము.)

ఎప్పుడైతే సర్వము భగవదర్పణయని స్వధర్మ నిర్వాహణకు బూనుకొనునో, అప్పుడు దౌర్జన్యముగాని, హింసగాని, "సర్వమ్ విష్ణుమయమ్" అని ఎఱింగిన మానవుడు చేతులార సలుప యత్నించునా? యత్నింపగలడా? హింస గావించువాని కిక ఫలాపేక్ష రహిత కార్యాచరణ సాధ్యమగునా? కాదు. సర్వము విష్ణుమయమేనని తెలుసుకొనినవాడు వేఱొక జంతువు నేమని బాధించును? ప్రత్యక్షముగా హింసాచరణ గూడదని గీతలలో చెప్పబడకపోయినను, సర్వసమాన భావోద్బోధనద్వారా అహింసామాత్రమే ఉపదేశమొనర్పబడినది. ఇదే గీతాశాస్త్రమునం దిమిడియున్న పరమరహస్యము.

అర్జును డేవిధముగా గ్రహించెనోగాని, తక్కిన ద్వాపరాంత, కలియుగారంభములం దున్నవారుగాని, నేడు జీవించుచున్నవారుగాని, ఈగీతలకు వేరువేరు విధములుగా నర్థము చెప్పుచున్నారు. శ్రీ కృష్ణుని తరువాతివాడగు బుద్ధుడు గీతారహస్య సంగ్రహమును మహోత్కృష్టముగా సామాన్యమానవులకు బోధించినాడు. అందులో అహింసావ్రతమునే మరింత గొప్పదిగా నిరూపించి ఉపదేశించినాడు. పుణ్యభూమియగు మన భారతదేశమునం దనాదినుండి, వేదయుగమునాటి నుండి, యీ అహింసా సూత్రమునే మహర్షులు, విజ్ఞానులు ముఖ్యవిషయముగా పాటించుట మన మెఱుగవలసిన విషయమే. వాక్శాసనముచే ముల్లోకములను గడగడలాడించి, మహాస్త్రమాత్రమున దుర్జనులను, వారి దౌర్జన్యమును నాశనమొనర్ప సమర్థులగు మునిపుంగవులు సైతము, క్షమామూర్తులై సాధ్యమగునంతవఱకు సహోద్బోధ గఱపి, మంచి ప్రవర్తకులుగ దుర్మార్గులను మార్చినారు. దీనినే గాంధిమహాత్ముడు ౧౯౨౦ సత్యాగ్రహపురోజులలో మరింత సుబోధముగాను, స్ఫుటముగాను "Doctrine of the sword" అనువ్యాసములో పేర్కొనినాడు.

"Having themselves (Rishis and Saints) known the use of arms, they realised their usefulness and taught a weary world that its salvation lay not through violence but through non-violence."

మహాత్ముని యీ ఉపదేశము ప్రతిభారతీయుని హృదయకుహరమునందు నేడు స్పందించుచున్నది.

హింసా ప్రతిపాదకమగు నేకార్యమును చేయుట పాపమనియు, తుదకు విషజంతువును సైతము బాధించుట ముక్తినిరోధమనియు బుద్ధుడు తనకాలము

వాటి ప్రజలకు బోధించినాడు. అంతేకాకుండ సత్యము, సచ్ఛీలము, సత్కార్యాచరణమూడ ఉపదేశమొనర్చినాడు. శాంతియుత వైరాగ్య భావముకలవానికి మోక్షము కరతలామలకమని ఘంటాపథముగ జాటినాడు. కాని అప్పటికింకను మహోత్సాహముతో, డాంబికాచారులై, అనిత్య సౌఖ్య, పదప్రాప్తిని గోరి యజ్ఞయాగముల గావించు వైదికాచారుల కీబోధనలు రుచింపక పోయినవి. కాలగర్భమున క్రమశః బౌద్ధమతము మాటుమణిగి, హింసామతము వృద్ధికి రాదొడంగినది. శ్రీకృష్ణభగవానుడుపదేశించిన జ్ఞానయజ్ఞముచే బుద్ధుడు సులభముగా పండిత పామరులకు నర్థము తెలియునట్టి వాల్గయిన వాక్యములలో బోధించినాడు. ఒక్కొక్క నియమము తేలికగా మామూలుగా కన్పడినను, అందులోని అర్థము, దాని నాచరణపూర్వకముగా పూర్తిగావించుట తలక్రిందులుగా తపస్సుచేసిన ఘనకార్యమునకన్న దుర్ఘటమయినది. ప్రతికార్యము దానంతట నది మహోత్తమమైనదేకాని, దానిని ఆచరణయందు పెట్టలేనంత మాత్రమున నుపేక్షించదగినది కాదని శ్రీకృష్ణుడర్జునునికి చెప్పినాడు. కాని మనవారు బుద్ధుడు బోధించిన ధర్మమాత్రముల నవలంబింప నశక్తులై, అంతకన్న సులభమను కొనిన యజ్ఞయాగముల వెంబడి పడినారు.

నానాటికి భారతదేశమునందు మతసంప్రదాయము లను పేర ప్రతిపోటును, మూలసూత్ర విరుద్ధకార్యము లాచరణకు రాదొడంగినవి. జాతి నిర్వీర్యమగుటకు సంసిద్ధము కాజొచ్చినది. అనుకరణ ప్రారంభమయినది. స్వధర్మత్యాగ మొనర్చి పరధర్మావలంబనకు ప్రజలు గడంగిరి. స్వధర్మమునకన్న పరధర్మ మెంత శ్రేయోదాయకమైనను స్వధర్మ విసర్జనము, పరధర్మావలంబనము కూడదని శ్రీకృష్ణుడు మున్నె బోధించియే యున్నాడు. భారతదేశము, భారతీయులు, భారతదేశ సంప్రదాయము, భారతనీతి క్రమ క్రమముగా క్షీణదశకు వచ్చుచున్నవి. దాస్యమునకు తలలొగ్గి, పరదేశీవ్యామోహితులై భారతీయులు పూర్తిగా మునుగకుండ, తీరమునకు రాజాలకుండ, సందిగ్ధావస్థలో తన్నుకొనుచుండిరి. అహింస, ధర్మము, వర్ణాశ్రమాచారములు అడుగంటుచున్నవి. సరిగా ధర్మగ్లాని ప్రబలమగుచున్న కాలము. భారతమాత కపవాదు, కళంక మాపాదింపబడనున్న సమయము దాపురించనున్నది. అట్టితరి ధర్మస్వరూపుడై, జాత్యుద్ధారకుడై, మార్గదర్శకుడై, ధర్మోపదేశకుడై, గాంధీ మహాత్ము డుదయించి దేశరక్షణభారము వహించినాడు.

క్రమశః మానసికముగా దుర్బలులైన మన దేశీయులు పూర్వుల దివ్యసందేశమువందలి గూఢార్థభావము గ్రహించలేక, దానిని ఆచరణయందుంచలేక, ప్రస్తుతకాల పరిస్థితులకు సరిపడని యొక అభూతకల్పనమని పొరపడుచుండిరి. మహాత్ముడు వీలగువంతవరకు నలుగురికి చేటతెల్లముగా బోధింపదొడంగెను. అతనిలోనున్న దివ్యశక్తికి, అంతశ్శుద్ధికి, నిష్కాపట్యమునకు, వీరలక్షణమునకు, నమ్రులై మారుమాటాడక దేశాభ్యుదయ కల్యాణమునకు కారణభూతుడని ధీయుతులైనవారతని ననుసరింపదొడంగిరి.

విదేశపాలనాపీడితమై యున్న భారతదేశమందు, పాశ్చాత్యనాగరికతాసంపర్కమువల్ల స్వజాతి ధర్మము కుంటుపడినది. కొంతమంది భారతీయులు ఆంగ్లవిద్యాచారవ్యామోహముచే స్వకులధర్మాచరణ మానివేయుచుండిరి. ప్రతివాడును, అంతశ్శక్తి గోల్పోయి, బాహ్యబలమునే నమ్ముకొని యుండెను. ధర్మాధర్మ, న్యాయాన్యాయ, విచక్షణావిచక్షణజ్ఞానముల గోల్పోవ దొడగెను. అనాదినుండి మన భారతదేశము ధర్మసందేశమునందు ప్రఖ్యాతి గాంచినదై, యోగనిష్ఠాగరిష్ఠులగు ఋషిపుంగవుల మహత్తర శక్తికారణముగా పుణ్యభూమియని పేరు గాంచినది. బాహ్యాంతర శత్రుల నొక్కవిధముగా నపయోగించుకొను అత్యద్భుత శక్తిసామర్థ్యములు కలిగిన మనపూర్వులు, ప్రతివిషమ సమయమునందును అంతరాత్మప్రబోధ మాధారముగా గొని సత్యశౌచక్షమాయుతులై, అహింసాశస్త్రముచే తమ దేశముయొక్క గౌరవమును గాపాడిరి. కాని మహాత్ము డుదయించుతరి పశుబలము ప్రాముఖ్యత గడించుచుండెను. తిరిగి మన జాతికి పూర్వమున్న గౌరవమును పునరుద్ధరింపదలచి, వేదకాలమునాటి

ఋషిపుంగవుల విశిష్టతత్త్వమునే ఆచరణలో పెట్ట లేడంగను.

బుద్ధుడు బోధించిన అహింసాతత్త్వమునకును, మహాత్ముని అహింసాధర్మమునకును కొంత భేదము బాహ్యదృష్టికి గనబడుచున్నది. బుద్ధుడు కేవల మాత్మతేజమునకు, మోక్షప్రాప్తికి మూలకారణ మని నమ్మి అహింసను బోధించెను. కాని దానిని మహాత్ము డాత్మోద్ధరణమునకే గాక, బలవత్తరమగు బాహ్యదుష్ట శక్తుల నణంచుటకు ముఖ్యముగా నుపయోగపఱచెను. బాహ్య శక్తికి అంతరాత్మ ఎప్పుడును లొంగదని అతనివిశ్వాసము. శ్రీ కృష్ణభగవాను డర్జునునికి బోధించిన ఆత్మతత్త్వమునే యాత డనుకరించెను. దౌర్జన్యరాహిత్యమే దేశకల్యాణమునకు మూల మని నమ్మెను. అత్యద్భుతరాజకీయ వేత్తయై, సనాతనవిశిష్టధర్మమును నిమసమయముల యం దాచరణలో బెట్టుచుండెను. మన కందరికి నంతటి అంతశ్శక్తి, సనాతనధర్మవిశ్వాసము లేనికారణముచే సక్రమముగా నతని ననుకరింపలేక, అనుకరించుటకు సామర్థ్యము లేక, వెనుకంజ వేయుచుంటిమి. కొందఱు నాయకులు మహాత్మునియందు విశ్వాసముగలవారై, అతనితో పాటు దేశాభ్యుదయమునందు, విదేశపాలనా విముక్తి యత్నమునందు, రణరంగమున దరికి సర్వమును త్యాగ మొనర్చినారు.

మహాత్ముని దౌర్జన్యరాహిత్యతత్త్వము విచిత్రముగా గనబడును. ప్రతిఘటించుటకు శక్తి గలిగి యుండియును, క్షమించుటే అహింసయని అతనిమతము. ఒకని అంతశ్శక్తి, దౌర్జన్య యుతమగు నొకసామ్రాజ్యమునుగూడ వినాశన మొనరింపగలదని, లేదా స్వదేశ కల్యాణమునకు బునాది వేయగలదని, తానే "Doctrine of the Sword" అను గాఢ సత్యాగ్రహపు లేఖలలో "Young India" పత్రికయందు వ్రాసెను. అత నొకచోట అంధకారమునందు జ్యోతి, అసత్యమునందు సత్యము, దౌర్జన్యమం దహింస, దుర్గుణమందు విశిష్టతత్త్వము గోచరించుచున్నదని వ్రాసెను. మన కీసంగతి అర్థమగునా? ఆత్మప్రబోధము కలిగిన—లేక కలుగుచున్న—వానికే యీపరస్పర విరుద్ధభావ శ్రేష్ఠత్వము గ్రాహ్య మగుచున్నది. అతనికి ప్రకృతి సౌందర్యముమాత్రమే నేత్రపర్వముగా గోచరించును గాని, మానవకల్పిత మగు నెట్టి సుందరవస్తువుగాని పరిశ్రమనిబంధావతారముగా గనిపించును. అతనికిగల ఆత్మవిశ్వాస మనితరలభ్యమైనది. శ్రీ కృష్ణభగవానుడు పార్థునికి ఆత్మనుగురించి బోధించినదే యీతనికి ఆధారముగా గనబడుచున్నది.

శ్లో. నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః,
న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః
అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽ
శోష్య ఏవచ,
నిత్య స్సర్వగత స్స్థాణు రచలోఽయం సనాతనః.
అవ్యక్తోఽయ మచింత్యోఽయ మవికార్యోఽయ
ముచ్యతే,
తస్మా దేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి.

అనగా ఈ యాత్మను శస్త్రములుగాని, నిప్పుగాని, నీరుగాని, గాలిగాని నాశన మొనర్పజాలవు. ఇది సర్వవ్యాపకము, స్థిరము, అనశ్వరము, అచంచలము, అనాదీయము. ఇది యింద్రియముల కగోచరము, ఊహాతీతము, నిర్వికారము.

ఈ విశిష్టత్వమునే మహాత్ముడు మనసార నమ్మి, ఆచరణయం దుంచి, మనకందఱికిని బోధించుచున్నాడు. సమర్థులైయుండియు, స్వార్థత్యాగమును చేయువారలే వీరులని చెప్పుచున్నాడు. తొలుత శ్రీ కృష్ణుడు కురుక్షేత్రమున దురాత్ములగు కౌరవులతో యుద్ధమొనరింపవలసినదని, క్షత్రియునికి యుద్ధ మొనర్చుటే స్వధర్మ మని అర్జునునికి చాటినాడు. దానినే నేడు మహాత్ముడు యావద్భారతప్రజలకును విదేశపాలకులతో రాజకీయ రంగమునందు పోరాడుటకు నుపయోగించి బోధించుచున్నాడు. స్వధర్మనిర్వహణమునకు పాటుపడుట మన మింక నెపుడు నేర్చుకొనెదమో అప్పుడు మహాత్ముని ధర్మసందేశము మన చెవులకు సోకును. అప్పుడే మనకు సనాతనధర్మశ్రేష్ఠత్వము గ్రాహ్యమగును. మహాత్ముడు, అతని అనుచరులగు నాయకులు కొందఱైనను, మన దేశకల్యాణమునకు యావచ్ఛక్తి వినియోగించుచున్న సంగతి అందరికిని విదితమే. అంతే చాలును. అట్టి మహానీయులకు మనము దోసిలొగ్గి, వారు తమ

యత్నములందు విజయవంతు లగుటకు భగవాను డనుగ్రహించుగాక యని యాశించుట మనవిధి.

మహాత్ము డేపని ప్రారంభించుటకును కూడ తొల్దొల్త భగవంతుని నిత్యకల్యాణగుణసంకీర్తన మొనర్చి, ఆపై కలిగిన అత్యద్భుత దివ్యశక్తితో ఆత్మపరిశోధన గావించుకొని, తా నొనర్పబోవు కార్యవిధానము నిర్ణయించును. అందుకనే మహాత్ముని కార్యనిర్వహణమునం దావంతయు లోటుగాని, అసంపూర్తికాని కలుగకుండును. అంతరాత్మప్రబోధము మన కందఱికిని సాధ్యము కానిది. మనలో సామాన్యముగా-ఏకొద్ది మహనీయులకో తప్ప-ఆత్మ నిద్రాణమై యుండును. నిరంతర యోగాభ్యాసమువలనగాని అది జాగ్రదవస్థకు రాజాలదు. యోగ మన యోగాసనమై పుణ్యము కాదు. అంతరాత్మమన మొనర్చు పనులయందు మార్గదర్శిత్వము కలిగి యుండవలెను. ఆత్మోత్తేజము లేనివారలకు మహాత్ముని అహింసాతత్త్వము, నిరశనవ్రతము చులకనగా— కొంతమంది అహంకారముగలవారికి — పరిహాసాస్పదముగా గనబడును. అట్లు గోచరించుట అర్థముచేసికొనువారల దురదృష్టము తప్ప మఱొండు కాదు.

మహాత్ముని దివ్యాచరణలో నిరశనవ్రత మొకటి. నిరశన మనగా మనము సాధారణముగా నిరాహార మని భావింతుము. కేవలము నిరాహారమే యనుచో పట్టెడు కూడు లేక మాడిపోవువా రెందఱో నిరాహారులు రత్న యని ఖ్యాతిగాంచిన మన భారతావనియందు గలరు. ప్రతివాడును, మనోనిబ్బరముగలవాడు - నిరశనవ్రతమును బూనవచ్చును. కాని యూడోవాడే అట్టివాని ముఖమున కళ తప్పిపోవును. ప్రేతకళ పడును. మహాత్ము డిప్పటికి నాలుగైదుపర్యాయములు నిరశనవ్రతము బూనినను, ఆయనకు ముఖవైవర్ణ్యముగాని, శరీరదుర్బలతగాని కలుగలేదు. పైగా నొకదివ్యవిభూతి ఆయన ముఖలక్షణములందు గోచరించును. మనపురాణములలో పరీక్షిన్మహారాజు అంత్యదశయందు శుకయోగిసత్తముని దివ్యోపదేశానుసారము ప్రాయోపవేశ మొనరించెను. అప్పుడా పృథ్వీపతి విష్ణునామస్మరణతప్ప మఱొండు తలచలేదు. ఈనియమమే ఏకాదశీమాహాత్మ్యమునందు చెప్పబడినది. సనాతనధర్మమూర్తి గనుక మహాత్ముడు కూడ శాస్త్రోక్తముగా నిరశనవ్రతమును బూనునప్పుడు నిరంతర పరమేశ్వర స్మరణ గావించుచు, అంతరాత్మతో సన్నిహిత సాన్నిధ్య సంబంధము కలిగి వర్తించును. రాజకీయ పరిస్థితులందు మహాత్మునితో తులతూగు మేధావి యుండిన నుండవచ్చును గాని, మహత్తర దివ్యశక్తియందును, ఆత్మపారిశుధ్యమునందును, అంతరాత్మప్రబోధ స్వీకరణమునందును, సత్యాహింసా స్వధర్మ నిర్వహణమునందుమాత్ర మతనికి, అతనే సాటి. కనుక మహనీయు లతనిని భగవదవతార మని భావించి పూజించుచున్నారు.

అహంకార మమకారత్యాగము లేనివా డెంత పండితుడైనను జ్ఞాని గాడు. పండితుడు విద్యావినయ సంస్కారములుగల బ్రాహ్మణునియందును, గోవులందును, ఏనుగులందును, శునకమునందును, చండాలునియందును సమత్వబుద్ధి గలిగియుండవలె నని భగవద్గీతలో చెప్పబడెను.

శ్లో. విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ పండితా స్సమదర్శినః॥.
(అధ్యా, ౫; శ్లో, ౧౮).

మఱియు నెవనిసమస్తకర్మలును కామ సంకల్పవర్జితములై యుండునో, జ్ఞానాగ్నిచే దహింపబడి పరిశుద్ధములగునో, అట్టివాడు జ్ఞాని యని బుధులు చెప్పెదరు.

శ్లో. యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః,
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః.
(అధ్యా, ౪; శ్లో, ౧౯).

మహాత్ముడు నిష్కామయోగి. అహింసావ్రతావలంబకు డగుటవలన దయార్ద్రహృదయుడు. సమభావము కలవాడు. పండితుడు. ఆయన హరిజనోద్ధరణకు బూనినప్పు డహంకార భావసమన్వితులగు పండితు లాతనిని బ్రువ్వఁదిట్టిరి. అట్టివారిలో సమదర్శిత్వభావము శూన్యము. వర్ణాచారనియమములకు గట్టువడి, వర్ణసంకరము సంప్రాప్తించునని ఆందోళనపడిరేగాని సమభావ సమన్వయమై పుణ్యము వారికి చేతకాకపోయినది.

భగవంతునిపై భారము నైచి, అహంకారమును వీడిన యోగికి స్వార్థపరత్వ ముండదు. ఏపనిచేయు

బూనినను భగవంతునిపై భారము వైచి, తత్ఫలితమును భగవదర్పణ మొనరించి, ద్వంద్వాతీతుడై, నిశ్చల చిత్తు డగును. కనుక మహాత్ముడు రాజకీయరంగము నందు సత్యాగ్రహవిధానమునకు, సత్యాహింసాస్వధర్మ ములకు, ప్రాధాన్య మొసంగుచు, ఫలాపేక్షారహిత కర్మమును జరప మన కుపదేశ మొనరించినాడు.

శ్రీకృష్ణభగవాను డర్జునుని కుపదేశించినది, ఆ తరువాత ధర్మగ్లాని గలుగుచున్న రోజులలో బుద్ధుడు బోధించినది, నేడు మహాత్ముడు బాహ్యాంతర శుచికలిగి వర్తించిన నెంతటి ఘనకార్యము నైనను తుద కాలములో విజయవంతముగా నొనర్పవచ్చునని చాటుచున్నది. అహింసావ్రతాచరణ సత్ఫలితమును ద్యోతక మొనర్చుటకే - మామూలుదృష్టికి వీరి ముగ్గురి ఉపదేశములందు కించిద్భేదము గోచరించినను, మూలమాత్ర నియమము లొకటే. అందుకనే పెద్దలు 'అహింసా పరమోధర్మః' అని చెప్పినారు. ఇది మనభారతీయులకొక ధర్మసందేశము. అందరమును తెలిసి వర్తించెదముగాక !

---

# రాజారామమోహనరాయలరాజనీతి

శ్రీ దిగవల్లి వేంకటశివరావు

శ్రీ రాజా రామమోహనరాయలవారు ౧౭౭౨ లో జన్మించి ౧౮౩౩లో స్వర్గస్థులైనారు. భారత దేశోద్ధరణకొరకీయన ఎంతో కృషిచేసిరి. రాజా రామమోహన రాయలవారు గొప్పసంఘసంస్కర్త అనియు, ఉపనిషన్మతమును పునరుద్ధరించుటకు ప్రయత్నించి బ్రహ్మసమాజమును స్థాపించె ననియు, స్త్రీలహక్కులకొరకు పోరాడి సహగమనమును నిషేధింపజేయుటలో చాలా పాటుపడె ననియు, చాలామందికి తెలియునుగాని ఈ మహానుభావుడు కేవలము సంఘసంస్కరణకొంకే గాక భారతదేశ విద్యాభివృద్ధికొరకు ఆర్థికరాజకీయాభివృద్ధికొరకు తన యావజ్జీవమును పాటుపడె ననిమాత్రము చాలామందికి తెలియదు భారతదేశోద్ధరణ ప్రయత్నముల విజయమున నేడు గాంధి మహాత్మునివలెనే నాడు రామ మోహన రాయలవారును ఒక యుగపురుషు డని చెప్పవచ్చును.

ఈయన ఇంగ్లీషు సంస్కృత వంగపారశీక భాషలందు అపార పాండిత్యము సంపాదించి తన పాండిత్యమును దేశోద్ధరణ కొరకే వినియోగించెను. ఆనాడు క్రైస్తవ మిషనరీలు తమ మతమే ప్రపంచములో కంతటికీ ఉత్కృష్ట మైనదని చెప్పి అందరినీ క్రైస్తవ మతములో కలియవలసిన దని బలవంతపెట్టుచుండుట చూచి ఈమహానుభావుడు స్వధర్మరక్షణకొంకు అఖండప్రచారము కావించెను. ఇతరమతములందలి గొప్పసిద్ధాంతము లన్నియు మన ఉపనిషత్తులందే కలవని చూపించుటకు అనేక ఉపన్యాసములుచేసి వ్యాసములు, పుస్తకములు వ్రాసెను. దేశప్రజలలో విజ్ఞానము వ్యాపింపజేసి ప్రజాభిప్రాయమును కలిగించుటకు వంగభాషలో 'సంవాదకౌముది' అను వార్తాపత్రికను పారసీభాషలో "మిరాత్ ఉల్ అక్బర్' అను వార్తాపత్రికను నడిపి దేశభాషలందు వార్తాపత్రికా నిర్వహణమునకు దారిదీసెను.

పాశ్చాత్య విజ్ఞానమును భారతీయులు తెలిసికొనుట అవసరమని తలచి ఇంగ్లీషు భాషలో విద్యగరపుట యవసరమని ప్రచారము చేయసాగెను. అనేక పాఠశాలలు స్థాపించుటకు తోడ్పడి వంగభాషలో భూగోళ ఖగోళ రేఖాగణితములను గూర్చి పఠనీయ గ్రంథములు రచించెను. డేవిడ్ హేర్ మున్నగువారితో కలిసి కృషిచేసి హిందూకాలేజిని స్థాపించుటకు కారకుడయ్యెను.

రామమోహనరాయలు స్వాతంత్ర్య ప్రియుడు. నిరంకుశుడగు రాజునుండి నేపిల్సు ప్రజలు బయలుపడి ఒక స్వతంత్రరాజ్యాంగము సంపాదించినపిదప మరల రష్యా పెర్షియా ఆస్ట్రియావారివలన అణచివేయబడిరని విని ఇతడు చాలా దుఃఖించెను. ఇట్లే రామమోహనరాయలు స్పెయినులో బాధ్యతాయుతః రిపాలనము స్థాపింపబడె నని విని కల

కత్తా టౌనుహాలులో నొకగొప్పవిందొసగెను. ఆనాడు ఫ్రాన్సు దేశములో కలిగిన విప్లవమున కిత డెంతో సంతోషించి రాత్రింబవల్లు దానిని గూర్చియే మాట్లాడుచువచ్చెను.

రామమోహన రాయలవారికి ప్రారంభములో బ్రిటిష్ పరిపాలనపైన నంతగా గౌరవము లేకుండెనుగాని ఆయనకు అరువది సంవత్సరములు వచ్చినపిమ్మట దిగ్బీవారితో పరిచయము హెచ్చెను. వీరు విద్యావంతు లనియు తెలివైనవా రనియు వీరి ది పరపరిపాలనమే అయినప్పటికిని దీనివలన దేశీయులకు కొంత మేలు కలుగుననియు తోచినది. కొన్నాళ్లకు ఇంగ్లీషువారికి గలశక్తి సామర్థ్యములు రాజకీయ స్వాతంత్ర్యము రామమోహన రాయలను ఆకర్షించి ముగ్ధుని జేసెను. వారి ప్రభావమువలన మనలో కూడా స్వేచ్ఛ సాంఘికసౌఖ్యము కలుగుననియు, మనవిజ్ఞానము వర్ధిల్లుననియు ఆయనకు తోచినది. ఈ ఆశతోనే ఆయన ఆనాడు మనవారికి గల కష్టసుఖములను గురించి సభాయుతుడైన ఆంగ్లరాజునకును ప్రీవీకవున్సిలుకును అనేక అర్జీలు పంపుట ప్రారంభించినాడు.

ఆయన ఆంగ్లరాజుకు వ్రాసిన అర్జీలో (Appeal to the King in Council) ఇట్లు వ్రాసెను:—

"పూర్వపు మహమ్మదీయ పరిపాలనలో మహమ్మదీయులతో పాటు సమానముగా మా దేశీయులు అన్నిలాభములు పొందేవారని తమ కెరుగని విషయము కాదు. ప్రభుత్వములోని గొప్ప ఉద్యోగాలను పొందగలిగేవారు. సేనలను నడపడానికీ, రాష్ట్రములను పరిపాలించడానికీ కూడా నియోగింపబడేవారు. రాజులకు మంత్రులుగాకూడా వుండేవారు. తమమతమునుబట్టిగాని పుట్టుకనుబట్టిగాని వీళ్లకు ఎట్టి ఇబ్బందీ వుండేదికాదు. వీళ్లకు పన్నులిచ్చుకో నక్కరలేకుండా చేసి ఇనాములుజాగీరులు ఇవ్వబడేవి. గొప్పవిశ్వాస గౌరవములు దర్జాలు గలిగి దేశములో గొప్ప గొప్ప భాగానికి ఆధిపత్యము వహించేవారు. తెలివితేటలూ, విద్యా కల దేశీయులకు మంచిగౌరవము. ఆదాయముగల ఉద్యోగాలివ్వబడేవి. ఈ రాజకీయ సౌకర్యాలు బ్రిటీష్ పరిపాలనలో పోయినాయి".

ఇట్లాయన వగచినాడు.

రామమోహన రాయలవారు తమ సంవాదకౌముదిలో ఆనాడు భారతీయులకు గల కష్టాలను వివరించి అనేకవ్యాసాలు వ్రాశారు. వాటిలో కొన్నింటిని మచ్చుకి ఇక్కడ వివరిస్తాను.

మర్యాదగల బీద హిందువులకు ఉచితంగా విద్య గరపడానికి ఒక పాఠశాల అవసరమనిన్నీ,

రాష్ట్రీయ కోర్టులలోనూ జిల్లా కోర్టులలోనూ జూరీ విచారణ పంచాయతీలలో ప్రమాణ పురుషుల అభిప్రాయ ప్రకారం న్యాయవిచారణ జరిపేపద్ధతి స్థాపించమనిన్నీ,

కలకత్తా క్రైస్తవులకు పెద్ద రుద్రభూమి వున్నప్పటికీ హిందువులకు చాలా సంకుచితమైనచోట దహనక్రియ జరుపవలసి వస్తూ వున్నందువల్ల చాలా యిబ్బందిగా వున్నదనిన్నీ,

వంగరాష్ట్రంనుంచి విదేశాలకు బియ్యం ఎగుమతి చేస్తూ వున్నందువల్ల ప్రజలకు చాలాబాధ కలుగుతూవున్నదనిన్నీ,

ఇంగ్లీషు వైద్యులవల్ల చికిత్సచేయించు కోడానికి భారతీయులకు అవకాశం కలిగించ మనిన్నీ ఆయన వెల్లడించినాడు.

కలకత్తా వీధులలో ముఖ్యంగా చిట్పూరు రోడ్డులో హిందువులు తమ దేవుళ్ల ఉత్సవాలు తీసుకొని వెళుతూవుంటే అక్కడ గుంపులుకూడి శాంతంగా ఉత్సవం చూస్తూవున్న వాళ్లను ఆ సమయంలో గుఱ్ఱపు బండ్లు ఎక్కి వెడుతూవున్న క్రైస్తవ పెద్ద మనుష్యులు, దొరలు పెద్దలనిగాని పిన్నలని గాని స్త్రీలని గాని విచక్షణలేకుండా కొరడా లతో కొట్టుతున్నారనిన్నీ జనులు భీతావ హంతో చెల్లాచెదరై ఒకరినొకరు తొక్కు కొని మురికికాల్వలలో పడుతూ బాధలు పడుతూ ఉన్నారనిన్నీ దీనిగూర్చి కలకత్తా మేజిస్ట్రేటుగారు తీవ్రమైన చర్య తీసుకుంటేనే గాని మాట దక్కదనిన్నీ వ్రాశాడు.

ప్రజాభిప్రాయములను స్వేచ్ఛగా ప్రక టించడానికి ప్రతికాస్వాతంత్ర్యం అవసర మని రామమోహనరాయలవారి ఊహ. గవర్నరుజనరలువల్ల లైసెన్సులు పొందనిదీ ప్రతికాప్రచురణ చేయకూడదని ఆటంకమును కలిగిస్తూ అనాడొక ప్రెస్ రెగ్యులేషను చేయ బడగా ఈయన దానినిగూర్చి ఖండించుచు సుప్రీముకోర్టువారికిన్ని సభాయుతు డగు ఆంగ్లరాజునకును మనవిచేసినాడు.

క్రైస్తవ పంచాయతీదార్ల ఎదుట హిం దువులను మహమ్మదీయులను విచారించ వచ్చునుగాని మన పంచాయతీదార్ల ఎదుట క్రైస్తవులను ఐరోపావారిని విచారించకూడ దని ౧౮౨౭లో ఒక జూరీ చట్టము చేయబడగా ఇది అన్యాయమని రామమోహనరాయల వారు ప్రచారము చేశారు.

"ఐరోపావారి సాంగత్యమువల్ల ఒక వంద సంవత్సరాలైనతరువాత భారతీయులు విద్యావంతులై రాజకీయవిజ్ఞానము శాస్త్ర జ్ఞానము వర్ధిల్లినతరువాత అప్పుడు తమకు అన్యాయముగానూ బాధకరముగానూ ఉండి తమ్ము సాంఘికంగా అధోగతిలోనికి దింపే చట్టాలేవైనా చేయబడుచున్నచో వానిపట్ల తమ అసమ్మతి చూపగల శక్తి రాకుండా వుంటుందా? ఐర్లాండుకు భారతదేశానికి చాలా తేడా వున్నది. ఐర్లాండు దేశ ప్రజలకు వున్న విజ్ఞానం లోను శక్తిలోను నాలుగవవంతు అయినా వున్నచో ఇంగ్లాండుకు చాలా దూరంగావున్న అవకాశంవల్లను, సకల సంప దలకు నిలయమైనందువల్లను, గొప్ప జన సంఖ్యవల్లను ఈ దేశము బ్రిటిష్ సామ్రా జ్యంలో స్నేహభావముతో వున్నచో గొప్ప సహాయకారిగాను, విరోధభావముతో ఉన్న చో బలమైన శత్రువుగానూ పరిణమించక తప్పదు.

"బ్రిటిష్ పరిపాలనవలన చాలామేలు కలుగుతుందని తలంచేవాళ్లలో నేనొక్కడనై నందువల్ల భారతీయులతో ఆలోచించనైనా ఆలోచించకుండాను వారి కష్ట సుఖాలను గురించి భావాలనుగురించి తలంచనైనా తలంచకుండాను మంచి నాగరికత స్వాతం త్ర్య భావములు కలిగి విజ్ఞానాభివృద్ధిని అభిల షించు ఆంగ్లజాతిక్రింద అర్ధశతాబ్దమునుండి ఈజనులు పరిపాలించబడుతున్నా రనియైనా ఆలోచించకుండాను యీ ప్రభుత్వము వారు అనేక రెగ్యులేషనులు శాసనములు చేయడము చూస్తూవుంటే నాకు చాలావిచా రముగా వున్నది."

అని ఈయన వ్రాసిన మాటలు చూస్తే అవి ఎంత దూరదృష్టితో ఈయన చెప్పినాడో తెలియగలవు. భారతీయులు స్వరాజ్యము నపేక్షించి పాటుపడు చుందురని ఈమహానుభావుడు దివ్యదృష్టితో చూసే యిట్లు పలికినాడా యనిపిస్తుంది.

౧౮33 లో తూర్పు ఇండియా కంపెనీకి మళ్లీ పట్టా యివ్వవలెనా అని ఇంగ్లీషు పార్లిమెంటువారు ఆలోచిస్తూవుండగా రామమోహనరాయులవారు ఢిల్లీ చక్రవర్తి రాయబారిగా ఇంగ్లాండు వెళ్లిరి. ౧౮3౧ లో ఫిబ్రేవరు, జూను నెలలలో నియమింపబడిన కామన్సుసభవారి సెలక్టుకమిటీ భారతదేశ స్థితిగతులను గురించి సాక్ష్య మివ్వవలసినదని రామమోహనరాయులవారిని కోరినారు. ఆయన తన సాక్ష్యమును మూజువానీగాగాక లిఖితంగా బోర్డు ఆఫ్ కంట్రోలువారికి పంపినాడు. అది పార్లిమెంటువారికి సమర్పింపబడింది.

నాటిన్యాయవిచారణ రివిన్యూపరిపాలనలను గూర్చి ఈయన ఇచ్చిన అమూల్య సాక్ష్యము పార్లిమెంటువారి రికార్డులో అచ్చువేయబడినది. ౧౮3౨ లో పుస్తకరూపంగా కూడా ప్రకటింపబడింది. భారతదేశరైతుల దారిద్ర్యము, వారు పన్ను లిచ్చుకోలేకుండా బాధపడుచుండుట, వారికి విద్య ఆరోగ్యము లేకపోవుట, జమీందారులు క్రూరులై శిస్తులు హెచ్చించి పీడించుచుండుట, శాశ్వత ఫైసలా (పర్మనెంటు సెటిల్మెంటు)వల్ల జమీందార్లకే లాభము కలిగినదిగాని రైతులకు కలుగకపోవుటనుగురించి మనవిచేసి శిస్తులు తగ్గించమని కోరినాడు. పంచాయతీ జూరీవిచారణ అవసర మన్నాడు. ఆనాటి కోర్టులలో బీదవారికి న్యాయము సులభసాధ్యముగా లేదనిన్నీ చాలా ప్రయాసలు కలుగుతున్నవనిన్నీ చెప్పినాడు. పెద్ద జీతాల ఐరోపా ఉద్యోగులను తీసివేసి కొద్ది జీతాలపైన భారతీయులను నియమించమన్నాడు. న్యాయవిచారణపద్ధతి మార్చాలన్నాడు. కోర్టులలో అంతవరకూ వాడుతూవున్న పారశీభాషను తీసివేసి ఇంగ్లీషును పెట్టవలసినదని సివిలుకోర్టులలో భారతీయ ఆఫీసర్లను పంచాయతీదార్లను నియమించమని క్రిమినలు విచారణలో జూరీ పంచాయతీలను పెట్టమని కోరినాడు. న్యాయవిచారణచేసే ఉద్యోగికే రివిన్యూపనులు పని యిచ్చినందువల్ల జడ్జీ కలెక్టరు ఒకడే అయినందువల్ల ప్రజలకు అన్యాయాలు జరుగుతున్నాయని విడదీయమన్నాడు. ఇలాగే జడ్జీ మేజస్ట్రేటు ఉద్యోగాలు విడదీయమన్నాడు. భారతదేశప్రజల ధర్మశాస్త్రమును నేరవిచారణనుగూర్చిన ధర్మాన్ని క్రోడీకరించి స్మృతులుగా చేయమన్నాడు. శాసనాలు చేసేముందు భారతీయులను ఆలోచించవలసినదని కోరినాడు. ఇదియే నేటిశాసనసభల నిర్మాణానికి మార్గమైనది. రామమోహనరాయలవా రిచ్చినసాక్ష్యము ౧౮33 లో పార్లిమెంటువారు చేసిన రాజకీయ సంస్కరణములకు చాలా తోడ్పడింది. భారతదేశము ఆంగ్లేయుల వశమైనతరువాత మళ్లీ మనలో జాతీయచైతన్యము కలిగించుటకు ప్రయత్నించిన వారిలో ప్రథముడు రాజా రామమోహనరాయలవారే యని చెప్పక తప్పదు.

# సూర్యకుటుంబము: సృష్టి

శ్రీ కొంపెల్ల లక్ష్మీనారాయణ

సూర్యుడు భూమికంటె అనేకరెట్లు పెద్ద; కాని, సూర్యునిసాంద్రత (Density) భూమిసాంద్రతకంటె తక్కువ. నిజమునకు సూర్యుడు మండుచున్న వాయుపదార్థం. దీపము మండునప్పుడు గాలిలోని ప్రాణవాయువు తీసుకుంటుంది; కాని, సూర్యుడట్లు కాదు. విద్యుచ్ఛక్తివల్ల ప్రజ్వలించే దీపికలా దినకరుడు అంతశ్శక్తిచే ప్రకాశిస్తున్నాడు. సంపూర్ణ సూర్యగ్రహణం కలిగినప్పుడు చంద్రబింబం సూర్యబింబాన్ని కప్పివేస్తుంది. చుట్టూ మంటలు (Corona) కనుపిస్తాయి. క్రీస్తుపూర్వం ౧౭-వ శతాబ్దంలో కలిగిన సూర్య గ్రహణాన్నిగురించి యిల్లా చెప్పబడివుంది: '......నాడు కొంతవడికి సూర్యుడు క్రమంగా నల్లపడ్డాడు. పగలు రాత్రైంది. ఆకాశమున మంటలు బయలుదేరినాయి.' అమితమైన సూర్యకాంతి, చుట్టూ వుండే కణముల (Fine particles of matter enveloping the Sun)మీద పడి, మంటలా కనుపిస్తుంది. తేరిపార జూడడానికి వీలులేని సూర్యబింబంలో, దూర దర్శనీయంత్రంలో దర్శిస్తే, కొన్నిమచ్చలు (Sun-spots) కనుపిస్తాయి. ఈమచ్చలు ఎల్లవేళలా ఒకేవిధంగా వుండక, మార్పుచెందుతూ ఉంటవి. ఈమచ్చలకు, గ్రహణం కలిగినప్పుడు కనుపించే మంటలకు, ధృవముల సమీపమున కనుపించే కాంతులకు (Aurora), అయస్కాంతపు తుపానులకు (Magnetic storms) సన్నిహితసంబంధం ఉన్నట్లు కనుపిస్తుంది.

సూర్యునిలో జీవము లేదని చెప్పడం సాహసం. అగ్నిపర్వతములోనుండి వచ్చే ద్రవపదార్థంలో (Lava) కొన్నిరకముల కప్పలు ఉన్నాయి. శీతోష్ణములు జీవమునకు లేవు; శరీరమునకుమాత్రమే. ఎట్టితాపాన్నైనా సహించుకునే శరీరాన్ని నిర్మించే నేర్పు సృష్టికర్తలో ఉంది. భూస్థమైన సృష్టిలోనే అనేకరకములు చూస్తున్నాం. అశరీర పోషణం సిరాహారములచేతనే జరగవలెనంట సంకుచితాభిప్రాయం. నభోభౌతికశాస్త్ర (Astrophysics) వేత్తలైన హిందూమతకర్తలు మరణానంతరం జీవము చంద్రునిలోనికి, ఒక సంవత్సర మైనవెనుక సూర్యునికడకు పోయి చేరుకుంటుందని నిరూపించారు. సూర్యుడు వత్సరమున కొకచుట్టు తిరుగుచున్నట్లు కనుపించడంచేత ఉపశాంతికొఱకు 'తద్దినము' లేర్పరచారు.

అనంతవిశ్వంలో వస్తువు లొకదానినొకటి ఆకర్షించుట సహజం (Newton'sLaw of Gravitation). దీనివల్ల ఆయావస్తువులకు అనేకగతులు ఏర్పడతాయి: తమచుట్టూ తాము తిరుగుట. తమకంటె పెద్దదైన మరియొకదానిచుట్టు తిరుగుట, రెండుమూడు కలిసి తమ గురుకేంద్రము (Common centre-of mass)చుట్టు తిరుగుట. (ఇట్టిగతి కొన్ని

ద్వయీ, త్రయీనక్షత్రములలో (Binary Stars) ఉంది.)



సూర్యుడు తనచుట్టు తాను తిరుగుచు (దీనిని పాశ్చాత్యులు సంపూర్ణంగా కనిపెట్ట లేదు.) 'లైరా' (Lyra) అను నక్షత్రమండల మువైపు, తనచుట్టు పరిభ్రమిస్తూన్న గ్రహ కూటముతో సహా, పోవుచున్నట్లు పాశ్చాత్యు లూహిస్తున్నారు. ఈగమనమువల్ల సూర్యుని నుండి కొన్ని భాగములు కాలక్రమమున విడి, తమచుట్టు తాము తిరుగుతూ సూర్యునిచుట్టు తిరుగుతున్నాయి. గ్రహములు సూర్యుని కంటె బహుస్వల్పమైనవగుటచే కాలక్రమ మున చల్లారి, ద్రవరూపమును, నేటికి ఘన రూపమును పొందినాయి. కొన్ని సాంద్రమైన వాయువుచే (Dense atmosphere) చుట్టబడి ఉన్నయి. సూర్యునికి దగ్గరగానున్న గ్రహ ములవాయువు వేడిగాను, దూరముగా నున్న వానివాయువు చల్లగాను ఉండుట సహ జము.

గ్రహము లన్నియు సూర్యునినుండి విడి వడినవంటచే అవి ఆదికాలమున అమిత తాప తిశయమున నుండేవి. దానికి తగిన సృష్టి వా నిలో నేర్పడినదంట సమంజసము. ఆదియుగ మున శరీరములు ఛాయామాత్రములుగను, దీర్ఘాయువులుగను, ఆజానుబాహువులుగను ఉండేవి. ఇచ్ఛామాత్రముననే ఉత్పత్తి కలి గేది. రానురాను గ్రహములందలి తాపము ఉపశమించింది. శరీరములు నేడున్న స్థితికి వచ్చినయి. అల్పాయువు, లఘుశరీరములు ఏర్పడినయి. ఈమార్పంతయు అనంతకాలక్ర మమున వచ్చినదనిమాత్రం జ్ఞాపక ముంచు కొనవలె. సృష్టిలో కలిగే మార్పులకాలము నియమించుటకు మానవజీవిత మత్యల్ప మైనది ("The human life is too small a unit to measure the changes of the universe."). సూర్యునికి దగ్గరగానున్న గ్రహములలో ఆదియుగమునకు సంబంధిం చినసృష్టి, దూరముగానున్న గ్రహములలో కలియుగాంత సంబంధమైనసృష్టి ఉండవచ్చు. మానవుడు తన బుద్ధిబలముతో ఎన్నటికైనా ఈవిషయములు పరిశీలించు ననుఆశ నేడు హాస్యాస్పదమైనను, పురాణములు తెలిపే విమానములు, దూరదృష్టి (Television), దూరశ్రవణం (Radio), నేడు ఋజువైనట్లే, నిరాశ కానేరదు.

గ్రహములకు ఉపగ్రహము (Satellites) లున్నాయి. అవి, గ్రహములు సూర్యునినుండి విడినట్లే, గ్రహములనుండి విడి, వానిచుట్టు తిరుగుతున్నాయి. భూమిచుట్టు తిరిగే చం

ద్రుణ్ణి మనం చూస్తూనేవున్నాం. తదితర గ్రహములకు ౮, ౧౦ ఉపగ్రహములవరకు



కృష్ణపక్షము.

ఉన్నాయి. ఆదిని చంద్రుడు భూమికి దగ్గరగా వుండేవాడని. (అప్పుడు దినము, చాంద్రమానము సమముగా నుండేవి), ఇంకా దూరమగుచున్నాడని (అందువల్ల దినప్రమాణము హెచ్చుతోంది; కొంతకాలానికి దినము, చంద్రమానము సమానమగుతాయి), తిరిగి భూమిని చేరుకుంటాడని కొందఱు పాశ్చాత్యులభిప్రాయపడుతున్నారు. చంద్రుణ్ణిచుట్టి వాయువుగాని, జలముగాని లేవు. (ఈవిషయము చంద్రునివలన కలుగు నక్షత్రగ్రహణములు (Occultations) పరిశీలించునప్పుడు తేలును. మరియు, చంద్రునిమీద వస్తువులు శకనుకు ౨ మైళ్లకు మించిన వేగముతో పోయిన చంద్రునిపై నుండలేవు; (Critical velocity of moon) చంద్రుని ఆకర్షణశక్తి వానిని నాపలేదు. వాయుకణములు శకనుకు రెండు మైళ్లకు మించిన వేగము కలవగుటచే (Kinetic theory of gases) చంద్రునిపై వాయువు ఉండలేదు. (చల్లారిన అగ్నిపర్వతములతో నిండి వుంది చంద్రతలము.)

చంద్రుడు తనచుట్టు తాను తిరుగుటకెంత కాలము పట్టునో, భూమిచుట్టు తిరుగుటకంత కాలము పడుతుంది; కాన, చాంద్రదినము మాసము సమానము. మరియు ఎల్లప్పుడు చంద్రునిలో ఒక సగభాగమే మనవైపు తిరిగివుంటుంది. మరణానంతరము జీవము చంద్రునిలోనికి వెడుతుందని, ఒక సంవత్సరమచ్చట ఉంటుందని, ఉండేస్థానము మన




శుక్లపక్షము.

కగపడే చంద్రముఖంగాక, వెనుక నున్నదని పూర్వు లూహించారు. చంద్రుడు జలరహితమని గ్రహించి తర్పణం నియమించారు హిందూ మతకర్తలు. అమావాస్యనాడు సూర్యచంద్రులు ఒకేదిన రేఖమీదికి ఒస్తారు (have the same R T. Ascension). అందుచే చంద్రస్థజీవులకి మట్టమధ్యాహ్న మగుతుంది. అమావాస్యనాడు తప్పక విడవాలి తర్పణం. చాంద్రదినము, మన మాసము సమానమగుటచే మాసిక విధి ఏర్పడింది. సృష్టియొక్క భౌతిక శాస్త్రం సంపూర్ణముగా పరిశీలించి ఏర్పరచిన హిందూమతాచారా లివి. నమ్మిక ఉంటే నడచుకోవచ్చు; లేకుంటే, ఊరుకోవచ్చు; కాని, తెలియకుండా దూషించడం తె...

# అ భా గి ని

శ్రీ అ. సీతారాముడు

౧

‘రంగులో తావిలో మేలురకపుపూలు
విచ్చి నీకరస్పర్శకై వేచియుండ
వాని కన్నెత్తి చూడక వలచినావు
పనికిమాలిన ఒక్కనిర్భాగ్యసుమము’
అనుచు నిట్టూర్పు విడిచి శూన్యమ్ము కలసె;
ఆ అనాథ కిం కెక్కడి ఆత్మశాంతి !!

౨

కలుపు తీయుచు పల్లెపాటలను పాడి
పూవులకు ప్రేమ నేర్పిన ప్రోడ ; కాని
ప్రేమచే నిండియున్న పవిత్రహృదిని
చిదుకగొట్టుకొన్నది తన చేతులార !
నీదుబీభత్స జీవితగాథ విన్న
ఎంతటి కటికగుండె ద్రవింపదమ్మ !

౩

దుమ్ములో దొరలాడు పుష్పమ్ము చూచి
నవ్వుచున్నది కార్చిచ్చు నాల్క సాచి !
నీలకాదంబినీగర్భిణీజనమ్ము
జలక మాడదరేమొ ! అక్షతలు చల్లి
విశ్వకల్యాణమునకు దీవెనలు పంపి
పాడవమ్మ మాతల్లి ప్రభాతలక్ష్మి !

౪

తలపు కందని దివ్యసౌందర్య మెంతో
కాళరాత్రిగర్భమ్మున కలదు కాని
అమృత మూటుట లేదె హృదంతరమున ?
విషము వెళ్ళగక్కు గాడ్పులు విసరుచున్న
వింక జీవితయాత్ర సాగించు టెట్లు ?
చేదులో తీపి చూప నెంచితివ ? దేవ !



# దేశీయవాఙ్మయము: వైద్యప్రస్తావన

## వేంకటనాథకవి పంచతంత్రమునందలి వైద్యవిజ్ఞానము

శ్రీ డి. వి. సుబ్బారెడ్డి

దేశీయవైద్య చరిత్రను సాంగోపాంగముగ రచియించుటకు, వైద్యగ్రంథసంచయమేగాక, దేశీయ వాఙ్మయము, శిల్పములు, జనశ్రుతి, సామెతలు, వంశపారంపర్యముగ వచ్చు వాడుకలును దోడ్పడును. మధ్యయుగమున (మహమ్మదీయయుగమున) ఆంధ్రదేశమునందు పొడచూపి, ప్రబలిన, సాంక్రామికరోగములు, వాడుకలోనుండిన చికిత్సాక్రమములు, అక్షరజ్ఞు లెల్ల రెరిగియుండిన ఆయురారోగ్య విజ్ఞాన రహస్యములు, మహాకవుల రచనల విస్తారముగ లేవు. సందర్భానుసారముగ గద్యపద్యముల, వైద్యవిషయముల తడవిన పూర్వకవులలో వేంకటనాథు డద్వితీయుడు.

### సర్పవిద్య (సర్పవైద్యము)

ఆయుర్వేదము యొక్క అష్టాంగములలో నొకటియగు, అగదతంత్రము ప్రయోజనము "సర్పకీటలూతావృశ్చికాది" విషచికిత్స యని సుశ్రుతుని వాక్యము. భారతములోని, కథ పాఠకు లెరింగియే యుందురు. ప్రమద్వర సర్పదష్టయై, "విషవ్యపగత ప్రాణయై" యుండగా, రురుండు "విషతత్త్వ సంహితా నిపుణుల" ప్రార్థించెనట; తుదకు, ఆకాశదూత యుపాయమున, నాబాల నిర్విష యైనదట.

క్రీస్తుపూర్వము 3౨౩-వ సంవత్సరమున, భరతఖండముపై దాడివచ్చిన అలెగ్జాండరు, సింధునదీ తటముల శిబిరములలో నుండు నపుడు, ఈ దేశపు విషసర్పములచే కరువబడిన సైనికులను మృత్యుముఖమునుండి తప్పించుటకు, తన గ్రీకువైద్యపుంగవు లశక్తులైనందున, తక్షశిలానగరపు సుప్రసిద్ధ వైద్యశాస్త్ర పండితుల రప్పించి, తన గుడారమున సిద్ధముగ నుంచుకొనెనని విదేశీయ చరిత్రకారులే వ్రాసియున్నారు.

ఇక, వేంకటనాథుని వర్ణనల తిలకింపుడు.

ఉజ్జయినీపురమున, పార్వతీదేవి గుడి మార్గమున, వారసుదతీమణి "కడకా లోకతాచుపాము..." కరచె. అప్పు డాపణ్యసతి కాయమున దుర్లక్షణములు పొడచూపెను.

తాలువుల నాలాకీ
లాలంబులు చెమ్మగింప లగ్నత్వక్కా
వ్యాలం దూలి శశిక్రతు,
నీలతమోనీలవాల సేలం గూలెన్.

నిరుపేదయో యనాథబాలయో యైన మెకల మరల ప్రాణములతో లేచియుండదేమో, కాని, కథానాయిక అదృష్టవంతురాలు.

ధనికులుగాన, దాని
తలిదండ్రులు జాలెలు చించి యర్థకాం

చవము లవారిగాఁగ వెద
　　జల్లి, వసుంధర చేరు కీర్తియుం
గని, మనువారలం, బరమ
　　గారుడమంత్రకులం బొరింబొరిం
గొని, చనుదేర, వార
　　లలితకుంతల చెంతల చేరి, చేర్పనః॥".

ఎంతమంది విషవైద్యులు వచ్చిరో, ఏయే దేశములనుండి వచ్చిరో, నడచివచ్చిరో, గజ తురగరథా రూఢులై యరుదెంచిరో? ఏరో ప్లేనులు లేకుండుటవలన, నెంతమంది సుప్రసిద్ధ విదేశీయవైద్యులు రాలేకపోయిరో గదా? ఆసువర్ణవృష్టికై బారులు దీరి వచ్చిన వైద్యుల ఆత్రము, ఒక్కొకరి చికిత్సాక్రమములు, వాని ఫలితములు, కార్యము సాధింపలేని ప్రగల్భులు పరాభవముచే నాటికిని, నేటికిని అన్వయించునట్లు కవి వర్ణించినాడు.

"సీ. కాటుపట్టున కత్తివాటుల వైచి
　　నిర్విషమూది మనకున్న బిసిబి నొకడు
ఘటపూర్ణ మంత్రప్రమ్కరధార లెత్తించి
　　గుణము గా.క రోసి తపించి నొకడు
కలికంబుఁ గనుదోయిఁ గదియించి
　　బ్రదికించు క్రోవ దుర్ఘటమైనఁ దొలగె నొకడు
పసరు వెన్నకునెత్తి భ్రామి చెత్తమున ని
　　ట్టటుమోది పనికిరా కరిగె నొకడు

కదియబడియున్న దౌడలఁ గాఉఁ జొనిపి
పాయబడకేసి తనుపాటె పలుచనైన
యౌషధీసారముల బోసి యవియు బాసు
సేయకుండిన నొకడు లజ్జించి చనియె."

క॥ అప్పాట విషచికిత్సకు
లొప్పని వదనములతోడ కొం డెవ్వరికిం
జెప్పక వచ్చినచొప్పున
దప్పక పోవుటయు, వాసుదతి తలిదండ్రుల్.

మానవశక్తికి మించిన పని, దైవసాహాయ్యమునగాని కాదని, గిరిసుత దేవాలయమునకు బిడ్డ నెత్తుకొనిపోయి, ఆమె కరుణారసవృష్టి నర్థించిరి. ఆ పడుచునకు పునర్జీవమిచ్చిన, మంటపము కట్టించెదమని యాదేవికి మొక్కుకొనిరి. ఆ మహాదేవిని నమ్మినవారి కెన్నడును నాశము లేదుకదా! ఆమెకృపా కటాక్ష వీక్షణముల మహిమవలన,

"...అపుడేమి చెప్ప,నట చేసిన నిర్విషయౌచు,నిద్రమేల్కనినదిసంబున న్దెలిసి,కౌతుకసంపదఁ జేర్చె నాప్తులన్".

## రోగులు, రోగములు

శీతకాలమును వర్ణించు ఘట్టమున, నానావిధ రోగులను, వారు సేవించు చికిత్సలను, కవి కడునేర్పుతో చిత్రించినాడు. ఈ వర్ణనను జూచి సాహసికులైన పిల్లచరిత్ర కారు లిది యాకాలపు "జనరల్ ఆసుపత్రి" వర్ణనయని భ్రమపడవచ్చును. ఎలక్షనులు లేని యాకాలమున, గ్రామమంతయు నొక పెద్దకుటుంబమువలె నుండి, గ్రామస్థు లిరుగు పొరుగువారి కష్టసుఖములు తమవిగ భావించునపుడు, చలికాలమున, ప్రతి గృహము నందునుగల రోగుల గణములు, ప్రక్కప్రక్కనుండు రోగులవిశ్రాంతిశాలలందలి రోగుల వరుసల బోలియుండెనేమో! ఈ క్రిందిపద్యముయొక్క విపులార్థమును సంపూర్ణ వ్యాఖ్యలతో, పండితవైద్యులు, భాషావేత్తలు తర్కించినయెడల, నొకటి రెండు చారిత్రక సమస్యలు, తేటపడును.

సీ. చవులవేడబములు చాలించి తలపాగె
　　దళలక చప్పిళ్లు ద్రావువారు
కాయసంధుల మహోగ్రగ్రంథు లొదవిన,
　　కెట్టిదంబుగ నూలబెట్టువారు
రసధూమ మఖిలగాత్రచ్ఛిద్రముల ద్రొక్క
　　నుబ్బలబసి మూల్గుచుండువారు,

సీ. కిస్తగాదోశో చేరమూకాటది
యన్న( శెల్లెలివాని యనెడువారు,
కోరి వాలుడు తైలంబు గ్రోలువారు,
కుములు కుంపటికాకముల్ గోరువారు,
నైరి కొక్కకొంద ఆచ్ఛలి వల సవాథ
వానిధాటివిహారంబు బూనుటయును ॥.

సవాయి

ఈ పద్యమందలి "సవాభవాని" యను మాట యుండు పాదమునుగురించి కొంత సంశయము కలిగెను. అందులకై, ఆంధ్రవిశ్వకళా పరిషత్తుపుస్తకభాండాగారమందలి తాళపత్ర గ్రంథములను పరిశీలించి చూడగా, "సవా" యనుఅక్షరములే అన్ని ప్రతుల లోను స్పష్టముగ నున్నవి. ఆంధ్రసాహిత్య పరిషత్ గ్రంథాలయములోని ప్రతులలోను "సవా"పదమే యున్నట్లు, మామిత్రులు శోధించి వ్రాసియున్నారు. "సవా"పదమునకు, "హాబ్సన్ — జాబ్సన్" అనంబడు కోశము, బ్రౌణ్యము, శబ్దరత్నాకరము, మొదలగు గ్రంథము లన్నియు "సవా రోగము" "రోగవిశేషము" అని అర్థము వ్రాయుచున్నవి. ఆపేరు ఆంగ్లమున "సిఫిలిస్" అనబడు రోగమునకు అన్వయించును. ఈరోగము పరిషియాదేశమున, "సవా" యనబడు పట్టణ ప్రాంతములనుండి విజృంభించిన దనియో, 'సవాయి' అను నామాంతరముగల కిజాపూరు ప్రభువుల రాజ్యము నంటుకొనియుండిన పోర్చుగీసు పరగణాల నుండి ఆంధ్రభూమియందు ప్రవేశించిన దనియో, దాపరించిన దాని కీపేరు పెట్టబడి యుండును. సంస్కృత గ్రంథములలో ఫిరంగి రోగమని పిలువబడిన వ్యాధి, తెలుగుదేశములో "సవాయి"యని పేరుపొందుట కిదియే కారణమై యుండనోపు.

కడుపునొప్పి

సింహమునకు కడుపునొప్పి వచ్చినదట:

"...కర్మానుకూలత, ససద్వృత్తి కుక్షిరోగ
వ్యసనాతిరేక ఖేదానుకంపమాన మగుచు............
పొరలు, వాపోవు, సెలవురు, బొక్కు, ప్రక్కు
బోరగిలబడు, నిట్టూర్పులు నిగుడ్చు."

"క. ఈకీతిం గడుపునొప్పిం
గూరార్తై యుండి, గోడుగుడుచు"

చుండెను. ఆధునిక వైద్యవేత్తలు యీబాధ కేమి పేరిడుదురో? అప్పుడాసింహము, తన మిత్రుని జంబుకమును, కోరినవిధము వినుడు:

చ॥ .. .. .. .. .. కటకాంతభూమిం
బని యరిగోపనం బమర
జంబి శరీరము దెచ్చి, లోపలం
గనుగొనసైన గర్దభము
కండనగాయ గ్రహించి తెచ్చి యి
చ్చి నిలుపు, పాకపోజలిది
శేశనయుండెడు జీవితంబులకా॥

జంతులమారినక్క తానే యవస్తువును భక్షించి, సింహ మడిగినప్పుడు పెద్ద బొంకు బొంకెను. "గార్దభాకారమున లేదు కర్ణహృదయ"మని, పంచతము పల్కు, గేసరి యూరకుండె. పదునారవ శతాబ్దమున, కందనకాయ యేయే రోగములకు చికిత్సగ బరిగణింపబడుచుండెనో, దేశీయ వైద్యులు, ప్రకటింప ప్రార్థితులు.

ఇతర వ్యాధులు

ఆ కాలమున సంభాషణలోను, గ్రామములలోను, సామాన్యముగ ప్రస్తావనకు వచ్చు వ్యాధుల కొన్నింటిని, కవి సూచించి యున్నాడు.

(౧) "కాళ్లమోములును వావ

(౨) పుట్టుగుడ్డి.

(౩) "పిచ్చికుంటువాడు"

(౪) "ఊగెడుపళ్లు"

(౫) "విషప్లీహాన్నమును,కడుపున చేర సీక మహాంగ్రిక్కుట"

(౬) "సంతాపక్లేశరుజలు"

(౭) "చిత్తచాంచల్యంబుపుట్టించుటయు, దానజేసి యంగవైకల్యంబు ఆవిర్భవించె"

(౮) ప్రసూతివరణములు

(౯)గర్భస్రావము

ఇతరములగు వైద్యప్రస్తావనలు కొన్ని యాలకింపుడు:

(౧) ముష్టిహతిచే క్షితి గూలిన కపి, "శైత్యకృత్యముల"వలన కొంతకాలమునకు మూర్ఛదేలినాడట. దీనిని First-Aid అనుట పొరపాటా?

(౨) దొంగవాడు తన రహస్యమునకు, ప్రాణమునకు, భంగము రాకుండ, కొన్ని యత్యవసరములగు చికిత్సాసామగ్రినిజాగ్రత పెట్టుకొని దొంగతనమునకు బైలుదేరినాడట. అట్లు సిద్ధముగ నుంచుకొన్నవి "భుజగవృశ్చిక చికిత్స"లును, "సుప్తిస్వప్నద్ధికరౌషధములు"ను.

(౩) జవరాలికి, ప్రాతమగడు పనికిరాడను భావమును వర్ణించిన పట్టునను సందర్భాను సారముగ కొన్ని వ్రాసినవి.

"తల పేను,పంటిసంది దిపులు, కాలను ముల్లు, వస్త్రమున యూక, కటిస్థలి తీట, పాదరక్షణ శిలవోలె ".

మందులయందు నమ్మకము

అజ్ఞానాంధకార బంధురంబని పేరుగన్న యా యుగమునను, మన దేశమున మంత్రతంత్రముల; కొంతనమ్మక మున్నను, ప్రజా బాహుళ్య మౌషధముల విలువ యెఱింగియే యుండి రనుటకు తార్కాణ మీ క్రిందిపద్యము, భావములు :

(౧)ధనమున బుణశేషము పా
ధనముల రిపుశేష మౌషధంబున దనుసం
జనితగదశేష ముదకం,
బున శిఖిశేషం బశేషముగ జేయదగున్॥

(౨) శింశుమారుని కులాంగనకు బుట్టిన తెవులు లక్షణములు:-పలుకదు,తల యెత్తదు, చూడదు. దూతిగోల వినుదు:

"క. మందులు దెమ్మని చెప్పిన
మందులు నిను గొలుచుభటులు మాతో వలెనో
నిం దెవ్వరు బలుకరు నీ
చందముగా నెట్లు రాధ్విజారుజ మానున్.

ఇందుకు మం దేమిటి ?

"క. ఎలనాగరోగ మణపం
గలమందులు చెప్ప దనిన ఘనశాస్త్రకళా
బలవేద్యులు వైద్యులు గే
వలకీలిం గ్రోలిసుండె వలె నని రధిపా॥

ఈకథయందే, వానరుడు వేసిన ప్రశ్నయు గమనింప దగియున్నది.

క............... ...నీ
దేవిరుజ, మాన్పుటకు శే
రె పెజ్జలు, మందు జెప్పరే వారనినన్॥

అగదంకారులే "వానరహృదయం" బవశ్యమని చెప్పిరని విని మర్కటము, "హృదయము, దరువున నున్నదిగద నా కాయమున లేదుగద" యని, తిరిగిపోయి చెట్టెక్కి తప్పించుకొనెను.

(3) గొల్లడు మందనుండి వచ్చునపుడు "మూలికలు" దెచ్చుకొనుట లోకవిదితము.

(౪) జాలరులు "కారుమొసళ్ళ వాకట్టు మందుల" నుపయోగించుచుండెడివారట.

(౫) మునలిసెట్టి "విటవిటీజాతి" వశ్య భేషజంబు లడుగు."

శాస్త్రజ్ఞానము

కవియొక్క సర్వతోముఖ పాండిత్య ప్రదర్శనా సూచకములుగ, కొన్ని భావ పూరితవాక్యముల నిందు పొందుపఱచు చున్నాను.

(౧) 'హృదయగత చింతాశల్యము పెరికివైవ నీమైత్రి మనోజ్ఞ విశల్యకరణి" యని రామాయణాంతర్గతమగు సంజీవ పర్వత గాథను తడవినాడు.

(౨) "...రోగము లేయపథ్యబంధురు కలగింపవు" అని ఆయుర్వేదాచార్యులవలె చికిత్సాసూత్రముల, పథ్యముయొక్క ప్రాము ఖ్యతను చాటినాడు.

(3) "అవైద్యసాధ్యమగు తెవులు" "పేర్కొనుట, "సాధ్యాసాధ్య" చికిత్సల ప్రకరణముతో పరిచయము చూపును.

(౪) "తను నోర బేరు గ్రుచ్చినవారి కారోగ్య మిచ్చువాడు" అని సార సాప్తుని వర్ణించుట, సూర్యకిరణముల ప్రభావముఁ కొంచమేని నమ్మినవాడనవచ్చును. సూర్యోదయము "ఆశ్రితజన జీవనౌష ధము" గదా!

(౫) అప్తుడగు సచివుడు పల్కు రాజనీతి యెట్లుండునో, నేడు వైద్యసంప్రదాయము వారు పల్కురీతిని వ్రాసినాడు,

క॥.........వేయేటికి, ర
స్థనకుఁ జికిత్సాక్రియవలె
మును చెగటుఁ, బిదపహృద్యమును నై యుండున్.

(౬) దుర్మార్గుల దుర్బోధనల విని ప్రవ ర్తించు రాజు "అపథ్యానురాగియగు రోగి యుంబోలె, ప్రాణధరణ సమర్థుండు గాడు."

(౭) నేటికాలపు టారోగ్య ప్రచారకుల వలె, "Health is better than wealth" అన్నాడు. "ఆరోగ్యసదృశంబగు లాభం బును, శీలసదృశంబగు భూషణంబును లేదు కదా?"

(౮) సంజీవకు డనువృషభము జాను దేశము విరుగ 'నాయుశ్శేషవిశేషమున గుల్లి చివుకక, యచ్చో నీవ ద్రుజ లేక" కాల్వచ్చె నట.

(౯) ఒకకథలో "ముక్కు దఱుగుట" కలదు.

(౧౦) "దండినిప్పుల వసంతములాడు నెండల వడజల్లు వడమటివాయువులును" ఆం ధ్రులకు పరిచయమే.

(౧౧) అతిశయస్నేహము వర్ణించుచు, "తనువు ప్రాణంబు, విరియును దావి" అని భావగర్భితముగ పల్కినాడు.

(౧౨) దీపమువలన చీకటిపోవునట్లు "రోగవ్యాప్తి జెలువంబు" పాయునట.

(౧3) "రోగియు, ...బరాన్నభోక్తయు జీవన్మృతులు."

(౧౪) నెరసుతోడబోలె నేత్రంబు, దుర్భర వ్యాధితోడ బాసి యంగకంబు, కాంతి నుల్లసిల్లు."

## వైద్య వృత్తి యొక్క గౌరవము

ఈ కవిరాజునకు వైద్యులయందును, వైద్యశాస్త్రమందును, నపరిమితమగు నాదరమును, గౌరవమును గలవనుటకు బహునిదర్శనములు, గ్రంథమందు గలవు. బహుశః యితడు ఆయుర్వేదశాస్త్ర పారంగతుడై, ప్రసిద్ధభిషఙ్మణియై, యుండెనేమో !

(౧) వైద్యులు "ఘనశాస్త్ర కళా బల వేద్యులు" అని ప్రశంసించినాడు.

(౨) వైద్యవిద్య పూర్వసుకృతమువలన గాని యబ్బునా ? "పాపజాతి కేల ప్రాపించు బరహితాచరణవిద్య" అను మాటలలో ధ్వని గ్రహించితిరా ? ఆంధ్ర దేశమున ప్రశస్తి గాంచి, రాజులవలన అగ్రహారముల బడసి, అత్యద్భుతములగు వైద్యప్రభావముల ప్రదర్శించి, ఆంధ్రుల కీనాటికిని పఠనీయమగు "పరహిత" సంహిత రచించిన సుప్రసిద్ధవంశము కవికాలమునను, దేశమున గౌరవింపబడుచుండెనేమో !

(3) వైద్యులు ధనార్జన ముఖ్యముగ నెంచువారు గారట. కీర్తియే వీరిఆర్జన. కాని, కృతజ్ఞతాగౌరవములు చూపనియెడ, రాజులనైన బాసిపోదురట. ప్రజలు ప్రభుత్వము భిషగ్వరులును యీక్రిందిపద్యమును వల్లించి ఆనందింతురు గదా !

చ॥ ఫలితచికిత్సకోగ్రములఁ బాపశుభక్రియుల న్మహోఘము,
లొప్పలుపటకేయు, నీతిగనము ల్బహుభంగుల గూడ
బెట్టి గే, వలపరతంత్రులై మెఱయు వైద్యవిపశ్చిద
మాత్యులం ధరా, తలపతి, బాసిపోవును రతండు,
కృతజ్ఞుడు, గాకయుండినన్.

---

# 'డ్రై సబ్జక్టే' నా, ప్రయోజన మేదైనా ఉందా?

శ్రీ గరిమెళ్ల అన్నాజీరావు

'డ్రైసబ్జక్టు' అంటే తడి (రసము) లేని దన్న మాట; అనగా సులువుగా బోధపడని విషయం. దానియందు అభిరుచి ఉండదు. ప్రయోజనముకూడ సున్నే. ఇట్టిసంగతులు దేనికి నిరూపిస్తున్నామో అదీ 'డ్రై సబ్జక్టు'—

ఈలక్షణములు దేనికి ఉన్నవో చెప్పవలెనా? గణితశాస్త్రమునకే; లేకపోతే, 'యూక్లిడు ఫస్టు బుక్కు'లో ౪౭-వ 'ప్రాపోజిషను' యొక్క ప్రయోజన మేమిటి? 'పెర్ముటేషన్సు అండ్ కాంబినేషన్సు'లో లెక్కలు చెయ్యలేక బుర్ర పాడు చేసుకొనడ మెందుకు? 'బైనోమియల్ థీరం' ఉపయోగం ఈప్రపంచంలో ఎందుకైనా ఉందా? $a^2$, $b^2$ లనుగూర్చి తెలుసుకొనకపోతే వచ్చిన లోటేమిటి జీవితానికి? 'అలెగ్జాండరు పోపు' చెప్పినట్లు "మన మనస్సును ఎంతవరకు సాగదీయగలమో చూపడానికి చేస్తూఉన్న గారడీ" కాని ఈవిద్యవల్ల ప్రయోజన మేమిటి? అది నేర్చుకుంటే పుణ్యమా? పురుషార్థమా? ఉద్యోగాలా యీరోజుల్లో? కుర్రవాడు ఏ చవట మో కాని ప్యాసు కాలేక!

ఇవి అందరకూ తోచే శంకలేకాని సమాధానం దొరకడంమాత్రం బహు కష్టం. సమాధానం ఎవరికీ దొరకకపోవడంచేతనే ఈ 'సబ్జక్టు' ఎవరికీ నచ్చటం లేదు. ఉపయోగ మున్నట్లు సరిగా కనిపించకపోవడం వల్ల అందరూ తిట్టేవారే. ఇటువంటిదానిని ప్రతి విశ్వవిద్యాలయమువారూ తప్పనిసరిగా పరీక్షకు కావాలనడంవల్ల మరింత ఇదిగా ఉంటోంది. పోనీ, ఎల్లాగో పాకులాడుదాం అంటే చప్పన బుర్రకు ఎక్కదే! ఎక్కితే నిలబడదే! ఇందువల్ల దీనియందు అభిమానం, అభిరుచి మరింత పోయింది. ఇల్లాగ ఉంటూఉంటే ఉపాధ్యాయులు దీనిని నచ్చేటట్లు చెప్పకపోవడం ఒకటి. దీనిని ఏ పెనుభూతంలాగో చూపించడం కూడాను. కొంతమంది ఉపాధ్యాయులు చెప్పతూ ఉంటే విన్నాను, "ఒరేయి, ఇది చాలా కఠినం సుమా. జాగ్రత్తగా చేస్తూ ఉండాలి. లేకపోతే, ఫేలయిపోతావంతే!" అనడం. అంతేకాక ఇది ఒక పెద్ద బూచిలాగ చూపెట్టడం. దీనితోటి పిల్లవానికి గుండెలలో మరింత రాయి పడడం. ఏవో ఇల్లాటి కారణాలు చాలా ఉన్నాయి. లేకపోతే, దీనియందు ఇట్టి విపరీతభావాలు ఎందుకు కలుగుతాయి?

అయితే, గణితశాస్త్రం సులువుగా బోధపడదు గదా అని చెప్పి వదలివేయడమేనా? 'షేక్స్పియరు' అంతా సులువుగా బోధపడకపోతే ఏ 'యూనోటే వస్తో' పెట్టుకుని ఎల్లానో తల్లకిందుపడి వాడితో కుస్తీపట్టడం లేదూ? భూమి ఉన్నంతమాత్రాన మనకు సులువుగా భుక్తి జరగదు. దానిలో దుప్పలు కొట్టి, బాగా దున్ని, పైరు నాటి, సాగుబడి చేస్తే ఫలసాయానికి వస్తుంది కాని కష్టం అని చెప్పి ఊరుకుంటే కడుపు నిండదు. సులువుగా బోధపడదు కాబట్టే మనలో ఉన్న శక్తిసామర్థ్యములు ధారపోసి కష్టపడి నేర్చుకోవాలి. ఆ ప్రయత్నంలోనే మనలో దాగిఉన్న తెలివితేటలు బయలుపడతాయి. అన్నీ అరిటిపండు ఒలిచిపెట్టినట్టు లుంటే మనప్రయోజకత్వం ఏమిటి?

అభిరుచి (Interest) లేకపోతే ఏపనికైనా స్వస్తి చెబుతున్నాం సాధారణంగా. అల్లాంటప్పుడు లెక్కలు ఒక లెక్కా అనవచ్చు. సత్యం పలకాలని అందరకూ తెలుసు. కాని నిజం పలికేవారు బహు

తక్కువ. అది విధి అని అందరకూ తెలుసుగాని ఇట్టి విధులను ఆచరణలో చూపించేవారు బహు తక్కువ. నిజంగా ఈవిధులలో ఎవరికి అభిరుచి ఉంటుంది? పైగా కష్టంగానే ఉంటుందికూడాను. అభిరుచి ఉన్నపని ఎల్లాగా చేస్తారు కాని అభిరుచి లేకపోయినప్పటికీ విధి అని తెలిసినతర్వాత ఆ పని నిర్వహించడమే మానవున కుండవలసిన లక్షణం. ఇదే విద్యాభ్యాసమువల్ల కలగవలసిన మొదటి విషయమూ ఆఖరువిషయమూకూడాను.

గణితశాస్త్రముయొక్క ప్రయోజనం లేదను కొందాము మాటవరసకి. ప్రయోజన మంటే ఎంతసేపూ రూపాయలు గణించడమే కాదు. ఏదైనా పనిచేస్తే దానివల్ల మనపొట్ట ఎంతవరకు నిండుతుంది? అనే భావన కూడదు. మనం చేసే ప్రతి కార్యమునకూ ప్రయోజన మంటుందా? ఉంటోందా? అందులోనూ ఇటువంటి విధి నిర్వహించడంలో గీతాకారుడు చెప్పిన విధంగా మనము ఫలితమును ఆశించకూడదు.

ఇంతకూ ఈశాస్త్రంయొక్క ప్రయోజన మేదైనా ఉందా, లేదా?

దీనిప్రయోజనం ఇది అని చెప్పడానికి ఏదీ కనిపించడం లేదు. నివురుకప్పిన నిప్పులాగ ఉంది. పైకిమాత్రం గంభీరంగా గడబిడచేస్తూఉన్న సముద్రం లాగ ఉంది కాని లోపల ఆణిముత్యా లున్నాయి. అవి అందరకూ లభించకపోవచ్చు. కొంతమందికి ఒడ్డున ఉన్న నత్తగుల్లలు, బొమ్మరాళ్లుమాత్రమే కన బడవచ్చు. జలాంతర్గామి మొదలైన యంత్రసాధన ములతో లోనికి పోవువారికిమాత్రమే ముత్యాలు దొరుకుతాయి.

గణితశాస్త్రం సిసలైనశాస్త్రం (Exact science). ఏ శాస్త్రవిషయానికైనా ఇద్దరకు భేదా భిప్రాయం ఉండవచ్చునుగాని దీనియందుమాత్రం అటు వంటిది ఉండదు. అందుచేతనే గణితశాస్త్ర నిశ్చయం (Mathematical certainity) అని వాడుకలో ఉంది. ఎక్కాలుమొదలు నవీన పరిశోధనాంశముల వరకు అందరూకూడ శిరసావహించవలసినదే. ఈ శాస్త్రంలో జను లందరిచేతాకూడ ఆమోదింపబడే యథార్థవిషయాలు చూస్తున్నాం. ఇంతకూ కారణం ఇది ఒక గొప్ప 'డిడక్టివ్' సైన్సు కాబట్టి. సాధారణంగా శాస్త్రాలన్నీకూడా 'ఇండక్షను'వల్లనే వృద్ధిపొందుతాయి. గణితశాస్త్రమూ అంతే. కాగితం మీద ఒక త్రిభుజమును గీసి అందులో మూడు కోణములూ కొలిస్తే వాటిమొత్తం రమారమి ౨ సమ కోణము లున్నట్లు కనిపిస్తుంది. మరొక త్రిభుజము గీసి మూడు కోణములూ కొలిస్తే రమారమి ౨ సమ కోణములే ఉన్నట్లు కనిపిస్తుంది. ఇల్లాగ ప్రతిత్రిభుజము లోని కోణముల మొత్తం ౨ సమకోణము లుంది కాబట్టి ఏ త్రిభుజములో అయినా కోణముల మొత్తం ౨ సమకోణము లుంటుం దని సిద్ధాంతం నిరూపి స్తున్నాము. ఇట్లు ప్రత్యేకవిషయ పరిశీలనవల్ల సిద్ధాంతనిరూపణ చేయడం 'ఇండక్షను' అంటారు. ఇట్టిపద్ధతివల్ల ప్రతి శాస్త్రమూకూడ అభివృద్ధి పొందు తుంది. గణితశాస్త్రంకూడా అంతే కాని అంతటితో ఊరుకోదు. ఇప్పుడు సంపాదించిన సిద్ధాంతమును తిరిగి అన్ని ప్రత్యేక విషయాలకు సరిపోతుందో లేదో అని తరిచివేసి చూస్తుంది. ఈ నూతనసిద్ధాంతమును ప్రతి ఇతరవిషయమునకు తగిల్చి ప్రకృతివిరుద్ధము కాదు కదా అని పరిశోధిస్తుంది. మూలాంశముల (Fundamentals) నుండికూడా ఈసిద్ధాంతాన్ని సాధించి తిరిగి ఈ నూతనసిద్ధాంతంనుండి ప్రకృతివిరుద్ధను కాని ఇతరవిషయాలను నిరూపిస్తుంది. ఈ పరిశోధనాపద్ధ తంతా 'డిడక్షను' పని. ఇందు గణితశాస్త్రం ఆరి తేరింది. ఇల్లాగ 'డిడక్షను'వల్ల నిలబడిన శాస్త్ర విషయమే చెల్లుబడి అవుతుంది. ఈ సిద్ధాంతానికి 'ఎక్సెప్షను' లుండవు. అందుచేతనే ప్రపంచములో తెల్లని కాకులనైనా చూస్తున్నాం కాని గణితశాస్త్ర సిద్ధాంతాలలో తప్పు లుండడంకాని, 'ఎక్సెప్షను' లుండడంగాని ఎప్పుడూ లేదు.

ఇది ఇంత సిసలైన శాస్త్రం అవడమే కాకుండా ఇతరశాస్త్రముల కన్నిటికి మూలాధారం. గణితశాస్త్రమునుగురించి చెబుతూ 'బేకన్' మహ శయుడు " Mathematics is the gateway an

the key to other sciences"—"గణితశాస్త్రం ఇతరశాస్త్రముల కన్నిటికి సున్నమూ తాళంచెవి కూడాను" అన్నాడు.

ఇప్పుడు పదార్థ విజ్ఞానశాస్త్రము (Physics) ఇంత అభివృద్ధి పొంది ప్రపంచములో గొప్పస్థానం అలంకరించి ఉండడానికి కారణం దీనికి గణితశాస్త్రం ఇస్తూ ఉన్న చేయూత అని చెప్పక తీరదు. ఈ శాస్త్రంలో తగిన జ్ఞానం సంపాదించడానికి గణిత శాస్త్రముయొక్క సహాయము లేనిదే ఎవరికైనను బహుకష్టము. సాధారణంగా జరిగేపని ఏమిటంటే, ప్రకృతిలోని విషయములను విమర్శించి వాటి ఫలిత ములను గొప్ప సిద్ధాంతములుగా నిర్మించుతాడు గణిత శాస్త్రజ్ఞుడు. అవి పదార్థ విజ్ఞానశాస్త్రజ్ఞుని ఆకర్షించు తాయి. అప్పు డతడు ఈసిద్ధాంతములను రుజువుచేయ డానికి ప్రయోగములు (Experiments) చేస్తాడు. ఈ ఇద్దరిసహాయముచేతనే కొత్తకొత్త విషయాలన్నీ కనిపెట్టబడుతున్నాయి. ఈ 'రైల్వేలు'గాని, 'టెలి గ్రాఫులు'గాని, విమానములుగాని, 'రేడియో'లుగాని ఈఇద్దరిమూలముననే. ఇద్దరూకూడా ఒక్కడే అయితే ఇంక చెప్పవలెనా? ఏపదార్థ విజ్ఞానశాస్త్రజ్ఞుడు ఏసంగతి సాధించినప్పటికీ గణితశాస్త్ర సహాయము వలననే. పాశ్చాత్య వైజ్ఞానికుడైన 'ఐన్‌స్టైన్' సాధిం చిన 'Theory of Relativity అనునది ఈ గణిత శాస్త్ర సంపర్కమువల్ల కలిగినదే.

ఆకాశంలో ఏదైనా కొత్తగ్రహము ఏ నిమి షంలో ఏభాగమున ఎల్లాగ కనిపిస్తుందో లెక్కలుచేసి గణితశాస్త్రజ్ఞుడు రాబోయే విషయాన్ని సూచిస్తాడు. అప్పుడు ఖగోళశాస్త్రజ్ఞుడు (Astronomer) దానిని దూరదర్శినిద్వారా చూచి ప్రపంచానికి విశదపరుస్తాడు.

శాస్త్రములే కాక చాలా కళలుకూడా ఈగణిత శాస్త్రంవల్లనే పోషించబడుతున్నాయి. గ్రామంలో చిన్నచిన్న కర్రపనులుచేసే వడ్రంగిమొదలు 'బ్రిటా నికా బ్రెడ్జి' కట్టే పెద్ద మేస్త్రీవరకు ప్రతివాడూ కూడ రేఖాగణితంలోని Space relations తప్పక స్మరణకు తెచ్చుకోవలసిందే. గొప్పగొప్ప కట్టడ ములలో జరిగే ప్రతికార్యమూ ఈశాస్త్రముమీదనే ఆధారపడి ఉంది. భూమిని కొలిచే 'సర్వేయరు'గాని, దానిమీద నిర్మించబోయే కట్టడంయొక్క 'ప్లాను' వేసేవాడుగాని, 'ఫౌండేషను' వేసేవాడుగాని, రాళ్లను చెక్కి అమర్చే తాపీవాళ్లుగాని, అందు పని చేసే వడ్రంగులుగాని, ఇంకా మిగిలినవన్నీ జరిపుచ్చే ఏపనివాళ్లుగాని రేఖాగణితసంప్రదాయములు తెలియ నిదే ఒక్క అడుగైనను పని సాధించలేరు.

'రైల్వే'లో మొదటనుంచి చివరవరకు రేఖా గణిత ఉపయోగమే. 'లైను' చూడడం, 'ప్లాను'లు వేయడం, త్రోవలో వంతెనలు నిర్మించడం, తూములు పెట్టడం — వీటన్నిటికి గణితశాస్త్రమే ఆధారం. రైలు మార్గంలో వంపు తిరిగేచోట లోపలకమ్మికంటె వెలు పలకమ్మి ఎంత ఎత్తు ఉండవలెనో చెప్పేది గణిత శాస్త్రమే.

పెద్దపెద్ద వంతెనలూ 'హార్బరులు' కట్టడం, ఓడలు నిర్మించడం, ఓడలు నడపడం మొదలైనవన్నీ గణితశాస్త్ర సంప్రదాయములమీదనే ఆధారపడి ఉన్నాయి.

గణితశాస్త్రము లేనిదే 'ఇంజనీరింగు'శాఖే లేదని చెప్పవచ్చు.

'మెకానిక్స్' అనే గణితశాస్త్ర భాగంవల్ల ఇప్పుడు ఈయంత్రయుగంలో జరిగే అద్భుత విష యాలు చెప్ప నక్కరలేదు. ఏజాతియొక్కగాని, ఏదేశంయొక్కగాని భావిభాగ్యోదయము ఈశాఖా విషయజ్ఞానంమీద ఆధారపడి ఉందేమో అనిపిస్తుంది.

రేఖాగణితశాస్త్రంలో విశ్వమంతా ఇమిడి ఉంది—

Plane geometryవల్ల భూప్రదేశంమీద ఉన్న Space relations తెలుస్తున్నాయి.

Conicsయొక్క ఉపయోగం ఏమీ లేదను కొన్నారు. కాని 'కెప్లర్' శాస్త్రజ్ఞుడు దీనికే సూర్యునిచుట్టూ తిరిగే గ్రహములగతులకూ ముడిపెట్టి ఖగోళశాస్త్రంలో ఉన్న చిక్కులు కొన్ని తొలగిం చాడు. అంతే కాదు. మనం ఏదైనా ఒకరాయి

విసిరినా, ఒక బాణం వదిలినా, ఒక తుపాకి గుండు పేల్చినా దానిమార్గం Parabola లాగ ఉంటుంది. సూర్యునిచుట్టు తిరిగే భూమియొక్క గతి Ellipse లాగ ఉంటుంది. తోకచుక్క తిరిగేమార్గం Hyperbola లాగ ఉంటుందట. అల్లాంటప్పుడు వీటినిగురించి ఇంకా తెలుసుకోవాలంటే Conics భాగము చదవవలసిందే.

Trignometryలోను Algebraలోను అంతా గారడీలాగ కనిపిస్తుంది. ఇందులో e, Π మొదలైన Imaginary quantities వస్తాయి. Real quantities తోటే బాధపడుతూ ఉంటే ఇవి ఎక్కడ వచ్చాయి మన ప్రాణానికి అనుకున్నాం. కాని ఆలోచించి చూస్తే ఇవి Hyperbolic functionsకు మూలాధారమై ఉన్నట్లు కనిపిస్తుంది. దీనిమీద ప్రస్తుతం 'సైన్సు' ఎంతో ఆధారపడిఉంది.

Hyperbolic geometryవల్ల Elliptic geometryవల్ల విశ్వమంతా అతివిశాలమై అంతులేనిదై ఉండి మానవునికిం చిజ్ఞతను చూపుతూఉన్నట్లు కనిపిస్తుంది.

మొత్తంమీద రేఖాగణితశాస్త్రంలో ఆది, అంతూ లేని ఈవిశ్వంలో భూతభవిష్యద్వర్తమాన కాలములకు మించిన కాలపరిమితిలో ఎల్లప్పుడూ సంచరించే గ్రహతారకాదులకు సంబంధించిన సిద్ధాంతములు ఎన్నో ఇమిడిఉన్నాయి. 'గెలీలియో' చెప్పినట్లు రేఖాగణితశాస్త్రంలో గీతలు, బొమ్మలు అనే లిపితో విశ్వమనే పుస్తకము వ్రాయబడింది.

ఖగోళశాస్త్రం (Astronomy) అనే గణితశాస్త్రభాగంలో గ్రహములగతి, వాటికి మన ముండే భూమికిగల దూరము, మనమండలాధిపతియైన సూర్యుని చుట్టూ ఈగ్రహములు తిరగడానికి పట్టేకాలము మొదలైనవి తెలుస్తాయి. ఒకే గ్రహం (శుక్రుడు) సంవత్సరంలో కొంతకాలం సాయంత్రము పొడిచే చుక్కగాను మిగిలినకాలం తెల్లవారుజామున పొడిచే చుక్కగాను ఎల్లాఉందో, అదే ఒక్కొక్కప్పుడు పగలుకూడా ఎందుకు కనిపిస్తుందో మొదలైన విషయాలు ఎన్నో ఉన్నాయి. తోకచుక్క లంటే ఏమిటో, అవి పొడిచేటప్పుడు మనవారు చెప్పే సిద్ధాంతములకు ఆధార మేమిటో ఈశాస్త్రంలోనే ఉంది. సూర్యగ్రహణం పౌర్ణమినాడు, చంద్రగ్రహణం ఏకాదశినాడు ఎందుకు పట్టకూడదో, రాహుకేతువు లెవరో, చంద్రుడు మన నెత్తిమీద పడిపోకుండా ఎందుకు అల్లాగ నిలబడిఉన్నాడో, అందులోని నల్లని మచ్చ ఏమిటో, ఒక్కొక్క నక్షత్రమునుంచి కాంతి కిరణములు మన ముండే భూమికి చేరడానికి ఎన్ని వేల సంవత్సరములు పట్టుతుందో, రాత్రింబగళ్లూ ఋతువులూ ఎల్లాగ కలుగుతున్నాయో, అధికమాసా లెందుకో —శరీరాన్ని సంసారాన్ని దుఃఖాన్ని మరిపించి మరో ప్రపంచంలోకి తీసుకుపోయి ఆనందసముద్రంలో ముంచే విషయాలు ఎన్నో ఎన్నో — ఈ శాస్త్రంలో ఉన్నాయి.

మనం అభ్యసించవలసిన విద్యావిషయాలు రెండు రకాలు — విజ్ఞానం (Knowledge) ఇచ్చేవి, శిక్షణ(Discipline)కు తోడ్పడేవి. ఒక్కొక్క కాలంలో ఒక్కొక్కదానికి ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చేవారు. ఇప్పటికీ కొంతమంది మొదటిరకం ముఖ్యమనీ కొంతమంది రెండోరకం ముఖ్యమనీ వాదన చేస్తూనే ఉన్నారు. కాని ఈరెండురకముల విషయములూకూడ మానవాభివృద్ధికి ముఖ్యమైనవే. ఇంతవరకూ గణితశాస్త్రము మనకు విజ్ఞానం ఎల్లాగ చేకూర్చుతుందో తెలుసుకున్నాం. ఇంక శిక్షణవిషయంలో ఇది ఎంతవరకూ పనికివస్తుందో చూద్దాం. ఇక్కడ కూడా ఇది ముఖ్యస్థానమే అలంకరిస్తోంది.

గణితశాస్త్రాభ్యాసంతో మనమనస్సుకు కలిగే పరిశ్రమవల్ల బుద్ధికుశలత ఏర్పడుతుంది. సాధారణంగా పిల్లవాడికి చిల్లరతిండియందున్న అభిరుచి శరీర వ్యాయామంలో ఉండదు. ప్రత్యేకంగా తిండి తినడమే మొదలుపెట్టితే అజీర్ణం పట్టుకుంటుంది. కాని ఎంత వ్యాయామంచేస్తే అంత తిన్న తిండి జీర్ణించుకొని ఆరోగ్యవంతు డౌతాడు. అల్లాగే ఈశాస్త్రం చదవడం వల్ల ఇతరవిషయాలు సులువుగా బోధపరుచుకో గలుగుతాడు. బుద్ధికుశలత కలగజేయడంలో గణిత

శాస్త్రం తోడ్పడుతుందిగదా అని అమాంతంగా అందరూ గణితశాస్త్రజ్ఞులు కావాలనికాదు నేను చెప్పేది. దీనివల్ల కలిగే బుద్ధికుశలత ఇతరవిషయములు గ్రహించడంలో ఉపయోగించుకోవచ్చు. ఇదివరకే గొప్ప తెలివితేటలుగలవా రున్నారు, ఇంక ఈశాస్త్ర మెందుకు అనవచ్చు. ఇదివరకే శరీర దారుఢ్యము కలవా రున్నప్పటికీ శరీరవ్యాయామమువల్ల వారికిగాని ఇతరులకుగాని ఇంకా దారుఢ్యము కలుగుతుంది. అల్లాగే బుద్ధి ఇంకా అభివృద్ధి పొంది వికసించడానికి ఈవిద్య తోడ్పడుతుంది. అదీకాక, త్రిభుజంలోని మూడు కోణముల మొత్తం ౨ సమకోణములకు సమాన మవుతుందనే ఏగణితశాస్త్ర సిద్ధాంతమువల్లనో బుద్ధి వికాసం కలుగుతుందని కాదు. ఈసిద్ధాంతనిరూపణంలో గాని, ఈసిద్ధాంతమును బలపరచడంలో గాని విద్యార్థికి కలిగే విషయగ్రహణశక్తి, ఇతరులను ఒప్పించుటకు అడుగడుగునకూ కావలసిన 'డిడక్షను 'పైన ఆధార పడే హేతువాదమూ, మొదలైనవాటివల్ల బుద్ధి వికాసం కలుగుతుం దని నాఅభిప్రాయం.

ఈశాస్త్రంవల్ల ఏకాగ్రత, పట్టుదల, జ్ఞాపకశక్తి అలవడుతాయి. ఇవి ఇదివరకే ఉన్నట్లయితే బలపడుతాయి.

లెక్కలు గుడ్డెద్దు చేలో పడ్డట్టు చదవడానికి వీలు లేదు. అది అసలు చదవడానికికాని, వల్లించడానికిగాని వీలుకానిది. అది 'వర్కు' చేయవలసిందే. మామూలుగా స్కూలులలో ఉన్న 'సబ్జక్టు'లలో ఏ చరిత్రో, ఏభాషో అయితే పైవాడు చదువుతూ ఉన్నప్పటికీ విని ప్యాసు కావచ్చు. కాని లెక్కలు మాత్రం కష్టపడి ఒళ్లువంచి చేస్తేనేకాని మోక్షంలేదు. ఈ 'వర్కు' చేయడంలో ఒక అడుగు (Step) తరవాత మరొక అడుగు వేస్తూ చివరవరకూ రథం నడిపించుకు వెళ్లాలి. చేస్తూన్న లెక్కయందు మనస్సు పూర్తిగా ఉంచలేనేకాని ఇటువంటిపని సాగదు. అందుచేత దానియందు క్రమంగా ఏకాగ్రత అలవాటు పడుతుంది. ఏకాగ్రత లేకుండా మనస్సు పరిపరి విధముల ప్రసరించేయెడల వాడు ఏశాఖలోఅయినా ప్రయోజకత్వం సంపాదించలేడు. ఏకాగ్రతలేకుండా మనస్సు అనేక విషయాలమీద సంచరిస్తూ ఉండేవానికి ఈగణితశాస్త్రాభ్యాసంవల్ల లక్ష్యము చేకూరుతుంది. ఎందుచేతనంటే, లెక్క చెయ్యడంలో దృష్టి ఏమాత్రం చెదరిపోయినప్పటికి వాడు లెక్క తిరిగీ మొదలుపెట్ట వలసిందే. లేకపోతే తర్వాత అడుగు వేయలేడు. అందుచేత లెక్కలు ఏమాత్రం చేసినప్పటికీ లక్ష్యముంచి చెయ్యాలి. ఇందువల్ల క్రమశిక్షణ కలుగుతుంది.

చలించే మనస్సు ఎల్లాగో లాగి చేస్తూన్న లెక్కమీద లక్ష్యం గట్టిగా ఉంచడానికి చేసే ప్రయత్నంవల్లా, కఠినమైన లెక్కలు ఎల్లాగో సాధించాలనే భావనచేతా, మనకు పట్టుదలకూడా అలవడుతుంది. ఈకార్యదీక్ష ప్రతికార్యానికీ జీవితంలో అవసరమే. ఇది లేకపోవడంచేత ఎన్నిసమస్యలు భగ్నమైపోతున్నాయో చూస్తూనేఉన్నాం.

స్వయంగా లెక్కలు ఎన్ని చేశామో అన్నీ అర్థమయ్యాయన్నమాటే. లేకపోతే ఒక్క అడుగైనా వేయలేము. చదవడంలో అల్లా కాదు. దృష్టి పాఠం మీద లేకుండా చదివినదానిలో ఒక్కవిషయమైనా తెలియకుండా పేజీలుపేజీలు చదివెయ్యవచ్చు. అల్లాగ చదివేవాళ్లను చూస్తున్నాంకూడాను. ఆచదివిన దానిలో జ్ఞాపకం అసలేఉండదు. అర్థం గ్రహించుకుంటే చేసే విషయం జ్ఞాపక ముంటుందిగాని ఏవో వార్తా పత్రికల వృత్తాంత మంతా జ్ఞాపక ముండదు. బోధపరుచుకుంటూ చేసే పనివల్లనే జ్ఞాపకశక్తి అభివృద్ధి పొందుతుంది. లెక్కలు చెయ్యడంలో పట్టుదల, ఏకాగ్రత ఉంటాయి కాబట్టి చేసినంతవరకూ అర్థమై తీరుతుంది. దీనివల్ల జ్ఞాపకశక్తి బలపడుతుంది.

గణితశాస్త్రం కష్టమైనవిషయ మవడంచేత ఎక్కువ పట్టుదలతో పని చెయ్యాలని ఇదివరలో చెప్పేను. కాని ఆలెక్కలు ఎప్పటికప్పుడే మన అశక్తతను చూపించుతూఉంటాయి. ఇది "నాకేమి సర్వ విషయములూ ఇట్టే గ్రహించుతాను" అనేభావన తొలగిస్తుంది. కొత్తలెక్క వచ్చేటప్పటికి గర్వంతో దానిని సమీపించడానికి వీలు లేదు. అందుచేత క్రమంగా నమ్రభావం (Humility) అలవాటుపడుతుంది.

ఈశాస్త్రాభ్యాసం ఎక్కువగా ఆలోచనతో (Speculation) కూడి ఉంటుంది. ఇదికూడా ఒకశక్తే. దీనివల్ల ఇతర శాస్త్రవిషయాలు సులభంగా బోధపడుతాయి. అందులో వేదాంతం ఒకటి, ప్రయత్నం చేస్తే. గరుకుగా ఉండే స్థలంమీద బంతిని దొర్లిస్తే కొద్దిదూరంలోనే కొద్దిసేపటికే ఆగిపోతుంది. గరుకు తగ్గిసును పెక్కిన తర్వాత బంతి ఎల్లాగపడితే అల్లాగ సులభంగా దొర్లించడానికి వీలుంది. మనస్సు కుండే ఈగరుకుతనం గణితశాస్త్రాభ్యాసంవల్ల పోయి సాఫు అవుతుంది. అప్పుడు వేదాంత మనే బంతి హాయిగా దొర్లుతుంది. వేదాంతం అంతాకూడా గణితశాస్త్రం లాగే ఆలోచనభాగమే, శాస్త్రచర్చకే కాకుండా వేదాంతం అనుభవంలోకి తీసుకు రావడానికి కావలసిన ధ్యానమునకు, ఏకాగ్రచిత్తమునకు ఈశాస్త్రం ఎంతో తోడ్పడుతుంది. మరొకసంగతి. సున్న (Zero) యొక్క విలువ తెలిసికోవడంలోను, బిందువు (Point) యొక్క పరిమాణం తెలిసికోవడంలోను సూక్ష్మతర మూల్యములు (Infinitesimal quantities) ఈ శాస్త్రజ్ఞుడు గ్రహించి తలపోయ గలుగుతాడు. అట్లే ఖగోళశాస్త్రంలో ఆదీ అంతూ లేని విశ్వంలో ఒక నక్షత్రమునకు మరొక నక్షత్రమునకుగల దూరం ఎన్నో 'బిలియనుల'పై ళ్లున్నట్లు చూపాడు. ఇందువలన మహత్తర మైన విలువలు (Infinite quantities) గ్రహించి తలపోయ గలుగుతాడు. ఇట్టి సూక్ష్మతర మహత్తర విషయగ్రహణశక్తికి అలవాటు పడిఉన్న గణితశాస్త్రజ్ఞునకుమాత్రమే "అణోరణీయాన్ మహతో మహీయాన్" అని బ్రహ్మపదార్థమును వర్ణించడంలో ఉన్న భావన సులభంగా బోధపడుతుం దేమో అనిపిస్తుంది.

Book works మాట ఎల్లాగ ఉన్నా Problems చెయ్యడంలోమాత్రం బహుకష్టముంది. ఇవి మొద్దువక్కలే. కాని ఒకసారి నమలగలిగితేమాత్రం అమృతం ప్రసాదిస్తాయి. అందువల్ల కలిగే ఆనందమునకు మితిలేదు. ప్రత్యక్షముగా ఏ అందమైన వస్తువునో చూచి పొందే ఆనందముకంటె మనస్సు ఉపయోగించి కఠిన సమస్యను ధైర్యంగా ఎదుర్కొని జయించడం (Intellectual conquest) వల్ల కలిగే ఉషారు ఇంతా అంతా కాదు. "నాకు తెలిసిందోయి, నాకు తెలిసిందోయి" అంటూ 'ఆర్కిమిడీసు' వెర్రివాడిలాగ పెట్టినకేకలు ఇట్టి మేధా జయంవల్ల కలిగిన ఆనందచిహ్నములే.

ఇట్టిసందర్భంలో ఈశాస్త్రం కొంతమందికి ఎంత అభిరుచో, అందులో లెక్కలు చేసేటప్పుడు వారు ఒళ్లు ఎల్లాగ మరిచిపోయేవారో చెప్పడం అనుచితం కాదని తోచింది. కొద్ది ఉదాహరణలు మాత్రమే చెబుతాను.

'ప్లేటో' అను గ్రీకుమహాశయుడు తనపాఠశాలకు గుమ్మందగ్గర "రేఖాగణితం తెలియనివా రెవరూ లోనికి రాకూడదు" అని వ్రాయించాడట. అంతే కాదు. ఒకప్పుడు రేఖాగణితం తెలియనివాడు ఒకడు తన పాఠశాలలో చేరడానికి వస్తే వానిని చేర్చుకోలేదటకూడాను.

పూర్వం ఒకవూరిని శత్రువులు ముట్టడివేశారు. ఒక అరుగుమీద లెక్కలు చేసుకుంటూ కూర్చున్నాడొకడు, ఏసిద్ధాంతో. శత్రుసైనికు డొకడు వీడి దగ్గరకు వచ్చి, కత్తి తీసి చంపడానికి సిద్ధమయ్యాడు. సిద్ధాంతి కేమీ తెలియలేదు. "చంపేస్తా నిన్ను. సిద్ధంగా ఉండు" అని సైనికుడు పలికేసరికి సిద్ధాంతి మొహం పైకెత్తి "ఉండవోయ్, వచ్చేసింది" అంటూ మళ్లీ పలకమీద అంకెలు వేస్తూనేఉన్నాడు, తన ముందు సంగతి ఆలోచించుకోకుండా.

గణితశాస్త్రజ్ఞులలో మేటి అని చెప్పదగిన 'సర్ ఇజాక్ న్యూటను' ఒక స్నేహితుని భోజనానికి పిలిచి ఆమాట మరిచిపోయాడు. స్నేహితుడు వేళఅయినతర్వాత వచ్చాడు. కాని 'న్యూటను' మాత్రం ఒకలెక్క సాధిస్తూ ఒళ్లుమరిచి ఉన్నాడు. 'న్యూటను'కోసం ఒక్క పళ్లెంలోమాత్రమే అన్నం వడ్డించి బల్లమీదపెట్టి వెళ్లిపోయాడు వంటవాడు. స్నేహితుడు ప్రక్కనే ఉన్నాడు. భోజనం ఎదుటి బల్లమీదే ఉంది. 'న్యూటను' మాత్రం ఎప్పటికీ తల ఎత్తి చూడడే! అతనిని కదపడానికి ఇష్టంలేక

కూర్చునికూర్చుని అన్నేహితుడు పళ్లెంలోని దంతా తినేసి వెళ్లిపోయాడు. కొంతసేపటికి సమాధినుండి లేచి పళ్లెంలోని దంతా ఇదివరకు తానే తిన్నా ననుకొని ఒక్క తేనుపుమాత్రం తేన్చి చల్లగా ఆ రాత్రికి పడుకున్నాడు 'హ్యాటను.'

ఇంకా ఎందరో ఉన్నారు. మనదేశంలో తిలక్ మహాశయుడు ఖగోళశాస్త్రమును ఆధారంగా తీసుకొని వేదముయొక్క ఆదినిరూపించి ఒకచక్కని గ్రంథం (Antiquity of the Vedas) వ్రాశాడు. రామానుజం అనే మహాశయుడు గణితశాస్త్రంలో ఎన్నో గొప్పగొప్ప పరిశోధనలు చేసి పాశ్చాత్య దేశంలో చనిపోయాడు. అతడు చేసిన పరిశోధనలు ఇంకా అర్థంకాక అనేకమంది తంటాలు పడుతున్నారు.

ఇప్పుడే కాదు; పూర్వకాలం మనదేశంలో గొప్పగొప్ప గణితశాస్త్రజ్ఞు లుండేవారు, భాస్కరాచార్యులు మొదలైనవారు. అప్పుడు స్త్రీలుకూడా ఈశాస్త్రంలో ఆరితేరినవా రుండేవారు. ఇందుకు లీలావతీగణితమే తార్కాణం.

---

### కీర్తిశేషుడైన

# బరోడా మహారాజు సయాజీరావు

## కొన్ని జీవితగాథలు

శ్రీ అకుండి వెంకటేశ్వరరావు

సయాజీరావు రాజ్యమునకు వచ్చుటకు ముందు ఖాండేరావు గైక్వారు రాజ్యపరిపాలన చేస్తుండేవాడు. అతడు ౧౮౭౦ సంవత్సరములో నవంబరు ౨౮ వ తేదీన చనిపోయాడు. కాని అతనికి పురుషసంతానము లేక పోవుటచేత అతని తమ్ముడైన మల్హారరావు రాజ్యపాలన చేసేవాడు. అతడు చాలదుర్మార్గుడై ప్రజలనేకవిధముల బాధలు పెట్టేవాడు. అనేకమైన అవినీతికార్యములు చేస్తుండటంవల్ల ప్రజ లందరి కాతనిపైన అయిష్టతకలిగి, తమ కష్టములను గూర్చి, బ్రిటిషు ప్రతినిధియైన కల్నల్ ఫైరీకడ మొర పెట్టుకున్నారు. అందుమీద అతడు మల్హారరావును గట్టిగా మందలించాడు. కాని మల్హారరావు అతని సలహాలను లెక్కచేయకపోవడమే కాకుండా అతనిపై పగ వహించి, అతనికి విషప్రయోగము చేయించాలని చాల ప్రయత్నించాడు. ఈ విషయము బ్రిటిషువారికి తెలిసింది. తక్షణమే వారు మల్హారరావును రాజ్యమునుండి తొలగించి అతనిని ఖైదీగా మద్రాసుకు పంపించివేశారు. తరువాత చనిపోయిన ఖాండేరావు భార్యయైన జమ్నాబాయికి, రాజకుటుంబానికి చెందినవారిలో నెవరైనా ఆమెకునచ్చిన పదు మూడేండ్ల కుఱ్ఱవానిని దత్తత చేసుకోవలసిందని వర్తమానంచేశారు.

అప్పటికి సయాజీరావు కాల్వన అనే గ్రామంలో పెరుగుతున్నాడు. ఈ గ్రామము నాసికజిల్లాలో వుంది. సయాజీరావు అసలుపేరు గోపాలరావు. ఇతని తండ్రి పేరు కాశీరావు గైక్వారు. ఖాండేరావునకు దాయాది సంతతిలోనివాడు. ఇతనికి ముగ్గురు కొడుకులు: (౧) ఆనందరావు, (౨) గోపాలరావు, (౩) సంపతురావు. కాశీరావు గైక్వారు వంశమునకు సంబంధించినవాడే కాని సామాన్యస్థితిపరుడు. వ్యవసాయము వలన కాలక్షేపము చేస్తున్నాడు. మహారాణీ జమ్నాబాయి కుమారుల్ని ముగ్గుర్ని తీసుకురమ్మని కాశీరావును ఆజ్ఞాపించింది. ముగ్గురిలో తనకు నచ్చినవాని నొకని దత్తతచేసుకోవాలని ఆమె ఉద్దేశ్యం. ఈ విషయంలో ఆమె ఒకచిన్న యుక్తి చేసింది. ముగ్గురు పిల్లల్ని తనతో సహపంక్తిభోజనానికి రమ్మనిపిలిచింది. ఆనందరావూ, సంపతురావూ తిండికి మొహంవాచిన వాళ్లలా నష్టుగా పల్లెటూరిపద్ధతిలో పట్టించారు. గోపాలరావుమాత్రం, సరిగా జమ్నాబాయిని అనుసరించి ఆమె ఎలా చేస్తే ఇతడూ అలా చేశాడు. తరువాత ఆనందరావుని పిలిచి "ఈవూ రెందు కొచ్చా"వని అడిగింది. అతడు "పూరు చూడ్డాని కొచ్చా"నన్నాడు. గోపాలరావు నడిగితే "మావాన్న నేను రాజునౌతా"నన్నాడు. అందుచేత సింహాసనం ఎక్కడాని కొచ్చా" నన్నాడు. సంపతురావు "ఏమో నాకు తెలీ"దన్నాడు. అప్పుడు జమ్నాబాయి గోపాలరావు ధైర్యానికీ, సత్ప్రవర్తనకీ మెచ్చుకొని అతనిని దత్తత చేసుకొన్నది. అప్పు డాతనికి పన్నెండేండ్ల వయస్సు. ఈ దత్తత కిష్టములేని కొందరు, రాజకుటుంబములోనివాడయిన సదాశివరావనేవాని యువరాజ్యం క్రింద ఒక కుట్రజరుపలు చేరతీశారు. కాని తక్షణమే దాని నణిచివేసి సదాశివరావును యావజ్జీవఖైదీగా కాశీ పంపించేశారు.

గోపాలరావును దత్తతచేసుకొన్న తరువాత, వారి వంశాచారప్రకారం, అతనికి సయాజీరావు గైక్వారు అని నూతన నామకరణం చేసింది జమ్నాబాయి. తరువాత ఇతని విద్యాభ్యాస మొకసమస్య అయింది జమ్నాబాయికి. ఖాండేరావు, మల్హారరావుల

ప్రవర్తన కసంతృప్తి చెందినవా రగుటచేత బ్రిటిషు వారు సయాజీరావునకు కట్టుదిట్టములైన పద్ధతులమీద, సరియైన విద్య నిప్పించవలెనని జమ్నాబాయికి సలహా యిచ్చారు. ఈ విషయములో సంస్థానములోని బ్రిటిషు ప్రతినిధికూడా స్వయంగా చాలా శ్రద్ధ తీసుకొన్నాడు. సయాజీరావువిద్యాభ్యాసానికి ప్రత్యేకం ఒక పెద్ద స్కూలును నిర్మించారు. దానిలో సయాజీరావు, దగ్గిర రాజబంధువులు కొందరు, మొత్తం ౧౨ గురు విద్యార్థులు. ఈ స్కూలుకి ప్రధాన విద్యాధికారిగా, మద్రాసునుంచి ఇలియట్ అనే దొరగారిని పిలిపించారు. ఈయనక్రాక అందులో ఇంకా నలుగురు ఉపాధ్యాయులు ఉండేవారు. స్కూలులో ఉన్నంత కాలము సయాజీరావుకీ, మిగిలిన వారికీ ఏవిధమైన భేదముగాని, అధికారముకాని వుండకూడదు. ఆటపాటలలో కూడా ఉపాధ్యాయులు శిష్యులతో సమానంగా పాల్గొని వారి కుత్సాహం కలిగించాలి. ఇవి ఆ స్కూల్లోని ప్రధాన నిబంధనలు. సయాజీరావు మొదట చదువులో అందరికంటె వెనకబడేవాడు. కాని చురుకుగా చదివి, క్రమ క్రమంగా అందరికంటె ప్రథముడుగా వచ్చేవాడు. ఒక్కొక్కప్పుడు తోడివాలు రతనితో సమంగా చదువలేక వెనుకబడి వుండటంచేత, సయాజీరా వొక్కడికే ప్రత్యేకంగా పాఠము చెప్పవలసివచ్చేది. ఇంటిదగ్గర వ్యవధి వున్నప్పుడల్లా ఉపాధ్యాయుని పిలిపించి క్రొత్తక్రొత్త పాఠములను స్వాతంత్ర్యంగా గ్రహించి చదివేవాడు. చిన్నప్పట్నుంచీ కూడా అతనిబుద్ధి చాలా చురుకైనది.

* *

౧౮౭౫ సంవత్సరములో వేల్సుయువరాజు హిందూదేశమును చూడ్డానికి వచ్చాడు. ఆసందర్భంలో భారతసంస్థానాధీశు లందరూ బొంబాయిదగ్గర, ఆయనకి గొప్ప ఆహ్వాన మివ్వడాని కేర్పాటయింది. అందుచే బరోడాసంస్థానంతరఫున సయాజీరావుకూడా తనపరివారం అంతటితోనూ వెళ్లాడు. అతనితో అతని గురువైన ఇలియటుగారుకూడా వెళ్లారు. జరుగవలసిన తంతు అంతా దివానులు మొదలైనవారు జరిపేశారు. యువరాజు సయాజీరావుతో చాలా కులాసాగా సంభాషించి అతనికి మంచి బహుమతు లిచ్చాడు. అంతకుముందెప్పుడూ పెద్దపట్టణం చూసివుండక పోవడంచేత, సయాజీరావుదృష్టి ఎంతసేపూ పట్నం చూడ్డం మీదే వుంది. తరువాత ఒకటి రెండు రోజు లుండి మొదటిసారి బొంబాయిపట్నం అంతా చూసి పరివారంతో బరోడా చేరుకున్నాడు. వేల్సుయువరాజు, అసలు తన కార్యక్రమంలో లేకపోయినా, బరోడా వచ్చి సయాజీరావును చూసి వెళ్లాడు.

* * *

తరువాత సయాజీరావుకు ౧౮ సంవత్సరములు వయస్సురాగానే, అంతకుముందున్న సలహాసంఘమును తీసివేసి, అతనికే సర్వాధికారములు ఇచ్చివేశారు బ్రిటిషువారు. అప్పుడు సయాజీరావునకువివాహము చేయ నిశ్చయించి, జమ్నాబాయి తగినవధువునన్వేషించుట కొరకు కనేకమంది ననేకప్రదేశములకు పంపింది. చివరకి తంజావూరు మహారాష్ట్రరాజకుటుంబములోని లక్ష్మీబాయిని సయాజీరావుకు వివాహంచేశారు. ఈ వివాహ విషయంలో ఒక చిన్నతమాషా జరిగింది. వివాహ ముహూర్తనిర్ణయంలో మగపెళ్లివారి జ్యోతిష్కులకీ ఆడపెళ్లి వారి జ్యోతిష్కులకీ అభిప్రాయభేదము లొచ్చాయి. దాన్నిగురించి ఇరుపక్షాలవారికీ వాదోపవాదాలు చెలరేగి, చివరకి వాదనిర్ణయానికి ఒకమహాసభ ఏర్పాటుచేయవలసివచ్చింది. ఈ గొడవలో అసలు వివాహం చాలారోజులు ఆలస్యమైపోయింది.

సయాజీరావు రాజ్యాధికారమునకు వచ్చిననాటి నుంచీకూడా అన్నివ్యవహారములను స్వయంగా చూచుకోడం ప్రారంభించాడు. అందుచేత పాతఉద్యోగస్థులలో చాలామందికి కొంచెం అసంతృప్తి కలిగింది. ఒక్కొక్కప్పుడు అతిస్వల్పకార్యములుకూడా తాను స్వయంగా చూచుకొనేవాడు. క్రమంగా అతడు తాను తప్పుమార్గంలో ప్రవర్తిస్తున్నాననీ తన విధానము సరియైనదికాదనీ గ్రహించాడు. తక్షణంరాజ్య వ్యవహారములు సక్రమంగా నడచిపోయేటందుకు ప్రభుత్వ విధానమున ప్రత్యేకశాఖలు ఏర్పాటుచేసి, ఒక్కొక్క శాఖ కొక్కొక యధికారిని సహోద్యోగులను నియమించి, ఆయా అధికారులకు అన్ని హక్కుల నిచ్చి అప్పుడప్పుడు వారిపై తణిఖీమాత్రము సాగించేవాడు.

అతడు రాజ్యాధికారమునకు వచ్చిన కొద్దికాలమునకే తనసంస్థానములోని అన్ని ప్రదేశములకు స్వయముగా పోయి చూసి, ఆయా ప్రజల కష్టనిష్ఠురములను చాల శ్రద్ధతో వినేవాడు. సయాజీరావుకు మొదటినుండికూడా ప్రజలతోనే కలిసిమెలిసియుండి, వారి కష్టములను నివారించడం అంటే చాలా ఉత్సాహంగా వుండేది. ప్రజల సౌకర్యార్థము ఏపని చేయడానికి ఆయన వెనుకదీసేవాడు కాడు. అనవసరమైన లాంఛనములు, ఆడంబరములు అతనికి నచ్చేవి కావు. అతడు ప్రయాణములలోనూ, దైనిక చర్యలలోనూకూడా చాల నిరాడంబరంగా వుండేవాడు. తాను పోయిన ప్రదేశము లన్నింటిలో అతడు గుఱ్ఱముమీద, ఒక్కొక్కప్పుడు సాధారణమైన ఎద్దుబండీమీదకూడా ప్రయాణంచేశాడు. అతనికి గుఱ్ఱపుస్వారి అంటే చాలా ప్రీతి. ప్రతిరోజూ అధమం ౨౦ మైళ్లు స్వారి చేసేవాడు. ఆటలు, కసరత్తు, వ్యాయామము అతనికి ప్రీతి. లాన్ టెన్నిసు ఆట అతని కిష్టమైన ఆట. అందులో అతడు చాలా సమర్థుడని పేరు సంపాదించాడు. అతనికి గుఱ్ఱపుస్వారియందుండే ప్రీతిచేత, అనేక ప్రాంతముల నుండి చాలవిలువైన గుఱ్ఱము లనేకములను తెప్పించాడు. వాటికొరకు కట్టించిన గుఱ్ఱపుశాలలుకూడా పైకి రాజభవనముల్లాగే వుంటాయి.

*           *           *

౧౮౮౩ సంవత్సరము ఫిబ్రవరిలో సయాజీరావు రిప్పన్ ప్రభువు ఆహ్వానము నంగీకరించి మొదటిసారి కలకత్తాకు పోయాడు. తరువాత చాలకాల మాత డనేక కష్టముల ననుభవింపవలసివచ్చింది. ౧౮౮౫ సంవత్సరములో రాణియైన చిమ్నాబాయి మరణించింది. అప్పటి కాతని కొకకుమార్తె, కొమారుడూను. చాలా కాలమువరకు సయాజీరావు భార్యావియోగదుఃఖంలోనుంచి తేరుకోలేకపోయాడు. మానసికముగానూ, శారీరకంగానూ చాలా నీరసించాడు. భార్యయొక్క స్మారక చిహ్నముగా చిమ్నాబాయి న్యాయమందిరమను పేర మహావైభవోపేతమైన న్యాయస్థానమును కట్టించాడు. తరువాత అనేకుల సలహాల ననుసరించి డిసెంబరు ౨౮-వ తేదీని గజ్రాబాయి అను నామెను వివాహమాడెను. తరువాత ఈమెకి రెండవ చిమ్నాబాయి అని నామకరణంచేశారు.

ఈ వివాహానంతరము సయాజీరావు తన జీవితకాలములో చాలాభాగము ఇతర దేశములలోనే కాలము గడుపవలసి వచ్చింది. తరుచు అతని దేహస్థితి అనారోగ్యంగా వుండేది. అందుచేత వైద్యుల సలహాపైని, తరుచు విదేశములలో సంచరించేవాడు. తన విదేశ ప్రయాణము లన్నింటిలోకూడ, తనభార్యా పుత్రాదులతోనే వెళ్లేవాడు. ఈ ప్రయాణము లన్నింటిలోనూ, రాణీ చిమ్నాబాయికి ప్రపంచ పరిస్థితులతోను, ప్రపంచ నాగరికతతోనూ పరిచయము కలిగించేవాడు.

ఏ విధంగానైనా, అనాదిగావున్న ఘోషాపద్ధతిని పోగొట్టి, స్త్రీలకుకూడా సమాన స్వాతంత్ర్యము లియ్యవలెననే అతి డాశించేవాడు. తరువాత తరువాత స్త్రీల విద్యావ్యాప్తికిని, నిమ్నజాత్యుద్ధరణకును, స్త్రీల స్వాతంత్ర్యమునకును అత డనేక మహత్కార్యము లొనర్చి తనకోరిక సఫలము గావించుకొన్నాడు. అత డొనర్చిన యీ సంస్కరణలకు సంస్థానములోని పూర్వాచారపరాయణులును, ఆత్మబంధువులును చాలా ఆటంకములు కల్పించారు. కాని వాటి నేమీ లెక్క చేయక, సయాజీరావు తన యాశయములను నెరవేర్చుకున్నాడు. అనారోగ్య కారణమున అతడు ప్రాచ్య దేశము లనేకముల దర్శింపవలసి వచ్చింది. మొత్తమునకు సయాజీరావు ప్రపంచము నంతటిని చూచివచ్చాడు. దానివలన నాతడు సంపాదించిన నాగరకతా విజ్ఞానాన్ని తన సంస్థాన ప్రజల కిచ్చుటకు ప్రయత్నించాడు. ప్రాథమిక విద్యావిధానము స్త్రీ విద్యయు, సంఘసంస్కారము, మొదలగునవి ఆసంస్థానములో అభివృద్ధి పొందినట్లు మరే సంస్థానములోనూ అభివృద్ధి పొందలేదు. ఇప్పుడా సంస్థానంలో, పెద్దకాలేజీలుకాక, ౨౫౦౦ ఉచితపాఠశాల లున్నవి. సంస్థానములో అన్ని భాగములకు రైలుమార్గములు, రోడ్లు నిర్మింపబడినవి. సంస్థానము నంతటిని జిల్లాల క్రింద, తాలూకాల క్రింద, పంచాయితీల క్రింద విభజించి, సంపూర్ణమైన ప్రజాపరిపాలన సాగిస్తున్న సంస్థానము బరోడా. ప్రజలచే ఎన్నుకొనబడిన ప్రతినిధుల సభ నొకదాని నేర్పాటుచేసి, సయాజీరావు, తన రాజ్యపరిపాలన నంతటిని తద్వారా నిర్వహించాడు. ప్రజాసౌఖ్యమున కుపకరించే ఎట్టి మహత్కార్యమునుకూడా, మహోసంతో

షంగా చేసేవాడా మహారాజు. తరుచు అతడు విదేశము లలోనుండి పోవలసి వచ్చినదైనను, దృష్టినంతను తన సంస్థానముపైనుంచి ప్రతిదినమును సంస్థాన విషయములను టపాలమూలముగా తెలిసికొనుచు, వ్యవహారముల నన్నిటిని స్వయంగా చూస్తుండేవాడు.

*　　*　　*

సయాజీరావునకు ఇతర దేశములలో, మరియే సంస్థానాధిపతులకు జరుగని ప్రత్యేక గౌరవములు జరిగినవి. నవంబరు ౭ వ తేదీన డఫ్రీన్ ప్రభువు బరోడాకు వచ్చినప్పుడు, సయాజీరావు దర్బారు ఏర్పాటుచేశాడు. నిండుదర్బారులో సయాజీరావు సింహాసనముపై నుండగా డఫ్రీన్ ప్రభువు,మిగిలిన ఉద్యోగులతో సింహాసనము దరికి మాత్రముపోయి మహారాజుతో కుశలసంభాషణచేశాడు. ఇటువంటి మహాగౌరవము, ఒకరిద్దరు సంస్థానాధిపతులకు మాత్రమే జరిగింది.

౧౮౮౭ సంవత్సరములో సయాజీ ఇంగ్లండు వెళ్లినప్పుడు, ఇండియా కార్యదర్శియైన వైకౌంటు క్రాసు స్వయముగా, అతని బసకు పోయి, విక్టోరియా రాణి తరఫున విండ్సరుభవనమున కాహ్వానించాడు. మహా గౌరవములతో సయాజీరావు భార్యాసహితంగా, ప్రత్యేక రైలులో విండ్సరుభవనమునకు వెళ్లాడు. అక్కడ విక్టోరియా స్వయంగా అతనికి, జి. సి. యస్. ఐ. అనే బిరుదును అనేక బహుమానములను ఇచ్చి ఆదరించినది. సయాజీరావుకు విక్టోరియా రాజ్ఞిని చూచుట కదియే ప్రథమము. తరువాత అనేకమారులు విక్టోరియారాజ్ఞి అతనిని ప్రత్యేకాతిథ్యమున కాహ్వానించింది.

*　　*　　*

సయాజీరావు బ్రిటిషువారి కెంత అణకువ చూపించేవాడో, తన ఆత్మగౌరవమును కాపాడుకొనుట కంత ధైర్యముగా ఎదిర్చి పోరాడేవాడు. బాపట్ కేసువిషయములో బ్రిటిషువారిని నిర్భయము గా విమర్శించి, రాజప్రతినిధితో చాల వాగ్వాదముచేసి, తన న్యాయదృష్టిని సమర్థించుకున్నాడు.

౧౯౦౩ సంవత్సరములో ఢిల్లీ దర్బారు వచ్చింది. ఆ సందర్భంలో రాజప్రతినిధి సంస్థానాధిపతు లందరకీ నోటీసులు పంపించాడు. దానిలో సంస్థానాధిపతు లందరు దర్బారుత్సవములలో, ముఖ్యంగా ఏనుగు అంబారీ ఊరేగింపుటుత్సవములో పాల్గొనవలెనని ఆజ్ఞాపించాడు. సయాజీరావుకు ఆ నోటీసు చాల కష్టము కలిగించింది. బ్రిటిషువారు సంస్థానాధిపతుల ఆత్మగౌరవమును పూర్తిగ నాశనముచేయ సంకల్పించు కొన్నట్లుగా అతనికి తోచింది. తక్షణం రాజప్రతినిధికి తన అసమ్మతిని స్పష్టంగా తెలియజేసి, ఉత్సవములో పాల్గొనుటకు నిరాకరించాడు. తరువాత చాలకాలము వరకు ప్రభుత్వముతో ఆ విషయమును గురించి వాదోప వాదములను సాగించాడు.

దేశములోని స్వాతంత్ర్య ప్రియులను, విజ్ఞానధను లనేకమందిని గౌరవించి పోషించి తన స్వాతంత్ర్యాభి లాషను వెలిబుచ్చుకున్నాడు. దేశభక్తులుగను, విజ్ఞాన సంపన్నులుగను ప్రఖ్యాతిగడించిన అరవిందయోగి, మహమ్మదాలీ, అంబేద్కరు మొదలగు భారతవీరు లెందరో అతని యాదరణకు పాత్రులైరి. అందుచేత ప్రభుత్వమువా రతనిని ప్రత్యేకదృష్టితో కని పెట్టుచూచే ఉండేవారు. ప్రభుత్వముఅనుజ్ఞ లేకుండా ఇతర దేశములకు వెళ్లకూడదనీ, తమ యనుజ్ఞ లేకుండా రాజ్యములో నూతన విధానములను ప్రవేశపెట్టకూడదనీ రాజ ప్రతినిధి సయాజీరావున కొక ఆజ్ఞ పంపించాడు. కాని సయాజీరావు దానిని తీవ్రముగా విమర్శించి నిరాకరించి తన యిష్టానుసారము ప్రవర్తించినాడు.

దీనికితోడు జార్జిసార్వభౌముని ఢిల్లీదర్బారు సందర్భంలో ఒకచిత్రముకూడా జరిగింది. జార్జిసార్వభౌముని ఢిల్లీదర్బారు మహోత్సవము జరుపుటకు నిశ్చయమైంది. రాజప్రతినిధి హార్డింజ్ ప్రభువు సంస్థానాధిపతులకు ఆహ్వానములు పంపుతూ, దర్బారులో సంచరించవలసిన విధులనుగూర్చి తర్ఫీదు పొందుటకు, ఉత్సవదినమునకు నాలుగు రోజులు ముందుగనే ఢిల్లీ రావలెనని ప్రత్యేక ఉత్తరములు వ్రాశాడు. అప్పటికి సయాజీరావునకు శరీరారోగ్యము సరిగా లేనందున తన తరఫున తన తమ్ముడైన సంపత్ రావును, మరొక ఇంగ్లీషు ఉద్యోగిని పంపించాడు. సంస్థానములోనున్న బ్రిటిషు ప్రతినిధికూడా అక్కడ సంచరించవలసిన విధులను

గూర్చి సయాజీరావుకు బోధించాడు. తరువాత దర్బారు ఉత్సవమునాడు దేహారోగ్యము బాగు లేకపోయినా సయాజీరావు ఢిల్లీ వెళ్లాడు. అంతకు పూర్వమునుంచీ అతని శారీరక మానసిక స్థితులు బాగుగ లేక పోవుట చేత, రాజలాంఛనములైన దుస్తులను సయితము సరిగా ధరించకుండానే దర్బారునకు వెళ్లాడు. దర్బారంతా మహావైభవోపేతంగా అలంకరింపబడివుంది. సార్వభౌమదంపతుల కిరుప్రక్కల హార్డింజ్ ప్రభువును ఇండియా కార్యదర్శియు నిల్చున్నారు. వేదిక మెట్ల పైన సంస్థానాధిపతుల హోదాల ననుసరించి అమర్చబడిన ఆసనములలో సంస్థానాధిపతులు కూర్చున్నారు. మొదటి స్థానము నైజాము నవాబుది. రెండవది బరోడా గైక్వారుది. మూడవది మైసూరుది. వీరందరూ ఒక్కొక్కరే సార్వభౌమ దంపతులవైపు మూడడుగులు వేసి ఇరువురికి సలాములు చేసి, మళ్లీ వెనుకకి మూడడుగులు వేసి వారిస్థానములకు వెళ్లవలెనని నిర్ణయింపబడింది. యథాప్రకారము నైజాము తనవిధి సక్రమంగా నెరవేర్చుకున్నాడు. తరువాత సయాజీరావు నీరసస్థితిలో లేచి ముందుకు వెళ్లి సలాముచేసి వెనుకకు రావటములో ఒక్కడుగుమాత్రమే వేసి గిఱ్ఱున తిరిగి తన స్థానంలో కూర్చున్నాడు. రాజప్రతినిధి మొదలైనవారు మండిపడ్డారు. దానిమీద ఇంగ్లీషుపత్రికలు అతనిని రాజద్రోహియని, దుర్మార్గ ప్రవర్తనుడనీ, అతనిని రాజ్యమునుంచి తొలగించ వలెననీ, అనేక విధములుగా ప్రకటించాయి. కాని ఏమీ తప్పు చేసినట్టు సయాజీరావుకు తోచలేదు పాపం! మరునాడు అతని ప్రవర్తన నిరసిస్తూ రాజప్రతినిధి ఒకఉత్తరం పంపించాడు. అప్పుడు సయాజీరావు చాలా విచారించాడు. తక్షణం, తన దేహస్థితి బాగు లేనందువల్ల కంగారుపడి అల్లా చేశానుగాని, మరేదురుద్దేశ్యము తనకు లేదని అతడు ఒక పెద్ద సమాధానము వ్రాసి పంపాడు. తరువాత అందరి కోపములు చల్లారి పోయాయి. అంతవరకు అతడు బ్రిటిషువారి యందు చూపిన భక్తిభావము, రాజ్యపాలనలోని శక్తి సామర్థ్యములనుబట్టి అతను దోషియని బ్రిటిషువారు కూడా నిర్ణయించలేక, సయాజీరావు సమాధానము యథార్థమని గ్రహించారు. తరువాత అతడు ఇంగ్లండుకు వెళ్లినప్పుడు జార్జిసార్వభౌము డతనిని అతిథిగా ఆహ్వానించి గౌరవించాడు.

సయాజీరావు ఇంగ్లీషువారితో ఎన్ని వాదోపవాదములు చేసినా, ఎన్నివిషయములలో వారి అధికారములను ధిక్కరించినా, అతని నేవిధముగను శిక్షింపలేకపోవుటయేగాక, అతని సుగుణములనుగూర్చి, రాజ్యపాలనాచాతుర్యమునుగూర్చి, సార్వభౌముకు మొదలు చిన్న ఉద్యోగివరకు అందరు అనేకవిధముల అభినందించారు. ఐరోపా మహాసంగ్రామసందర్భంలో సయాజీరావు ఇంగ్లీషువారికి చేసిన సహాయ మత్యధికము.

మహారాజుగా, సంఘసంస్కర్తగా, విద్యావేత్తగా, విద్యాపోషకుడుగా, దీనజనోద్ధారకుడుగా, ప్రజలపాలిటి తల్లిగా దండ్రిగా, ఆబాలగోపాలము చేతను వేనోళ్ల కొనియాడబడి, తోడిసంస్థానాధీశు లందరికి మార్గదర్శకుడై, అసమానయశోవిరాజితుడై వెలుగొందిన మహారాజా సయాజీరావు గైక్వారు మరణమునకు యావద్భారతదేశమును అశ్రుతర్పణము విడిచిన దంటే అది అతిశయోక్తి కానేరదు.

# ఏ జీవిక స్త్రీలకు?*

శ్రీమతి కామరాజు సరోజినీ దేవి

స్త్రీజీవితాశయము గృహలక్ష్మి కావడమేనని సర్వజనసమ్మతమైన అభిప్రాయమై ఉండేది. యావజ్జీవము, యావత్కాలము, సమస్తశక్తులూ, కేవలము గృహముకోసమే ఏర్పడ్డవనే సూత్రము నిన్నటివరకూ మన సాంఘిక జీవనానికి పునాదిగా పరిగణింపబడుతూ ఉండేది అనుశ్రుతముగా వస్తూవున్న ఈ విశ్వాసాన్ని ప్రశ్నించి పరీక్షించే సామర్థ్యంగాని, సాహసంగాని, స్త్రీ స్వాతంత్ర్యోద్యమానికి కేంద్రస్థానమైన పశ్చిమదేశాల్లోకూడా, చాలాకాలం ఎవ్వరికీ లేకపోయింది నూతన సాంఘికపరిస్థితులూ ఆర్థికసమస్యలూ బయలుదేరడము వల్లనైతేనేమి, స్త్రీహృదయంలో తీవ్రస్వాతంత్ర్యకాంక్ష ప్రజ్వరిల్లడమువల్లనైతేనేమి ప్రప్రథమమున పాశ్చాత్యదేశాల్లో, నేడు మన దేశములో బహుకాలానుగతములైన సంప్రదాయాలకు వ్యతిరేకములైన నవీనభావాలు ఉద్భవించడము, కార్యరూపం దాల్చడం కూడా జరుగుతున్నది. అవి ఎంతవరకు సంఘసముదాయానికి ప్రయోజనకరములో, స్త్రీల భావి అభ్యున్నతికి ఎంతవరకు అనుకూలములో, ఇప్పటికిని వివాదాంశములే.

ఈ సంస్కరణములలో విశ్వాసమున్నవాడు ఏకీభవించడము, సహేతుకంగా వానిని ఋజువుపరచడానికి ప్రయత్నించడము సహజమే. ఇటువంటి అభిప్రాయాలలోగాని, వాటి అనుసరణలోగాని ఏమాత్రము ఇష్టములేనివారు ఈ ఉద్యమాన్ని అన్నివిధాల ప్రతిఘటిస్తున్నారు.

స్త్రీల ఉద్యోగసమస్య వారి విద్యపై, వారి సాంఘికపరిస్థితులపై ఆధారపడి ఉంటుంది. ప్రస్తుత విద్యావిధానము సామాన్యంగా స్త్రీలకు పురుషులకు ఒకటే. అందువల్ల పురుషులకు ఈ విద్యావిధానము వారివారి వివిధవృత్తులలో ఎంతవరకు ఆధారభూతమో, ఎంతవరకు సానుకూలమో స్త్రీలకు కూడ అంతే. కాబట్టి ప్రస్తుతవిద్యావిధానం కొన్నివృత్తులలో పురుషులకు అనుకూలముగానూ, స్త్రీలయెడ ప్రతికూలముగానూ పరిణమించనేరదుకదా! అందువల్ల చాలవరకు అన్నితరహాలఉద్యోగాలలో స్త్రీలకు ప్రవేశము ఉండాలని కోరడము న్యాయము.

కాని ప్రస్తుతసాంఘికనిర్మాణము స్త్రీకి కుటుంబబాధ్యతలో ఎక్కువప్రాముఖ్యతను ఇస్తోంది. ఇది కొంతవరకు సహజము. యథార్థానికి ఆమె ముఖ్యంగా మాత. శిశుసంరక్షణ, శిశుపోషణ ఆమెకు నైజగుణాలు. వీటికి ప్రతిబంధకములయిన ఉద్యోగాలు సర్వసాధారణముగ స్త్రీలకు అనుకూలములు కావు. అందులోనూ గృహానికి బహుదూరాలనుగా చేసే కొన్నిరకాల ఉద్యోగాలు స్త్రీస్వభావానికి వ్యతిరేకంగా పరిణమించడ

* రేడియోప్రసంగము. మద్రాస్ ఆల్ ఇండియా రేడియోవారి అనుమతిని.

ములో ఏమీ వింతలేదు. నెలకు ముప్పాతిక దినాలకు పైగా జమాబందీ చేయించే ఉద్యోగా లసలే సరిపడవు ప్రస్తుత సాంఘికపరిస్థితులు మారేదాకా వాటికి దూరముగా ఉండడము స్త్రీలకు మంచిది.

అంతేకాదు యుగయుగములనాటి సంప్రదాయముల ఫలితముగా స్త్రీకి దేహదార్బల్యము చాలావరకు సంఘటించింది. దేహానికి ఎక్కువశ్రమ కలుగజేసే వృత్తులయందు ఎంత ఉత్సాహ మున్నా, రానురాను అవి ఆమెకు విషప్రాయములుగా మారితీరుతాయి. ఎవ్వరికో కొద్దిమందికితప్ప సాధారణ స్త్రీలకు అట్టిమార్గాలలో విజయం చేకూరడము కష్టము. ఈ రెండు తరగతులకు చెందకుండా ఉన్నవృత్తు లెన్నో ఉన్నాయి. వాటిలో ఆమె తప్పకుండా ప్రవేశింపవచ్చును.

౧. ఉపాధ్యాయవృత్తి: తల్లి శిశువుకు ప్రథమ ఉపాధ్యాయిని. ఆమె ఒడిలో నేర్చిన మాటలే వాని తొలిపలుకులు. చిన్నబిడ్డలకు ఉగ్గుపాలతోబాటు ముద్దుమాటల్లో కూడా ఆమె ప్రవేశము కలుగజేస్తుంది. ఇట్టి అవ్యాజానురాగములో పెరిగిన చిన్నిపాపలు, అక్షరాభ్యాసానంతరము ప్రాథమిక పాఠశాలలో పడే యాతన దుస్సహముగా ఉండడము అందరికీ అనుభవైకవేద్యమే. ఉపాధ్యాయుని యెడల దారుణమయిన భయము, పాఠశాల యెడల విపరీతమయిన విముఖత్వము, పాఠాలంటే అన్నింటినీ మించిన అసహ్యము ప్రతిబిడ్డహృదయములోనూ జనిస్తున్నా యనడము ఎంతమాత్రము అతిశయోక్తి కాదు.

విద్యామందిరము జ్ఞానానంద సంధాయకముగా ఉండడానికి బదులు, భూలోకనరకముగా మారింది. దీనికి కారణం? చిన్నబిడ్డను ఆదరించి వారికి భయంవల్ల కాకుండా ప్రేమద్వారా విద్యగరపే మార్గము ఉపాధ్యాయులకు బోధపడకుండా ఉండడమే. ఈ విధంగా ప్రయత్నించాలనే ఉద్దేశమ్మయినా వారికి ఉన్నట్లు కనిపించదు. అనలీపద్ధతి అవలంబించడము పురుషలక్షణము కాదేమో! దీనికి ఎంతో సహనము, ఓర్పు ఉండాలి. ఇది స్త్రీలు కావాలని నేర్చుకోవలసిన విషయముకాదు. ఇది వారి సహజగుణసంపద. కాబట్టి స్త్రీలను ప్రాథమిక పాఠశాలలలో బాలుర కైతేనేమి, బాలికలకైతేనేమి, విధిగా స్త్రీలనే ఉపాధ్యాయినులుగా నియోగించడము భావ్యము. నిర్బంధ ప్రాథమిక విద్యావిధానాన్ని నెలకొల్పవలెనని ఆలోచించే మననాయకులు ముఖ్యంగా శాసననిర్మాతలు ఈ విషయము గమనిస్తారని తలుస్తాను. ఈ అభిప్రాయాలు ఆచరణలోకి వచ్చినపుడు మన విద్యావతుల సంఖ్యచాలదు. ఇకను ఎందరో స్త్రీలు ఈ పనికి పూనుకోవలసివుంటుంది.

### న్యాయవాదవృత్తి

స్త్రీలహక్కులను గూర్చి కడచిన ఒక శతాబ్దమునుండి ఏదోకొంత అలజడి జరుగుతూనే ఉన్నది. శతాబ్దముగడచినా, స్త్రీసాధారణ జీవితములోగాని, ఆర్థికస్వాతంత్ర్యవిషయములోగాని ఏవిధమయిన మార్పు కలగనేలేదు. స్త్రీల కింకా దాస్య విమోచనము సిద్ధించనే లేదు. స్త్రీలహక్కులూ, అవసరాలూ, పరిస్థితులూ గ్రహించడము పురుషులకు ఎంత ఉదారహృదయులకైన అసంభవము. స్త్రీకి స్వయంనిర్ణయశక్తి రావాలి. తనకు ధర్మమని తోచిన హక్కులకొరకు

పోరాడుటకు సమర్థురాలు కావాలి. దీనికి న్యాయశాస్త్ర పఠనమూ, పరిశోధనా, స్త్రీలు విరివిగా చెయ్యాలి.

అంతేకాదు నిందితలయిన స్త్రీలు న్యాయవాదుల యెదుట మర్మము విడిచి హృదయపూర్వకముగా తమ యథార్థపరిస్థితులను తెలుపుకోలేక కఠోరశిక్షలకు లోనై జయిళ్లలో యమయాతన అనుభవిస్తున్నారు. వారిహృదయావేదన లోకవిదితమయి వారికి న్యాయము జరగాల ఁటే న్యాయవాదినులు చాలమంది అవసరము.

స్త్రీ హృదయాన్ని స్త్రీయే గ్రహించగలదు. ఇప్పుడు తగినంత మంది న్యాయవాదినులులేర నే నిశ్చయంగా చెప్పవచ్చు. న్యాయాన్యాయ విచక్షణచేసి న్యాయాన్ని క్షమతో మిళితముచేసే న్యాయాధికారిణులనుగాని, న్యాయస్థానములో నిలబడి న్యాయముకొరకు వాదించే న్యాయవాదినులనుకాని చూడడము అపురూపము. కాని స్త్రీలకు ఎంతమందికయినా ఇచట సాధింపవలసిన పనులున్నాయి. స్త్రీస్వాతంత్ర్య సంప్రాప్తికి, పతితస్త్రీ పరిత్రాణానికి స్త్రీలు పలువురు న్యాయవాదవృత్తి స్వీకరించాలి.

## వైద్యవృత్తి

శిశువుల అసహాయత్వము, స్త్రీహృదయములో మాతృభావాన్ని జనింపజేసి, సేవాపరాయణత్వాన్ని ఏవిధంగా విజృంభింపజేస్తుందో ఆవిధంగా దుర్భరవ్యాధిపీడితుల దౌర్బల్యము జాలిని ఇనుమడింపజేస్తుంది. అందువల్లనే స్త్రీ వైద్యవృత్తి కెంతయు తగియున్నది. శిశుసంరక్షణోద్యమ ప్రాముఖ్యము సర్వజనాంగీకృతమైనా ఎందరో శిశువులు వైద్యసాహాయ్యంలేక నేటికిని మృత్యువువాతపడుతూనే ఉన్నారు. తమరోగలక్షణాలు మనసువిప్పి పురుషులకెరిగింపలేక ఎంద రెందరో స్త్రీలు తమలజ్జాభయసంకోచాలకి బలి అవుతూనే వున్నారు. దీనికి కారణము ? మన దేశములో అసలే వైద్యులసంఖ్య కడుస్వల్పము. అందులోనూ వైద్యురాండ్రసంఖ్య స్వల్పాతిస్వల్పము. ప్రభుత్వోద్యోగాలు లభింపకపోవచ్చు. కాని మన అసంఖ్యాకగ్రామసముదాయములో వైద్యసహాయము ఎంతయినా అవసరము. గ్రామస్థులజీవితము ఒకసారి పరికిస్తే వారిదీనస్థితి హృదయవిదారకముగా వుంటుంది. మనజాతీయాభివృద్ధికి ఆరోగ్యమే ప్రధానమని గ్రహించిన దేశభక్తురాండ్రూ, ఎక్కడెక్కడో మారుమూలల మూగవేదనతో కుమిలిపోతూవున్న అసంఖ్యాకులైన ఈ నిర్భాగ్యజీవులయెడల కనికరము జనించే కరుణార్ద్రహృదయులూ, వైద్యవృత్తిలోని ఉత్తమాదర్శము గమనించి ఈ దారుణ పరిస్థితులు మారునట్లుచేయుటకు కృతసంకల్పలు కావలెను.

## ఇతరవృత్తులు

గుమాస్తాపని పురుషుల కెంత సాధ్యమో స్త్రీలకూ అంతే. టైపిస్టులుగా, గుమాస్తాలుగా, ప్రతిఆఫీసులో స్త్రీలను నియమించవచ్చు. ఏవ్యక్తి అయినా తనయిచ్ఛానుసారముగా ఈ ఉద్యోగాల్లో వేటికయినా ప్రయత్నిస్తే స్త్రీ పురుష వివక్షత లేకుండా వారివారి సామర్థ్యాన్నే ప్రధానముగా తీసికొని ఉద్యోగనియామకము చెయ్యడం న్యాయం. ఈకళయం దభిరుచి ఉన్న స్త్రీలందరూ ఈకళలకు పునర్జీవము ప్రసాదించెదరుగాక.

సారస్వత సేవలో విద్యావతు లింకనూ పెక్కుమంది నిమగ్నులు కావాలి. సారస్వతములో స్త్రీ ఒక నూతనాదర్శము, ఒక నూతన వ్యక్తిత్వము నిరూపించాలి. ఇప్పటి దాకా, యీకళ చాలావరకు పురుషుల హస్తగతమగుటవల్ల వారు స్త్రీ స్వభావాన్ని ఊహించి వారికి తోచినట్లు గ్రంథాలు రచించారు. స్త్రీ లెప్పుడు శక్తివతులై సారస్వతోపాసిక లయ్యెదరో నాడు సారస్వతలోకంలో ఒక నూతన శకము ప్రారంభమగును. కర్మాగారవృత్తులు, జమాబందీలతో సంబంధించిన వృత్తులు స్త్రీకి ప్రస్తుతము పనికిరావు గదా!

## స్త్రీ రక్షకభటురాండ్రు

పోలీసుపనికి స్త్రీలను అక్కడక్కడ ప్రభుత్వంవారు నియమిస్తూనే ఉన్నారు. కానిపురుషులసంఖ్య ఎంతో స్త్రీలసంఖ్య కూడా అధమం అంత వుండాలి. మనం, అనుదినం ఈ పురుష రక్షకవర్గంవల్ల స్త్రీలు పొందుతూవున్న అవమానం, బాధ కళ్లార చూస్తూనే ఉన్నాము. నిందిత లైనంత మాత్రాన, స్త్రీలు తమ సహజగుణాలైన లజ్జాభిమానాలు పోగొట్టుకొనగలరా? అసాధ్యము. అది పురుష హృదయానికి తెలియదు. స్త్రీ హృదయము సమస్త పరిస్థితులలో సమూలంగా తెలుసుకోవడానికి స్త్రీలకే సాధ్యము.

## కళలు

ఇక కళాసంబంధమైన వృత్తులలో స్త్రీ లెంతయినా సాంధించవచ్చు. చిత్రకళ, గానకళ ఇప్పటికే పెక్కు స్త్రీజనాన్ని ఆకర్షించాయి. ఈ రెండు కళలు స్త్రీలకు స్వభావ సిద్ధములు. వీనిలో ఇంకా కృషి చేసేయెడల స్త్రీలకు ఎక్కువ ప్రాముఖ్యము వచ్చితీరుతుంది. నాట్యము, అభినయము, పూర్వకాలములో స్త్రీలకు ఆకర్షణీయముగా ఉన్నా మన ప్రస్తుత సాంఘికపరిస్థితులు వానిని నీతిబాహ్యముగా మార్చివేసినవి. కాని సంఘములో మార్పు వస్తూనేవున్నది. విద్యావతులు, మేధావంతురాండ్రు అయిన స్త్రీలు కొందరు ముందంజవేసి ఈకళకు పూర్వమున్న గౌరవాన్ని ప్రాపింపచెయ్యాలని ప్రయత్నిస్తూనే ఉన్నారు.



# పుస్తకసమీక్ష

## ప్రేమతపస్విని:

కర్త: శ్రీ బెల్లాల శ్రీనివాసమూర్తి. తలమర్ల, అనంతపురం జిల్లా.

ఈ చిన్ని కావ్యము మూడుభాగములుగ విభజింపబడింది. ఒకవియోగిని ఏకాంతములో, పక్షులతోను, పూబోదలతోను, శాద్వలాలతోను తనప్రణయగాథను చెప్పిచెప్పి ఒకచెట్టుకింద నిద్రపోతుంది.— (ఇది మొదటిభాగములోనికథ); – రెండవభాగములో— ఆమెకు ఒక స్వప్నం వస్తుంది. అందులో తన ప్రియుడగుపడి ప్రణయతత్త్వోపదేశం చేస్తాడు. ప్రథితము శాశ్వతము ఐన ప్రణయబంధములో తనప్రేయసితో ఇమిడిపోవాలని కోరుతాడు;—మూడవభాగములో— మననాయిక నాయకునితో పవిత్రమైన ప్రేమవిశాల విశ్వములో అంతర్లీనమై, వ్యక్తిగతముకాక, ప్రకృతిలో సంకీర్ణమైనందుచేత ఆ ప్రేమను ప్రకృతిలో గుర్తించమని నిర్దేశిస్తుంది. ప్రాపంచిక ప్రతిబంధములకు లొంగని "మరోప్రపంచము"లో తన ప్రణయదాంపత్యమునకు అక్షయ్యత్వం ఆశిస్తుంది.

ఇది కొంతవఱకు బ్రౌనింగు రాసిన డ్రామాటిక్ మానోలాగ్స్ (Dramatic Monologues)వలె వుంటుంది — నాయిక ఏకాంతాన్ని సంబోధించి స్వీయగాథను చెప్పతుందని చివరకు మనకు తెలుస్తుంది. కవి పరిచయ వాక్యములోకూడ "పల్లెపడతి ఏకాంతమును సంబోధించుచు స్వీయగాథను చెప్పకొనుట ఈ ఖండకావ్యమునందలి వృత్తాంత" మని చెప్పకొన్నాడు. కాని మొదటిభాగములో నాయిక ఏకాంతాన్నే కాక, శారికలను, పొదలను, వృక్షాలను సంబోధించడము చూస్తాము. ఇది కథాసంవిధానములో లంకెలేక అతికించిన ట్లగుపడుతుంది.—మచ్చుకు ఒకటి చూపుతాను. "కాలగతిగూర్చి భిన్నసంకల్పములను" అనేపద్యం ఎవరి నుద్దేశించి చెప్పినది? 'చెట్టుకొమ్మవా?'' ఏకాంతమును సంబోధిస్తూ చెట్టుకొమ్మ నెట్లా పలకరించడం? పోనీ — ఏకాంతములో 'నేను ఈవిధంగా చెట్టుకొమ్మతో అన్నాను' అని చెప్పిందా? లేదే! 'అనుచుఁ భావపరంపరల' అనేపద్యం ఇంతవఱకు మధ్యమపురుషలో నిర్దేశించి చెప్పినపద్యాలతో కథ చక్కగా అన్వయం కావడానికి తోడ్పడదే! ఈలోపము తీరడానికి ఈపద్యానికిపూర్వం వేరొకపద్య మవసరము.

కూర్పులో ఇటువంటి చిన్నినెరసు లింకా ఉన్నాయి.

'మరలి చను చను దప్పి గొన్ని యూదరువులెల్ల' దీనిలో అచ్చుపొరబాటో లేక గణభంగమో!

ఇంతవఱకు లోపాలతో సరిపోయింది. ఏది ఎట్లా ఉన్నా కవిత్వములో ఒకవిధమైన తీయదనములేక పోలేదు. రాయప్రోలువారిమడికారాన్ని ఈకవి కొంత వరకు గ్రహించినాడు. సంస్కృత సమాసాలలో పటుత్వం కించిదూనంగా ఉన్నా తెలుగు పలుకుల కూర్పడములోనే ఒక నాజూకు ఉంది. ఇతని పద్యాలు నిర్మలంగా కొండలలోని సెలయేళ్లవలె సాగిపోతాయి.

"సోగలుగొన్న ముంగురుల
సోయగపుం దెరలోన వెన్నెలై
దాగిన లేత నవ్వుల న
దారకళల్ గురియంగ, నిన్ను పూ
దీగవలెన్ సృజించి జగ
దీశ్వరుడే వసియించునేమొ నీ
లో గుణరాశి, కావ్యకళ
లోకవి తన్మయుడైన రీతిగన్.'

ఒక్కొకచోట నిశితంగ చెప్పగల నేర్పుకూడ ఈ కవికి ఉంది.

"గాఢశైశిరవాతప్రకంపితముగ
నవని రాలిన శుష్కపత్రాళిలోన
హృదయము గరంచ సౌందర్య మిమిడిపోయె
ప్రళయ మభినవసృష్టి కేర్పడునొ యేమొ!

ఇటువంటిపంక్తులు ఉత్తరోత్తరకావ్యము లుత్తమసరణిలో ఉండగలవని సూచిస్తున్నవి.

నాజూకుగా పద్యాలు నడిపించడంలో ఈ కవి నేర్పరి.

"కౌగిలించితిమి వీక్షాప్రసారములతో
  లలితమౌ బాహువల్లరులఁ గాదు
ముద్దాడితిమి రమ్యమోహనభావముల్
  కమనీయమృదుకపోలములఁ గాదు
కలసికొంటిమి వియోగప్రేమవీధిలో
  క్షణికమౌ ప్రత్యక్షగతులఁ గాదు

వంటిపంక్తు లందంగా ఉన్నాయి.

మొత్తముమీద నవ్యకవిత్వపు వెలుగులు ఇతని కవిత్వముమీద పాకినాయి.—ఈ కావ్యంలో అగుపించే ప్రతిభావ్యుత్పత్తులు ఉత్తరోత్తరకావ్యాలలో ఉజ్జ్వలంగ ప్రకాశించవలెనని మా విశ్వాసము.

"సంపత్"

---

## శ్రీ వివేకానంద లేఖావళి

(ప్రథమ సంపుటము)

అనువాదకులు.— శత్త్వానంద. వెల ౧-౨-౦.

దొరకుచోటు :— శ్రీ పొన్నపల్లి ఉమా మహేశ్వరరావుగారు, కొత్తపేట, తెనాలి.

ఇది అప్పుడప్పుడు మిత్రులకు రాసిన లేఖలసంపుటి.

భారతదేశపు దారిద్ర్యము, సోమరితనము, మతము పేరిట - నాగరికత పేరిట జరుగుదురాచారములు, ఆలోచనారహితమైన అంధ విశ్వాసము, జరాజర్జరితమై నడుము విరిగి జిల్లకిలపడి జవసత్త్వములను కోలుపోయిన ఆర్యజాతిని చూచి వివేకానందుని హృదయము ఆక్రోశించినది. పూర్వసంస్కృతి ఆయనను భావోన్మాదమునకు దింపినది. ధనములేక, తిండిలేక విల విల వాపోవు భారతసంతానము తన నెట్లు కాపాడుకొనగలదు ? ఎటుల పైకి లేవగలదు? అను దీర్ఘయోచన ఆయనను కలత పెట్టినది. చలనహీనమయిన, భారతజాతి నుద్ధరించుటకు — 'పాశ్చాత్యదేశములనుండి మనుష్యులును, ధనమును వచ్చినగాని, మనకు తరణోపాయము లే' దని వివేకానందునకు సంపూర్ణమయిన విశ్వాసం కలిగిపోయింది. అందుకే ఆయన విదేశములకు పోయినాడు.

మనపూర్వులు చాల గొప్పవారు. మన సంస్కృతి మహోత్కృష్టమయినది— అని మనము నిష్క్రియులమై కూర్చొనుట ఆయన దృష్టిలో వెర్రితనము. వేదవేదాంగములను సాంగోపాంగముగ పఠించి, అందలి సారమెల్లను గ్రోలిన మహాత్ముడగుటచేతనే భగవద్గీతలోని 'కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన' మంత్రమును జపించినాడు. చిరంతనమయిన హిందూధర్మమును మనసార ప్రేమించినవాడయ్యును వర్తమానమంటే ఆయనకు ఈసడింపు లేదు. భూతవర్తమానములను మేళవించి భవిష్యత్తును నిర్మించుకొనవలెనని, హిందూధర్మముమీద రెండువేల సంవత్సరాలనుండి పట్టిన త్రుప్పును వదలించనిదే దేశము పురోగామి కాజాలదు. అందుకనే దేశకాలములను గుర్తించక కిటికీల మూసికొను ఛాందసుల గురించి చూడుడు ఆయన వ్యాకుల వాక్కులు- 'రా! రండు! పురుషులై మెలగుడు. పురోగమనమునకు అడ్డు తగులు పురోహితగణమును నెట్టి పారవేయుడు. ఏమందురా? వా రెన్నడును చక్కబడబోరు. వారి హృదయము లెన్నడును వికాసము చెందవు. శతాబ్దముల నుండి పెరిగి వచ్చుచున్న మూఢ విశ్వాసములకును, దౌర్జన్యమునకును వారసులై వారు పుట్టియున్నారు. మున్ముందుగా ఆ పురోహిత కూటమును పెకలించివేయుడు. రండు! రండు! పురుషులు కండు! మీమీ ఇరుకురంధ్రములలోనుండి వెలికి రండు. విశాల ప్రపంచమును కన్నెత్తి చూడుడు......భారతమాత కనీసము ఒకవేయిమంది భారతయువకుల బలి అర్పణము కోరుచున్నది...వట్టి పశుప్రాయులు తగరుసుడీ! గడ్డకట్టుకొనిపోయిన మీ నాగరికతను చితుకకొట్టుటకై భగవంతుడు 'ఆంగ్లరాచరిక'మను సమ్మెటను తెచ్చి పెట్టినాడు.

నేడు జవాహరుపండితునివలెనే దివ్యజ్ఞాన సంపన్నుడగు వివేకానందుడు కూడ పాశ్చాత్యులనుండి భౌతికవిజ్ఞానమును మిక్కుటముగా మనము గ్రహించవలెనని ఉద్బోధించినాడు. ఆత్మబలము, మనోదృఢత సంపాదించనిది మనకు స్వరాజ్యం రాదు. వచ్చినా

మనం దానిని నిలుపుకోలేము. అందుకొరకు స్వయం శక్తిని ఇనుమడింపచేసుకోవాలి. జీవనయాత్రకు వలయు సమస్త పరికరములు దేశములో తయారు కావలెను. ఇతరులమీద ఆధారపడు దేశము దారిద్ర్యము బారినుండి బయటపడజాలదు. ఈశక్తి ఒక్కవిద్యా వ్యాప్తిలోనే ఉన్నది. స్వార్థత్యాగులై అనేకమంది చదువు నేర్పినవారి యుద్యమమునకు పూనవలయును. ఆ విద్యకూడ మాతృభాషలోనే యుండవలయును అను విషయమును ఆయన దూరదృష్టి ఎన్నడో కనిపెట్టినది. ఆంగ్ల భాషా వ్యామోహమునుకూడ ఆయన నిందించక వదలలేదు. 'ప్రతివిద్యార్థిని కాళ్లను చుట్టవేసుకొని 'బువ్వెట్టు బాబయ్యా!' అంటూ మొత్తుకొను కన్నబిడ్డల గుంపొకటె! కటా! మీ పొత్తములను, మీ గౌనులను, మీ విశ్వవిద్యాలయ యోగ్యతా పత్రములను అన్నిటిని, మిమ్ములను ఒక్కుమ్మడిని ముంచివేయుటకు చాలినన్ని నీళ్లైనను సముద్రములో లేవా?' 'దరిద్రుల యెడలను, పతితులయెడలను, అణగద్రొక్కబడినవారి యెడలను' అనుతాపము, స్వార్థత్యాగము చూపగోరు యువకులను ఆయన ఆహ్వానించినాడు. వారిమీదనే భారతదేశపు భావిభాగ్యోదయము ఆధారపడిన దని యెలుగెత్తి చాటినాడు.

'హెచ్చుగ అధ్యాత్మ పరాయణమగు నాగరికము పాశ్చాత్యులకును, హెచ్చుగ ఐహికమగు నాగరికము మనకును కావలసి యున్నది.' కేవలము భౌతిక తత్త్వోపాసకులై సృష్టిని స్వార్థ—పాపపంకిలము చేయు పాశ్చాత్యులకును, తాను జీవించియున్న ప్రపంచము అనిత్య మని, పరలోకముకొరకు పరితపించు భారతీయులకును పైవాక్యములు ఎంతటి స్పృహణీయములో వేరుగా చెప్పనక్కరలేదు.

గాంధిమహాత్మునియందు వివేకానందుని భావము లెన్నియో క్రియారూపము దాల్చినవి. తాను సన్యాసియయి ఇతరులను సుఖపెట్ట నెంచుట, తనకు ఇల్లు, కట్ట బట్ట లేకుండ చేసికొని ఇతరులకు చక్కని గృహములు, సరిపడిన వస్త్రములు లభించవలెనని గోరు మహాత్మునివలెనే వివేకానందుడును తాను సన్యాసియయ్యు భారతీయసంఘమును పునరుద్ధరింప వలె నని కష్టపడినాడు. ఇతరుల మెప్పుకు ఎన్నడు ఏకార్యమును చేయవద్దనియు, తాను చేయబోవు పనియందు అఖండమయిన శ్రద్ధ, ఉత్సాహము ఉండవలె ననియు తన యనుచరులకు బోధించినాడు.— 'దోషములు, దుఃఖములు, మోహములు, మున్నగు వానితో నిండియున్న సంసార తరంగిణిలో చిక్కి యుండియు, ధైర్యము వహించి, ఒక చేతితో కన్నిటిని తుడుచుకొనుచును జంకుపడక, రెండవచేతితో ముక్తిమార్గమును చూపు పురుషవరేణ్యుడే నిజముగ వీరుడు.' ఆలోచనల కంటె కార్యాచరణయం దతనికి ప్రీతి మెండు. అందుకనే ఆయన— 'రెండవ వానికి దేనియందు విశ్వాసము గలదో అను విషయము ప్రధానము కాదు. అతడు కార్యశూరుడై మాత్రము ఉండవలయును.'

భారతదేశము మతమునకు పుట్టినిల్లు. భారతదేశము నుద్ధరించుటకు మతమునే ఆధారముగా తీసుకొనవలయు నని ఆయనవిశ్వాసము. కాని అప్పటిపరిస్థితులు ఆయనకు అనుకూలించినట్లు కనపడవు. ఆయన అందుకే విదేశములకు పోయి పరోక్షంగా మనలో చైతన్యము కలిగించవలెనని చూచినాడు.

వివేకానందుడు బ్రహ్మజ్ఞానమును పొందిన పరమయోగి. ప్రపంచమున కంతకు చిరంతన సందేశ మిచ్చిన మహోపదేశకుడు. క్షణములో ధగద్ధగాయమానముగ మెరిసి సమసిపోవు విద్యుల్లతవలె ఆయన బ్రతికినది కొద్దినాళ్లయినా, భారతదేశపు ప్రాచీనవైభవమును ఇతర ప్రపంచమునకు చాటిన మేటి. ఆత్మశక్తిని కోల్పోయి, నిర్జీవమయిన భారతదేశమునకు ప్రాణశక్తిని కలుగచేయ తపస్సు ధారవోసిన తపస్సంపన్నుడు. ఆయన లేఖలు ప్రతియింటను పఠింపబడాలి. అధ్యాత్మి భౌతికవిద్యల సారమోయను వివేకానందుని లేఖలు ఇతరభాషలలో ఎక్కువగా అనువదింపబడినవి. ఆంధ్రములో కూడ ఇంత చక్కగా అనువదించి ఆంధ్రలోకమునకు అందించిన శ్రీ తత్త్వానందగారు చాల ప్రశంసాపాత్రులు. పుస్తకంలోని భాష అత్యంతరమణీయముగా నున్నది. భాషలోని ప్రవాహశుద్ధి ఇది అనువాదమా, లేక మూలమా అనుశంకను కలగజేయుచున్నది. షుమారు ౨౦౦ పేజీల పుస్తకం పన్నెం

డణాల వెలకు విక్రయింపబూనుట స్వభావమందలి మక్కువయేయని చెప్పక తప్పదు. వివేకానందుని మిగిలిన రచనలను ఇదే ఫక్కీలో సరసంగా అనువదించి చదువరులకు అందచేస్తారని ఆశిస్తున్నాను.

యు. వెంకటేశ్వరరావు.

---

## వి ద్యా ర్థి

కర్త: కామ్రేడ్ శెట్టిపల్లి, రైతాంగ గ్రంథమాల, గుడివాడ, వెల ఒక అణా.

ప్రపంచభావ్యభివృద్ధికి విద్యార్థులే యాధారము కావున నేటి విద్యార్థు లందరును రాజకీయరంగములో ప్రవేశించుటకు ఉత్సాహజనకముగ నీపుస్తకము వ్రాయబడినది. విద్యార్థులు రాజకీయములలో కొంతవరకు పాల్గొనవలయునని దేశనాయకు లందరి యభిప్రాయమైనను, ఎంతవరకు పాల్గొనవలయునో ఎవరును నిర్ణయింపలేకున్నారు. సక్రమమైన పంథా లేకుండుటచేత విద్యార్థు లెవరికి దోచినరీతిని వారు నడచుచున్నారు. జవహర్లాలుపండితుడుకూడ ఇటీవల వ్రాసిన వ్యాసములలో నీవిషయమును హెచ్చరించినాడు. ఈపుస్తకము విద్యార్థులను పాఠశాలలు వదలిపెట్టి కార్మిక కర్షక సేవ చేయుమని బోధించుచున్నది. పాఠశాలను వదలిన వెంటనే బాల్యమున నేర్వదగిన విద్య కంతరాయము సంభవించగలదు. విద్యార్థిగానే యుండి రాజకీయమున శెలిసముగ తోడ్పడవలయునో బోధింపవలయునుగాని చదువుకు స్వస్తి చెప్పుట సమంజసము కాదు. కాని చాలామంది విద్యార్థులు వార్తాపత్రికనైన చదువక కలుర్లతో కాలమును వ్యర్థపరచుచున్నారు. ఈ పుస్తకమందలి క్రిందివాక్యములు విద్యార్థులు ముఖ్యముగా గమనించదగినవి. "నీ విహారము విలాసభూములలో కాదు. హోటలులలో చేరి బూతుల పంచాంగముల విప్పుట కాదు."

వెం. శ్రీ.

---

## కమ్యూనిజానికే జయం

అనువాదకుడు: నవయుగ శాంతియా, ఆదర్శ గ్రంథమండలి, ఎలమఱ్ఱు, కృష్ణాజిల్లా, వెల ఒక అణా.

ఇది డిమిట్రాఫ్ పుస్తకమున కనువాదము. యూరపులో ఇటలీ జర్మనీలు ఫాసిజమును ప్రచారము చేయుచు పరరాజ్యాక్రమణ గావించుచున్నవి. హిట్లరు యూరపు మధ్యభాగమునంతయు ఆక్రమించి రష్యాలోని కమ్యూనిజమును సమూలముగా పెల్లగించవలెనని కొనినాడు. బ్రిటిషు ఫ్రెంచి ప్రభుత్వములు బహిరంగముగా సహాయము చేయకున్నను, లోలోపల తోడ్పాటు గావించుటచేత ఫాసిజము ఆటలు సాగుచున్నను, ఫాసిజము వెన్నెముక విరుగగొట్టగల శక్తులు ప్రపంచములో నశించలేదని డిమిట్రాఫ్ యభిప్రాయము. కాని ఇప్పటి కప్పుడే ఫాసిజము తీవ్రరూపమును దాల్చినది. జర్మనీ సామ్రాజ్యము యుద్ధపూర్వాకారమును వహించుచున్నది. ఇటలీ, జర్మనీ, జపాను, స్పెయినురాజ్యములు ఏకోన్ముఖమైనప్పుడు ఫాసిజము సామాన్యముగా పరాజయము పొందదు; డిమిట్రాఫ్ ఫాసిజమును కూలద్రోయుటకు కారల్ మార్క్సు మంత్రమునే పునశ్చరణ చేయుచున్నాడు.

'ప్రపంచములోని కార్మికులారా! ఏకముకండు.'

వెం. శ్రీ.

---

## మా ల పి ల్ల

కర్త: గద్దె లింగయ్య, ఆదర్శగ్రంథమండలి, ఎలమఱ్ఱు, కృష్ణాజిల్లా. వెల నాలుగణాలు.

ఇదొక చిన్న సాంఘిక నవల. మోహనరావు సనాతన హిందూకుటుంబములో జన్మించినాడు. తలిదండ్రులు బలవంతపెట్టినను బి. ఏ. వరకు పెండ్లిచేసికొనలేదు. బందరు కళాశాలలో నితని తరగతిలో ఫాదరీకుమార్తెయైన మేరీ చదువుచున్నది. వీరిద్దరికిని ప్రథమపరిచయము దరిద్రజనసేవలో కల్గినది. ఇద్దరి యాశయములు నొకటైనవి. పరిచయముతోబాటు

ప్రణయమును నభివృద్ధి జెంది పరిణయముగా ఫలించినది. ఈ వివాహమునకు సమ్మతింపని జననీజనకులమాటను మోహనుడు లెక్క పెట్టలేదు. తరుపరి మేరీ మోహను లిరువురును రాజకీయములందు తీవ్రముగా పాల్గొని జైలునకు పోయివచ్చి సుఖముగా కాలము గడుపుదురు.

కథయందంతటను సామ్యవాదానుకూలభావములు విరివిగా నున్నవి. సంభాషణ లొక్కొక్కచోట ఉపన్యాసరూపమును దాల్చినవి. సహజముగా నుండ వలెనన్న సంభాషణలు ప్రశ్నోత్తరరూపమున క్లుప్త ముగా నుండుట యుక్తము. సంఘసంస్కారమునకును, రాజకీయవిషయబోధనమునకును ఇట్టినవలలు బాగుగా నుపకరింపగలవు.

వెం. శ్రీ.

---

## చీనా-జపాను, జెకొస్లొవేకియా-జర్మనీ

కర్త: కే. రంగాచార్యుడు, రామానుజాచార్య విద్యాసమితి, విజయనగరము. వెల అరణాలు.

ఈ పుస్తకమునందు ప్రథమ ప్రకరణమున చీనా జపానులమధ్య ద్వేషమెట్లు రగుల్కొనినదియు, ౧౯౧౮ నుండి నేటివరకు చైనాలో కుట్రలు పన్ని అంతఃకల హములు గల్పించి, చైనాదేశీయులను జపాను ప్రభుత్వ మెట్లు హింసించుచున్నదియు తెలుపబడినది.

ద్వితీయ ప్రకరణమందు జర్మనీ— జెకొస్లొ వేకియా సమస్య పూర్వోత్తరములు చర్చింపబడినవి. ఈ సమస్యలో జెకొస్లొవేకియా కన్యాయము జరుగ లేదని గ్రంథకర్త యభిప్రాయము. ఐరోపామహా సంగ్రామానంతర మీరాజ్యము సృష్టింపబడినది. వివిధ జాతులతోబాటీరాజ్యమునందు మూడుకోట్ల జర్మను లున్నారు. ౧౯౧౯ నుండియు జెకొస్లోవేకియా జర్మనులకు జేసిన ప్రమాణములను నిలువబెట్టుకొనక, ఉద్యోగాది విషయములలో పక్షపాతము వహించి జర్మనుల కన్యా యముచేసిరని గ్రంథకర్త వాదము. డాక్టరు బెనిష్ మొదటినుండియు జర్మనులకు వ్యతిరేకముగా సంచరించు టచేత 'తుదకు హిట్లరు కత్తి ఝుళిపించినగాని మూడు కోటులజర్మనులకు న్యాయము జరిగినది కా' దట! ఈ విషయమున గ్రంథకర్తతో నేకీభవించుట కష్టము. జెకొస్లొవేకియా ప్రభుత్వవిధాన మాదర్శప్రాయమైనదని ప్రసిద్ధము. హిట్లరు 'కత్తి ఝుళిపించుట' స్వీయరాజ్య తృష్ణచేతగాని పరోపకారబుద్ధిచేతకాదని ఇటీవలి పరి స్థితులవలన స్పష్టముగా దెలియుచున్నది. ఇంగ్లండు, ఫ్రాన్సులు జెకొస్లొవేకియా విషయమున మూకీభావము వహించుట ఆత్మలాభపరాయణత్వముచేతగాని, హిట్లరు న్యాయస్థాపనచేయుచున్నాడని కాదు.

వెంపటి శ్రీనివాసమూర్తి

---

## స్తుతిత్రయము

రచయిత: శ్రీ కొండూరు వెంకట శివరాజుగారు. ఈయన శ్రీరామభక్తుడు. అగస్త్య సంహితలోని శ్రీరామ స్తోత్రమును, 'రామా'యను మకుటంతో శ్రీరామశతకమును, 'అ' మొదలు కొని 'క్ష' వరకూగల అక్షరము లను అకారాదిక్రమమున ప్రతిపాదము మొదట వచ్చులాగు ఒక పద్యమాలికను వ్రాసి ఈ మూడింటినీ ఒక చిన్న పుస్తకంగా ప్రకటిం చారు. ఇందలి శ్రీరామశతకములో పూర్వా ధునిక కవుల స్తుతిస్తూ ఈ కవి తాను కీ. శే. వా॥ సుబ్బారావుగారి శిష్యవర్గములోని వాడుగ చెప్పికొని యున్నాడు. పుస్తకం చిన్నదేగాని శ్రీరామభక్తుల కిది నిత్యం పారాయణం చేయ డానికి తగివుంది. ఎందుకంటే ఇందలి శతకంలో సమగ్రరామాయణ కథ వరితమై యున్నది. వెల రు. ౦-౨-౦. పుస్తకం చెంగల్పట్టుజిల్లా, నాగలాపురంపోస్టు, సిద్ధరాజు ఖండ్రిగయందు గ్రంథకర్తగారికిగాని, మద్రాసు వావిళ్లరామ స్వామిశాస్త్రులు అండ్ సన్సుకుగాని వ్రాసి తెప్పించుకొనవచ్చును.

వే. సు.

# పత్రికా స్వీకారము

గృహలక్ష్మి-లలితకళాసంచిక:—౧౧ ఏండ్లు గడచి పన్నెండో సంవత్సరమందిన ద్వాదశి కాబట్టి ఈమె సకల కళాశోభితయై దర్శన మిచ్చింది. కనుపర్తి వరలక్ష్మమ్మగారు ఈ విషయాన్నే విశదీకరించారు. అడవి బాపిరాజుగారు చిత్రకళాచరిత్రాన్ని సంగ్రహంగా తెలియపరిచారు. ఆంధ్రులకూ ఒక ప్రత్యేకమైన జాతీయనాట్య మున్నది. దానిని మరల పైకి తేవలసినవారు ఆంధ్రులే యని కాశీపతిగారి యుపన్యాసము. మహాదేవుడు ధరించే కపాల, సర్ప, డమరు మొదలగువాని యంతరార్థం నాట్యకళకు సంబంధించిం దని మరియొక ప్రతిపాదన. ఏదైనా ఒక జాతియొక్క సభ్యతాధిక్యాన్ని గుర్తించాలంటే అక్కడి లలితకళాసంపదను పరిశీలించా లని వేరొకరి యభిప్రాయము. ఇటులే కళాసంబంధి కాంతుల వెదజల్లు వ్యాసా లిందులో అనేకము లున్నాయి. విఖ్యాతులైన లేఖక, చిత్రకారుల శిల్పనైపుణ్యాలతో బయటికి వెలువడిన ఈ కేసరిజాతను, ద్వాదశిని, అతుల ఆకులనా కమలారచితచిత్రశోభితను జూచిన ఎవరి కానందము గలుగకుండును ?

విభూతి:—ఇదీ క్రొత్తగా ఒక నెలక్రింద వెలువడిన పత్రికారాజము. పేరు సార్థకమయ్యేలాగు ఇందలి సంపుటాలకు పుండ్రాలనీ, సంచికలకు రేఖ లనీ నామకరణం చేశారు. ఉత్సాహ, సకల శాస్త్ర సంపన్నులైన దీనిసంపాదకులు శ్రీ చిదిరే మఠం వీరభద్రశర్మగారు. అందులో రాజకీయ కల్లోలంలో మునిగివున్న నిజాం ఇలాకాలోని సికింద్రాబాదునుంచి దీనిని వెలువరచగల్గడ మనేది వీరియొక్క దృఢమైన పట్టుదలను ప్రకటిస్తూఉంది. బాలకాలను ఉత్తరభారతమున పర్యటనం జేసి, విద్యార్జనం గావించి సంపాదించిన అమూల్యములైన అనుభవాలను శ్రీ శర్మ గారు ఈ పత్రికా రాజంద్వారా ప్రకటింప సమకట్టుట ఆంధ్రులభాగ్యమే యనవచ్చును. చప్పన చూస్తే పత్రిక కేవలం శైవసంబంధిలాగు కనబడుతుంది. కాని బాగా పరిశీలించినమీద సర్వజనోపయుక్తములైన వ్యాసాలకూ ఇందు చోటున్న దని తెలియకపోదు. ప్రతిబింబము లతోసహా ప్రాచీనశాసనములుకూడ ఈ చిన్న పత్రికలో ప్రకటింపబడుట ఒక విశేషము. సంపాదకులు ప్రతిజ్ఞ గావించినరీతిగా అనర్ఘనీయమై, జనాదరణీయమై విభూతి పుండ్రాలు తమరేఖాచంద్రికలను ఆంధ్రదేశ మంతటా వ్యాపింప చేస్తాయని మా యభిప్రాయం.

## నవశక్తి

(త్రిపురి సంచిక)

ఆంధ్రకాంగ్రెసు సోషలిస్టు పార్టీతరఫున వెలువడుచున్న 'నవశక్తి' వారపత్రికయొక్క త్రిపురి కాంగ్రెసు ప్రత్యేకసంచిక ౮-3-3౯-వ తేదీన నూతనాకారంతో ప్రశంసార్హమగురీతిని వెలువడినది. భారతిసైజులో ౧౦౮ పుటలుగల యీ సంచికయందు భారతీయస్వాతంత్ర్యోద్యమము, విప్లవోద్యమము, కాంగ్రెసు ఉద్యమముచరిత్ర లన్నియు సంగ్రహముగ తెలుపబడెను. ప్రథమ భారతస్వాతంత్ర్యసమరమునుండి, నేటి కాంగ్రెసు మంత్రివర్గములు చేసినపనివరకు ఎల్ల విషయములు క్రోడీకరింపబడినవి. రయితు, కార్మికోద్యమములు పుట్టు పూర్వోత్తరాలతోగూడ తెలుపబడెను. స్వదేశసంస్థానములగూర్చిగూడ ఒక వ్యాసము గలదు. అది, ఇది అననేల, భారతజాతీయోద్యమమునందభిలాషగల ప్రతి ఆంధ్రుడును యీ సంచికను మెచ్చుకొనక తప్పదనుట అతిశయోక్తి కానేరదు. ఇందలి అమూల్యమగు వ్యాసములు చదివిన ప్రతివారికి తమ కదివరకు తెలియని క్రొత్త విషయము లేవో కన్పడగలవు.

వ్యాసములతోబాటు సుభాసు మున్నగు కాంగ్రెసునాయకుల పటములే గాక, మీరటు, కాకోరి, లాహోరు కుట్రకేసు ఖైదీలపటములుగూడ ముద్రింపబడినవి. అయితే ఒక్కమాట చెప్పవలసియున్నది. వ్యాసములు విషయాన్ని బట్టియేగాక అచ్చునుబట్టిగూడ

ఎక్కువశ్రద్ధతో చదువవలసియుండును. ఇందుపయోగింపబడిన పైపు చదువుట, ఆఖరు తెరగలిలోనుండి సినిమా చూచినట్లుగా నుండును. సంచిక ౪ అణాల వెలకు మించిన విలువగల్గియున్నది.

"జ. కి."

ఆంధ్ర విశ్వకళాపరిషన్మహా విద్యాలయ పత్రిక:— ఆంధ్రాంగ్లేయ పత్రిక : ఇట్టిది విశ్వవిద్యాలయం ఏర్పడిననాటినుంచే సాగించవలసి వుండగా అట్లుగాక కడచిన జనవరి మాసంలో జన్మమెత్తి నేటికి మాకార్యస్థానం చేరింది. ఇట్టి పత్రికల వలన ఎట్టి ఆవసర మున్నదియు, విద్యా సంస్థల కెంతటి లాభము కలుగునదియు లోనను పంగతులను సైసుఛాన్సలర్ గారు వారికేంబ్రిజ్ విశ్వవిద్యాలయ నివాసకాలమున గలిగిన అనుభవములను బట్టి వర్ణించి విశదీకరించి చెప్పారు, ప్రస్తావనలోనే. ఆదేవదువున ఛాత్ర సముదాయమునకు వ్యాస రచనేయందేమి, ఇతర లౌకిక విషయములందేమి ఎంతటి లాభము గల్గునదియు ఇందులో విద్యార్థులు ప్రకటించిన ఆంధ్ర ఆంగ్లేయ వ్యాసములవలననూ, కథలవలనను, ప్రసంగాల వలనను స్పష్టమవుతూవుంది. దీనిచే సంపాదకుల మనోరథాలు సిద్ధించాలని మాకోరిక. చక్కని గద్య, పద్యవ్యాస రాజములతో శోభిల్లు ఈ పత్రిక ముందుముం దింకను పెంపుగాంచి, ఆంధ్ర విశ్వకళా పరిషత్తునకు పేరు తేగలదని ఆశిస్తున్నాము.

ఆనందవాణి:—ప్రమాది సంవత్సరాదిసంచిక మాకార్యస్థానం అలంకరించింది. ముఖ్యంగా సాంఘిక రాజకీయాది వ్యాసాలు పఠనార్హాలు. "ఇది ధనవంతులరాజ్యం" అనే శీర్షికలోని ఉద్దేశాలు సఫలీకృతా లయితే బహుజనానందం కలుగుతుంది. స్త్రీలయభివృద్ధిని సూచించే వ్యాసాలు గమనింపదగినవి. ప్రకృతియందలి కొన్ని ప్రాణుల సరసాలు ఒకవ్యాసంలో వర్ణితమైనాయి. అటులే రాజకీయవిషయికములైన గుసగుసలు, ముస్తాబులోనవు చిన్నకథలతో ఆనందవాణి తన పేరును సార్థకంగావించుకొనగలదు. రాజకీయనాయకుల చిత్రాలు దీని కన్నింటికి వన్నెతెస్తున్నాయి.

---

# గ్రంథస్వీకారం

---

నానా విషయక విరచనములు:— రచయిత శ్రీ కూచి నరసింహంపంతులుగారు. పిఠాపురం, శ్రీకృష్ణప్రెస్సులో ముద్రితము. వెల రు ౧-౦-౦.

భూగోళ వృత్తాంతము:— (రెండవ భాగము) బాల విజ్ఞాన తరంగిణి యందలి ఆరవతరంగము. గ్రంథకర్త: శ్రీ కూచి నరసింహం పంతులుగారు. వెల రు. ౦-౧౨-౦.

జాతీయాంతర్జాతీయ నాటికలు :— ఇది నాట్యభారతి గ్రంథమాలలోని మూడో గ్రంథం. గ్రంథకర్త: శ్రీ మల్లాది అవధానిగారు. విజయనగరం. వెల రు. ౦-౪-౦.

పావం- :— ఇది వక పుస్తిక అనంతపురం నవ్యసాహిత్య మాలలోని ఆరవప్రచురణం. సాధన ప్రెస్సులో ముద్రితం: రచయిత విద్వాన్ విశ్వం గారు. దీనితోగూడా ఉగాది కానుక.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor:— S. Sambhu Prasad.

త్వరలో విడుదల కానున్నది.

శ్రీ శారదా రాయలసీమ ఫిలిమ్స్‌వారి

# జయప్రద

డైరెక్టరు :— **చిత్రపు నరసింహరావు**

మ్యూజిక్ డైరెక్టరు :— **మాస్టర్ ఎస్. రాజేశ్వరరావు.**



**నటీనటవర్గము :**

| | |
|---|---|
| సి. యస్. ఆర్, | మాస్టర్ సత్యం, |
| కుంచాసిచ్ఛయ్య, | సూరి, |
| బి. వి. ఆంజనేయులు, | యశోద, |
| నరసింహారావు, | లలిత, |
| బై రెడ్డి, | సంపూర్ణ. |
| కమాల్, | |

ఈ టాకీలోని గీతములు హిస్ మాస్టర్స్ వాయిస్ ప్లేట్లలో వినండి!

*For bookings:*—**Sree Sarada Rayalaseema Films Ltd.,**
No. 6, Harrington Road, Chetpat, MADRAS.